## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

[illegible]

శ్రీ విరాట్ పోతులూరి వీరబ్రహ్మేంద్రస్వామినే నమః



# వీరబ్రహ్మముగారి

# నాటకము








—: రచయిత :—

వంశపరంపరానుభవ వైద్య, జ్యోతిషరత్న, వాస్తు స్వయంభువు

**శ్రీమాన్ తిరుమలనల్లాన్ చక్రవర్తుల**

**వేంకట వరదాచార్యులు,**

**బొందలదిన్నె (పోష్టు) - తాడిపత్రి (బ్రాంచి)**

తాడిపత్రి తా॥) **1975** (అనంతపురం జిల్లా.




— **వెల రు. 5-00**


Sri Rangaramanuja Press, Tadpatri

శ్రీ రాఘవేంద్ర గురుభ్యోనమః

# విజ్ఞాపన.

మహాశయులారా!

ఖగోళములో హరిహర రూపమున నవగ్రహములు రెండుభాగము లైనవి. గ్రహరూపీ జనార్దన, గ్రహరూపీ మహేశ్వర అన్న వాక్య ప్రకారము - గురు, కుజ, రవి, చంద్ర, కేతు గ్రహములు హరి అంశయనియు - శని, శుక్ర, బుధ, రాహు గ్రహములు హరుని అంశయనియు చెప్పుదురు. - హరి అంశయందు జనించినవారిని గురు పాలితులనియు, - హరుని అంశయందు జనించినవారిని శని పాలితులనియు అందురు. - గురు పాలితుల శని పాలితులు, శని పాలితుల గురు పాలితులు లయము చేయుచుందురు. - ఇట్టి విమర్శ, జ్యోతిశ్శాస్త్రమునందు గలదు.

ద్వాదశ లగ్నములలో ఏ లగ్నమునకైనను లగ్న, పంచమ, భాగ్య స్థానాధిపతులు ముగ్గురు బలముగా ఏకరాశియందు, ఏక నక్షత్రమునందు కలసియున్నప్పుడు - కవులు, గాయకులు, మేధావులు, ప్రజ్ఞావంతులు, పండితులు, జోష్యులు, మహాభక్తులు, పుణ్యాత్ములు, ధర్మాత్ములు, త్యాగులు, రాజులు, ఉన్నతోద్యోగులు పుట్టుచుందురు. ప్రపంచమునకు మార్గదర్శకులుగా నుందురు. ఎన్నియో జాతకములు నిదర్శనముగా నున్నవి. దృక్కుకు గనబడుచున్నవి అట్టివారు కననివి, విననివి తెలుసుకొనుచుందురు. వారి వూహ గమ్యస్థానము చేరుచుండును. - అందులో మహాతపస్వులకు లగ్న, పంచమ, నవమములందే ఆ ముగ్గురు కలసివుందురు. ఈ కలయిక ఖగోళమున కలిగినప్పుడే ఇట్టివారు పుట్టుచుందురు. ఆ సమయములో అప్రయోజకులు పొరపాటున పుట్టినను అకాలమృత్యువువాత బడుచుందురు. మహాతపశ్శాలురే మిగులుచుందురు.

మహాతపస్సంపన్నులై, ముందుజన్మమున ఇంతో అంతో కొరతగలిగి కారణజన్ములై జననమొందుచుందురు. - వీరిలో కొందరు భక్తిపంథానను సరించి, మోక్షమునాశించి ముక్తికి పోవుచుందురు. మరికొందరు జీవసమాధిని పొందు శక్తి నార్జించుకొని, ఇహమునందేయుండి, తన్నుగురించి ఎక్కడేమనుకొన్నను వినగలశక్తి, కనగలుగుశక్తి, భక్తాదులిచ్చెడి పూజాది నైవేద్యముల గ్రహించుశక్తి, కామరూపియై సంచరించుశక్తి, సూక్ష్మదేహమున

ఏ లోకమునకైనను పోగలుగుశక్తి - ఇట్టిదననేల. సర్వశక్తుల నార్జించుకొని యుందురు. - శిలలతో మాట్లాడింతురు. వృక్షముల పలుకరింతురు. పశు వ్వలతో వేదపారాయణము చేయింతురు. పంచభూతముల చెలరేపుదురు. - చెలరేగిన పంచభూతముల నణచుదురు. ఇట్టివి సమయానుకూలముగా ఎన్నో చేయుదురు. ముక్తికి పోయినవారు ఇట్టి మహామహిమల చూపుటకు వీలు లేదు. - గాన ముక్తికన్నను జీవసమాధి గొప్పదనక తప్పదు.

అట్టి జీవసమాధి పొందినవారిలో శ్రీ శ్రీ వీరబ్రహ్మముగారు వకరు. వీరి చరిత్రలో చరిత్రకు భిన్నములేకుండ ఎన్నిమార్గములు పోయినను ఇది కాదనుటకు వీలులేదు. వారితో కానిదేదీలేదు. - గాన దశావతారముల తన చాకుడుతల్లికి చూపినట్లు, కలరాదేవతను చూపించినట్లు, తన కమండలము చెంబును దొంగలించు దొంగల చెంబునకు కరిపించినట్లు, కాళ్లు భూమికి కర చకపోయినట్లు, బ్రహ్మానందరెడ్డికి కనుచూపు గలిగించినట్లు, చెట్లతో వృషభ ములతో మాట్లాడినట్లు, అవ్వల గిరలో నెలబెట్టి కడుపునిండునట్లు చేసినట్లు, మంచినీళ్ళదీప మెలిగించినట్లు, స్వప్నములో గోవిందమ్మతో మాట్లాడినట్లు, చచ్చినవానిని బ్రతికించి, బ్రతికినవానిని చచ్చినాడని నిరూపించి బ్రతికించినట్లు, స్వప్నములో గోవిందమ్మకు తాళిగట్టినట్లు, బిడ్డలులేరని కలుగునట్లు దీవించ మన్న దూదేకుల బుడ్డేఖా ఆశ్చర్యపడునట్లు నీభార్య గర్భవతి, గర్భమునందు న్నవాడు ప్రసిద్ధుడు, సిద్దుడు నా శిష్యుడు కాగలడని చెప్పినట్లు, మాయా సుందరిని పుట్టించి సిద్దయ్యను పరీక్షించినట్లు, పోలేరమ్మను అతిథిగా తనయిం టికి ఆతిథ్యమునకు పిలిచినట్లు, వియ్యము అయిపోయినపాత్ర అక్షయముగా చేసినట్లు, ఇట్టివి అనేకము జీవితచరిత్రలో లేనివి కల్పించితిని. వీరు వీర బ్రహ్మముగారు, గట్టుబంగారము. ఈ బంగారముతో ఎన్నిభూషణములైనా చేయవచ్చును. ప్రజోపయుక్తముగా ప్రజలకు భక్తిజ్ఞాన వైరాగ్యములు గలుగుటకై ఎన్నిదారుల గల్పించినను, వారిశక్తికి లోబడియేయుండును. మితిమీరివుండవని నా భావము. అందువల్ల నాస్తికవాదులకు సందివ్వక, ఈ విధముగా రచించితిని. ఈ కావ్యరచన సాగించుటకు వారి భారమేనని వ్రాసి తిని. భావములో, హృదయములో నునిచితిని. షట్‌చక్రవిధానము ప్రజ లకు బోధపడదు గాన భక్తిభావములో గురుశిష్యులు చెప్పునట్లొనర్చితిని. - లోకహితార్థమై శ్రీవారి కథను తీసుకొంటిని. వారి ఆదరణవల్ల, దయవల్ల వ్రాయగలిగితిని. ఇది వారొసంగిన శక్తియేగాని, నా శక్తిగాదని యెరింగితిని.

జీవితచరిత్రలో ఈ విషయములు లేవని తలంచువారుందురని, విజ్ఞాపనలో తెలుపుకొంటిని. - ఈ లోకమునుండి సువర్లోక పర్యంతము పోగలుగు శక్తిపరులకు, ఈ పనులు చేయుటొక గొప్పకాదు. కాళిదాసాది కవులు, భగవద్భక్తులు ఎన్నో యిట్టి మహత్తరకార్యములు చేసినట్లు వారి వారి జీవిత చరిత్రలందున్నవి.

శ్రీ శ్రీ వీరబ్రహ్మస్వాములవారు జీవసమాధిపొందిన మహనీయులు. తపశ్శాలురు. - నేను వ్రాసిన మహత్తులు చూపుటొక వింతగాదు. శక్తికి మీరిన ఘనకార్యము గాదు. సర్వజ్ఞుడు, భావవిభేదములేని పరమపావనుడు గాన అనుమానింప పనిలేదని విన్నవించుకొనుచుంటిని.

ఇట్లు, సుధీ విధేయుడు,

గ్రంధకర్త.



## ★ ఒక పాత్రధారి వేయదగు పాత్రలు ★

| | | | |
|---|---|---|---|
| 1 | నారద | — | సాదు, యోగి, ముసలిసాదు, సిద్దయ్య. |
| 2 | శంకరుడు | — | శరభయ్య, బ్రహ్మానంద రెడ్డి, మునసబు. |
| 3 | పార్వతి | — | 1వ గోవిందమ్మ, మాయాసుందరి, పోలేరమ్మ, |
| 4 | 1వ వీరబ్రహ్మము. | | ప్రకృతిమాత. |
| 5 | వీరభద్రుడు | — | పండితుడు, 3వ వీరబ్రహ్మము. |
| 6 | వీరభోజయాచారి | — | శివకోటయ్య, పెద్దిరెడ్డి. |
| 7 | వీరపాపమాంబ | — | అచ్చమ్మ, శివమ్మ, 2వ గోవిందమ్మ. |
| 8 | నల్లిగాడు | — | భద్రిగాడు, పాపిరెడ్డి, మీసాల పాపిరెడ్డి. |
| 9 | మల్లిగాడు | — | సిద్దెంకన్న, బుచ్చెన్న, రామయ్య. |
| 10 | 2వ వీరబ్రహ్మము | — | పోతులూరు. |
| 11 | శక్తి | — | కాళి. |
| 12 | బడేసాబు | — | జవాను బుడ్డేఖా, బంట్రోతు బాబయ్య. |
| 13 | నవాబు | — | కడప నవాబు. |
| 14 | మంత్రి | — | కడప మంత్రి. |



## —: ఈ నాటకమునందు వచ్చు పాత్రధారులు :—

నారదుడు
శంకరుడు
పార్వతి
వీరభద్రుడు
వీరభోజయాచారి
వీరపాపమాంబ
సాదు (వీరభద్ర)
నల్లిగాడు
మల్లిగాడు
శరభయ్య
ప్రథమ వీరబ్రహ్మము
ఆసాది భద్రిగాడు
సి వెంకన్న
రెండవ వీరబ్రహ్మము
శక్తి
పార్వతి
సాదువు
ముగ్గురు దొంగలు
అచ్చమ్మ
బడేసాబు
బ్రహ్మానంద రెడ్డి
బుచ్చన్న
పండితుడు
కాళి
యోగి

నవాబు
మంత్రి
జవాన్
శివకోటయ్యాచారి
ముసలి సాదు
శివమ్మ
గోవిందమ్మ
నలువురైదుగురు ప్రజలు
చచ్చినవాడు
పాపిరెడ్డి
బుడ్డేఖా
సిద్దయ్య
మూడవ వీరబ్రహ్మము
పోతులూరు
మాయాసుందరి
మునసబు
మీసాల పాపిరెడ్డి
పెద్దిరెడ్డి
బాబయ్య
ఆసాదివాళ్లు
కొమ్ముబాడు
పోలేరమ్మ
నవాబు రజాక్
మంత్రి బుడ్డేఖా
రామయ్య



శ్రీ వీరబ్రహ్మ గురుభ్యోనమః

మఠము.
17-11-75

శ్రీ శ్రీ శ్రీమద్విరాట్ పోతులూరు వీరబ్రహ్మేంద్రస్వామి మఠాధిపతులు
శ్రీ శ్రీ శ్రీ వీరభోగ వసంత వేంకటేశ్వరస్వాములవారి
దివ్యసన్నిధానమునుండి

---

అస్మదత్యంత ప్రియ భక్తాగ్రిణ్యులగు శ్రీమాన్ తిరుమల నల్లాన్ చక్రవర్తుల వేంకట వరదాచార్యులవారికి —

మీకు సర్వదా ఆయురారోగ్య భాగ్యములు గలుగజేయ శ్రీ వీర బ్రహ్మ భగవానుని ప్రార్థించుచు వ్రాయు ఉత్తరము.

మీరు పంపిన శ్రీ వీరబ్రహ్మముగారి నాటకము ముట్టినది చాలా సంతోషము. ఇందువెంట శ్రీ స్వామివారి మహాప్రసాదము, పూజా ద్రవ్యములు పంపుచున్నాము. స్వీకరించగలరు.

ఇట్లు - భవత్ శ్రేయోభిలాషి,
**శ్రీ శ్రీ వీరభోగ వసంత వేంకటేశ్వరస్వాములవారు,**
"కందిమల్లయపుర సంస్థానము"
**కందిమల్లాయపల్లె పోష్టు.**
బద్వేలు తాలూకా.) — (కడప జిల్లా.



ముద్రణ :- శ్రీ రంగరామానుజ ప్రెస్, తాడిపత్రి.

శ్రీః

వాస్తుజ్యోతిరాయుర్వేదశాస్త్రకోవిద గద్యపద్యరచనావిశారద
ఉభయవేదాంతప్రవర్తక
శ్రీమాన్ తిరుమల నల్లాన్‌చక్రవర్తుల
వేంకట వరదాచార్యమహోదయ సుహృత్సన్నిధికి

## ❋ అభినందనము ❋

కం॥ శ్రీరమ్య రత్నమయా గం
భీర విరాట్ప్రోతులూరు వీరబ్రహ్మో
దారచరిత్రము మేల్ బం
గారపు భూషణము గాదె? నికషమ్ముల్.

మ॥ పరదారార్థ పరాఙ్ముఖుండు మురజిత్పాదాబ్జభక్తుండు శ్రీ
వరదాచార్యుఁడు వైష్ణవోత్తముఁడు వాగ్వైదగ్ధిగన్పింప నాం
ధ్రరసజ్ఞుల్ పులకింప విస్ఫురిత వీరబ్రహ్మ చారిత్రముల్
విరచించెన్ గనులుంజెవుల్ తనియ నుర్విన్ యోగపద్యమ్ముగన్.

(ఇది దృశ్యకావ్యముకనుక ఏకకాలమున నేత్రములకు, కర్ణములకు విందుగొలుపునని భావము.)

మ॥ జనసామాన్యమునందు వాడఁబడుభాషన్ దేటతెల్లమ్ముగాఁ
బొనరించెన్ దననాటకీకరణనైపుణ్యమ్ము గణ్యమ్ముగా
మనజ్యోతిష్కుఁడు వైద్యశేఖరుఁడు సామాన్యుండె! కీర్త్యంగనా
ఘనపాణిగ్రహణప్రయత్నరతుఁడై కాంచెన్ జయాహ్లాదమున్.

శా॥ జ్యోతిశ్శాస్త్రమునందుఁ జెప్పఁబడెనంచున్ బండితుల్ పామరుల్
చేతఃపద్ధతి గొత్తదాటుఁగొని వల్లింపన్ బహుశ్లోకముల్
రోఁతైపోయె. యదార్థభావఫలముల్ రూపించువారెవ్వరి? ధీ
చాతుర్యమ్మునఁ దానొకండు వరదాచార్యుండు సాధించెడిన్.

తే॥ గీ॥ సరస తిరుమల నల్లానుచక్రవర్తి
వంశ్యుఁడు వరదాచార్యధీవరుఁడు వ్రాసె
వ్రాయుచున్నాఁడు మఱి పెక్కు వ్రాయఁగలఁడు
సప్తసంతతిశ్రేష్ఠముల్ సరసకృతులు.

సి. వి. సుబ్బన్న, శతావధాని.
ప్రొద్దుటూరు. — 17-11-75

# నాకు తోచిన మాట.

"నాటకాంతం సాహిత్యం" అన్నారు అనుభవజ్ఞులు. వినుకలి కన్న కనుకలి మిన్నయనుట మన నిత్యానుభవనిరూపితము. ప్రత్యక్షదృశ్యము లే స్నిగ్ధ ముగ్ధ కోమలహృదయ దర్పణములందు హత్తుకొని చెదరక మెదలు చుండును. అంతేకాదు. మరియొకటి గమనింపఁదగి ఉన్నది. మనోభావము లను - అందలి అవ్యక్త సూక్ష్మాంశములను వింగడించుటకును, వానిని తళు క్కున మెఱయించి, సాత్త్వికభావవిజృంభణముతో ఒంటబట్టించుకొని, ఆనంద మున నోలలాడింపఁజేయుటకును, ప్రత్యక్షచతుర్విధాభినయముతో ఒక్క లిప్త కాలములో సాగు సన్నివేశములను వ్రాతలలో చిత్రించుటకు వృథా కాల యాపనము- ముథావాగ్వ్యయము అగును. అయినను పూర్తిగా ప్రయోజన మును సాధించుట దుస్తరమే. - "కావ్యేషు నాటకం రమ్యం" (కావ్య+ ఇషు=కావ్యబాణము) అని ఊరక అన్నారా మరి?

నాటకరచనకు సర్వతోముఖచాతుర్యము కావలెను. కేవలము పలుకు బడి ఛందోలంకారగుంఫనము చాలదు. ప్రయోగనైపుణి- తద్వారా సామా జికవర్గమున కలుగు భావసంచలన పరిణామముల విషయమున దూరదృష్టి - ప్రజకు తానందీవలసిన ఉపదేశ - సందేశ - సంస్కారములు సక్రమముగ ఫలించుటకును, విపరీతమై వెఱ్ఱితలలు వేయకుండ అడపగలందులకును, భావ భాషా సంయమనములును అవసరము. అందులకు తాను కవియు, నటుడు, ప్రేక్షకుడు మాత్రమేకాక- భావుకుడుగా చిరకాలానుభవశాలిగా గూడనై ఉండవలెను. ఇతర గ్రంథరచయితలకంటె, నాటకరచయితలు అన్నిభాషల యందును అల్పసంఖ్యాకులగుటకును, ఆదిలో అసలే లేకుండుటకును, ఆ యోగ్యతలు మృగ్యములగుటే ముఖ్యకారణము.

శ్రీమాన్ వరదాచార్యులుగారు ఇంతవరకు గద్య పద్య గ్రంథముల పెక్కులుగ రచించుటే కాక చిన్ననాటినుండి యంత్ర గాత్ర సంగీతములందు తాము నిపుణులై నాటక సమాజములకు తగిన తర్ఫీదు లొసంగునలవాటు కలవారగుటచే నాటకరచనమునకు సర్వవిధముల యోగ్యులు. - ఇక నాటక వస్తువా? ఒక అమరజీవి సిద్ధపురుషుని అమల జీవితగాధ. బంగారముతో రత్న మునకు సంయోగము కలిగినది. - ఈ యమూల్య సువర్ణ రత్నాభరణము

సరస సహృదయ తాముల్యములతో విలువఁబడి, తత్సురుచిర సుకుమార సుందర శుద్ధదీప్తులతో పాఠక ప్రేక్షకలోకను వెలిగింపఁబడుగాక.

ఆచార్యులుగారు కవికిగల స్వాతంత్ర్యమును కావలసినంత కబళించి, యౌచిత్యపస్కారముల కల్పించియైన జొప్పించి, అనౌచితీ మూలకములైన యంశముల జనవాడుకలో నున్నవానినైనను తొలగించి, ప్రదర్శనయోగ్యము - సందర్శనయోగ్యము - సంభావనాయోగ్యముగ నీరచనను నిర్వహింపఁగలిగిరి. అవకాశమును పురస్కరించుకొని, ఒక్కొక్కెడ కల్పించుకొనినైయెన నేటి జనసామాన్యమునకు అవసరమైన నీతిధర్మరీతులు - భక్తి ముక్తి మార్గములు - మూఢాచార నిర్మూలనములు - సర్వజన సర్వమత సమభావ సమన్వయము - సాంఘిక సంస్కరణములు - జ్యోతిష వైద్యాది శాస్త్ర రహస్యములు - పారమార్థిక వేదాంత మర్మములు - సులభ సుందర పద్ధతులతో నూతన ఫక్కికలో కాంతాసమ్మితోపదేశము చేసిరి.

వీరు పుట్టువైష్ణవులై - రాఘవేంద్రుని గురువుగా నంగీకరించి, వీర బ్రహ్మము చరితము నారాధించుటలోనే వీరి మనస్సంస్కృతి యెంత నిర్మత్సరమో, యెంత మహదాశయ మహిమాసంపన్నమో మన యూహకు తోచకమానదు. ఈనాటికి వలయు మతభావ సంస్కరణముల నీగ్రంధరూపమున నందిచ్చిన శ్రీ ఆచార్యులవారు ప్రశంసనీయులు. కథలోని పాత్రలకును, ఆ పాత్రలు జీవించియుండిన మండలమునకును ఉచితమైన భాషను ప్రయోగించుటలో వీరి తాదాత్మ్యకత్వము కనిపించును.

ఇట్టి రచయితకు ఇతోధిక సద్గ్రంథ రచనావకాశమును సమకూర్చు భారము కేవలము దైవముపైన వేయక, వీరి రచనల నన్నింటిని కనీసపు ప్రకటిత వెలకు కొని చదువుపాటి చేయూతనైన నొసగుట మనవంటివారికి కనీసధర్మమని మనవిచేయుదును.

తాడిపత్రి.
20-11-1975

చిత్తగింపుఁడు
జోస్యము జనార్దనశాస్త్రి

---

సమయమునకు తగినట్లు చక్కఁగా ముద్రణచేసియిచ్చిన శ్రీ రంగరామానుజప్రెస్ ప్రొప్రయిటరు శ్రీ కె. రంగయ్యగారికి, ముద్రణాలయ పనివారికి శ్రీ వీరబ్రహ్మేంద్ర స్వామివారు ఆయురారోగ్య భాగ్యము లొసంగుదురుగాక. — రచయిత.

శ్రీ విరాట్ పోతులూరు వీరబ్రహ్మేంద్రస్వామి



ఉ॥ శ్రీ విమలప్రభావుడయి జీవసమాధినిపొంది భక్తులన్
గావగ కల్పవృక్షమయి, కాలము పోకడ తెల్పు బ్రహ్మమున్
భావమునందు నిల్పుకొని, వ్రాయగబూనితి నాటకంబుగా
జీవిత సచ్చరిత్రమును శ్రీలొసగూర్పగ వారిభార మే.

ఉ॥ శ్రీ విభవంబులన్ వెలయు చిన్మయు సద్గురు, రాజయోగి సద్
భావపయోధి జ్ఞానఖని, ధార్మికు, శాంతు త్రికాలవేదినిన్
పావను బ్రహ్మమున్ దలతు వ్రాసెడి కావ్యయశంబు వర్ధిలన్
భావిస్థిరంబుగన్ నిలువ పౌరులుచూచి తరింప నిద్ధరన్

కం॥ వీరబ్రహ్మ గురూత్తము
ధీరయశోదారు సుగుణు తేజస్వి సదా
చారపరాయణు నిర్మలు
కారణజన్మున్ దలంతు కావ్యోన్నతికై.

—: అంకితము :—

కం॥ వీరబ్రహ్మస్వాముల
వారికి నంకితమొనర్చి ప్రణుతులొనర్తున్
నారచనా నాటకమున్
నారసి శ్రీలొసగి ప్రీతి నాశీస్సులిడన్.

శ్రీ మద్రాఘవేంద్ర గురుభ్యోనమః

శ్రీ విరాట్ పోతులూరు వీరబ్రహ్మ గురుభ్యోనమః

శ్లో॥ శివం హరిం విధాతారం తత్పత్నీ స్తత్సుతాన్ గురూన్
నత్వా సమస్త ప్రత్యూహశాంతయే మంగళాయచ.

# శ్రీ వీరబ్రహ్మముగారి నాటకము

## ప్రథమాంకము — ప్రథమ రంగము.

"కైలాస ప్రాంతము" నారదముని ప్రవేశము.

నార :- బుద్ధిః కర్మానుసారిణి - అన్న నార్యోక్తి నిశ్చయమైనదన వలయును. నా బుద్ధికేమొచ్చినదో! ఒకచోట నిలుచుదమటన్న నిలువనీయదు. ఎవరేమనెదరో, ఎచ్చటేమి జరుగుచున్నదో, జరుగనున్నదో, ఎక్కడెవడు పుట్టునో, ఎక్కడెవడు చచ్చునో, ఎక్కడెక్కడ కలహాములు ఎప్పుడెప్పుడు జరుగునో అని ఆలోచించుచునే వుండును. వలదని, నీకెందుకని బుద్ధిని యెంత మందలించినను వూరకుండదు.

క॥ ఇల్లా యెచ్చటగానము
నిల్లాలా లేదు మొదలె నిది వృత్తియయెన్
పిల్లా, జల్లా, యిల్లా,
కల్లా కపటాల సృష్టికర్తా హర్తా.

అని నవ్వులాటగా ముమ్మూర్తులే అనుచుందురు. కోపగించుకొని ఊరకుండరాదా. ఊహూఁ ...... ఇక త్రిదేవుల చెంతకేగిన ఉక్కుళనగల కథ జ్ఞప్తికి తెచ్చుకొని

క॥ తిమ్మని బొమ్మగ చేయను
బొమ్మని తిమ్మగనొనర్చి పూజ్యత చెరపన్
బమ్మిటు నిను సృజియించెను
బొమ్మిక నీ కథలు తెలిసె పుట్టు విరాగీ.

అని నవ్వుదురు. కలహాభోజనా అని పిలుతురు. ఎన్ని పిలిచిన ఎన్ని అనిన చపలబుద్ధి మానదు. - ఈనాడు భూలోకమున శివభక్తులు జనన మొందు శుభదినమని మాతంగ్రి చెప్పగా విన్నవానిని. విని ఊరకుండక కైలాసవాసు నడిగి, ఆ మహానీయులు ఎక్కడెక్కడ పుట్టుదురో, వారెట్టివారుగానుందురో తెలుసుకొనవలయునను కుతూహలము ఇందనుక ఈడ్చుకొని వచ్చినది. అడిగి తెలుసుకొనువరకు ఆత్మకు తృప్తిలేదు ఈ నాలుగడుగులపోయి, వారినే అడిగి తెలుసుకొనెదను. (ముందుకు చూచి)

తే॥ వెండికొండన వెలిగెడి వెలుగులవిగో
ప్రమథగణముల శంఖారవంబులవిగో
జ్ఞానమూర్తుల ఓంకారనాదమదిగో
రాగరహిత నివాస కైలాసమదిగో.

(శంఖారవములు. ఓంకారనాదములు వినవచ్చును.)

అదుగో! ప్రమదుల భీకరాట్టహాసములు, భూతగణముల కోలాహలములు. మౌనుల ఓంకారనాదములు, చతుర్వేదఘోషలు ఆకాశమంటుచున్నవి. ఈ భూతములు నన్నుచూచినతోడనే చుట్టుముట్టి, స్వామీ! ఎక్కడయుద్ధములు? ఘోరయుద్ధములా? అఘోరయుద్ధములా? ఎంతకాలము? ఎంతకాలమని ముందు కడుగు వేయనియ్యవు. - యెక్కడ యుదములు వచ్చినా మాకు తెలియునని, వారికి కడుపార తిండి కలుగుననీ వారి యాశ. వీరిని విడిపించుకొని గౌరీశంకరుల దర్శించవలయునన్న మహాకష్టము. కానీ పోయెదను. — (నిష్క్రమించును.)

---

## ప్రథమాంకము - ద్వితీయ రంగము.

“కైలాసము.” గౌరీశంకరులు కూరుచొని వుందురు. వృషభుడు

ఎదురుగను, ప్రక్కల వీరభద్ర, విఘ్నేశ్వర, కుమారస్వామి మొదలగు వారుందురు. - డమరుకము, శంఖములు, ధవళశంఖులు, గంటలు మొదలగు వాయిద్యములు వాగుచుండును.

నారదుడు ప్రవేశము.

నార :- ఉమామహేశ్వరులకు ప్రణామములు. (నమస్కరించను.)

శంక :- మనోవాంఛాఫల సిద్ధిరస్తు. నారదా! రాకకు కారణము?

నార :- మహేశ్వరా! తమకు తెలియనిదేమున్నది. నా రాకకు ఏదో కారణముండునని తెలుపకనే, తెలుసుకొని వుందురు. అయినా విన్నవించుకొందును. ఈదినము శివభక్తులు భూలోకమున జనించు శుభదినమని నాతండ్రి చెప్పుచుండ విని, వారెచ్చట పుట్టుదురని యడుగగ, ఆ పరమశివునే అడుగ పొమ్మన, ఇందనుక వచ్చితిని. పరమేశ్వరా! వారెచ్చట పుట్టుదురో, పుట్టెడు వారెట్టివారో తమరు వచింప, విని సంతోషింతును. భారమునక శలవిండు.

శంక :- నారదా - ఔను భూలోకమున త్రికాలవేదులగు అవధూతలు, పరమపవిత్రులు, పరమపుణ్యులు, తేజోవంతులు, తపస్వులు మొదలగు శివభక్తులు పుట్టుటకు ఈ దినము సుదినము. శ్రీశైలమునకు, శేషాచలమునకు మధ్యప్రదేశమున కీకారణ్యమగు నలమలకొండల యందు ఒక తేజస్వి జనించును. పుట్టిన క్షణముననే తండ్రి గతించును.

నార :- పితృగండమా! నారాయణ.

శంక :- ఔను. ఆ పరమ సాధ్వి ఆ నిర్జనప్రదేశమున ఏ దిక్కులేక బొడ్డుకోయడి వారుకూడ అందులేక పుట్టిన శిశువును చూచి, గతించిన భర్తనుచూచి దుఃఖించుచు, నన్నుదలచుచు, శోకమాపలేక, సహగమనము చేయుటకు వీలులేక, శోకానల తప్తయై విలపించుచుండను.

నార :- నవమాసములు నిండిన గర్భవతిని దోడ్కొని అతడెట్లా యడ
కికి వచ్చెను. శలవిండు.

శంక :- తీర్థయాత్రలకై పోయి అక్కడనే ఆ సాధ్వి చూలు ధరించి
నది. ఇక్కడికి వచ్చునప్పటికి నవమాసములు నిండి మార్గమధ్య
మునవే ప్రసవించవలసి వచ్చినది (పార్వతిని చూచి) పార్వతీ!
వారు మనభక్తులు. పరమ పవిత్రులు. దిక్కులేనివారికి మనమే
దిక్కు. నీవామెకు సహాయపడుము. పొమ్ము. (పార్వతి నిష్క్ర
మించును.) నారదా! ఆ జనించెడి శిశువు త్రికాలవేదియై,
రాజయోగియై నలమలకొండల సమీపమున కందిమల్లయపల్లె
యందు కుటుంబియై, పుత్ర పుత్రికలతో సంసారముచేయుచు
అనేక చిక్కులకులోనై, అన్నిటను జయించి, పవిత్రుడై, సాన
బట్టిన వజ్రమువలె ప్రకాశించి, జీవసమాధియై ప్రజాభీష్టముల
దీర్చుచుండును.

నార :- స్వామీ - మహేశ్వరా! అంతటి పవిత్రుడంటిరి. అట్టివాడు
జనించినతోడనే తండ్రి కరువగుటెట్లు సంభవించెను.

శంక :- ఔను పూర్వ జన్మమున తనను కని, పెంచి పెద్దచేసిన
తలిదండ్రుల పోషింపక, సద్గురు పాదసేవ చేయక. తల్లీ!
దండ్రీ! గురువను మూడుమెట్టుల విడచి, నాల్గవమెట్టయగు
నన్నేనమ్మి జీవితము నడపినాడు. మానవధర్మమవలంభింపక,
రాక్షసధర్మమవలంబించినాడు. అందుకు శాస్తి జననమైనదే.
తలిదండ్రులు కరువైరి. చేసినది చేయించును. ఇది తప్పదు
ఎట్టివారికైనా.

నార :- నారాయణ పరమేశ్వరా! ఒక్కమాట తల్లి, దండ్రి, గురువు,
దైవమను నాలుగు మెట్టలలో మూడవమెట్టయగు గురువునే
నమ్మి, మిమ్ముల తలంపని మతములనేకమున్నవి. అట్టివారు
కోట్లకొలదిగావున్నారు. వారినేమందురు. దయచేసి శలవిండు.

శంక :- నారదా! ముందుజన్మమున గురువుసొత్తునే తిని, గురువు

చేతనే సేవ చేయించుకొని, గురువు నేర్పిన విద్యలు తానే గ్రహించినట్లు చెప్పుకొన్న దుష్ఫలము ఈ జన్మమున తగిన గురువు దొరకక, తగిన మతము దొరకకపోవుటచేత మూడవ మెట్టనే నిలచిపోవుదురు.

నార :- నారాయణ. దానికి ప్రాయశ్చిత్తము.

శంక :- ఈ జన్మమంతయు వ్యర్థము చేసుకొని, మరు జన్మములో మమ్ము తలంచి తరింతురు.

నార :- ముమ్మూర్తుల ధ్యానింపక, గురువునే నమ్మి గురువునే ధ్యానించుట. కుక్కతోకను బట్టుకొని గోదావరి నీద దలంచి నట్లే నన్నమాట. తల్లి, దండ్రి, గురువు, దైవము అనెడి నాలుగు మెట్లలు కావలయునన్నమాట. నారాయణ. పరమేశ్వరా! దేహశక్తి, జ్ఞానశక్తి, ధనశక్తి మూడు కావలయునన్న త్రిదేవుల, త్రిమూర్తుల ధ్యానింపవలయునందురా.

శంక :- ఔను. త్రిశక్తులు ఒకరియందు లభింపవు. ముమ్మూర్తుల యందు మూడుశక్తులు గలవు. జ్ఞానశక్తి, దేహశక్తి, ధనశక్తి ఒకనియందు చేరినప్పుడే మానవుని జీవితము స్వర్గతుల్యమగును.

నార :- నారాయణ ఈ మతకర్తలు చీలికలుచేసి మానవుల ఒక్కొక శక్తినే ధ్యానింప చేసి, తాల్చినోట మట్టికొట్టినారన్నమాట. నారాయణ. కలికాలప్రభావమందుర స్వామి.

శంక :- ఔను. శని, రాహు, కేతు గ్రహపాలన గాన, నానా మతములు, నానా భాషలు, నానా ఆచారములు, అనేకమైన కట్లు, జుట్లు, బొట్లు ఉత్పత్తియై నీచాతి నీచములకు దిగజారి పశు న్యాయప్రవర్తకులై పాడగుదురు. పాపభూయిష్టులగుదురు. కలికాల ప్రభావమిది.

నార :- నారాయణ.

శంక :- వీరభద్రా! అతడు మూడు జన్మములనుండి నా భక్తుడై,

ఈ జన్మతో తరింపవలసియున్నది నీవాతనికి తోడు నీడై, గురుస్వరూపమై పోషించు బాధ్యత వహించుము. కంటికి రెప్పవలె కాపాడుము. మరియు ఒక పుణ్యదంపతులు సత్పుత్రుడు గావలయునని, ఫలింపక నిరాశ జెంది, దారిద్ర్యబాధ భరింపలేక చావ సిద్ధపడియున్నారు. వారికీ బాలకు నప్పగించి, వారిచే పోషింప చేయుచు, వారిని ధనవంతులచేసి, బాలుని సకలవిద్యా పారంగతు నొనర్చి, అణిమాద్యష్ట సిద్ధులలవడింప చేయుము. ఒకటననేల, ఏవేళ కేదికావలయునో దాని నొసంగి, పోషించి తరింపచేయుము. నీతల్లి పోయియున్నది. పొమ్మ (వీరభద్రుడు నమస్కరించి పోవును.)

నార :- నారాయణ. మానవుడు వాని సంసారము వానికి భారమై అల్లాడుచున్నాడు. నీవో ఎందరి సంసారముల బాధ్యత వహింపవలయునో, వారికన్నను తమకే బాధ అధికముగా నున్నదనుకొనెదను. తామేమందురో తెలియకడుగుచుంటిని.

శంక :- ఏమందును. - ఔనందును. మనోవాక్కాయకర్మల నన్నే తలంచుచు, నన్నే నమ్మి సర్వకర్మలు నాపైననే వదలినవారికి చేయూత నివ్వకతప్పదు. ఇది నా విధి.

నార :- నారాయణ. తమకు విధియా. తమకు విధించిన వారెవరయా తండ్రి.

శంక :- ఎవరో యందుకు నారదా. ఎవరుచేసిన పూజాఫలమెంతో అంతే. ఆ ఫలమే విధి విధానమగును. కారణమాత్రుడా విధాత. నారదా!

ఆ॥ తగని తప్పులెల్ల తాజేసి బ్రహ్మయే
వ్రాసెనంచు ప్రజలు వగచుచుంద్రు
చేసినట్టి తప్పు చేయించు నంచని
విశదపరచు ప్రజలు వినగ మౌని.

ఆ॥ తాను జేసికర్మ ధాతను తిట్టిన
తప్పువైన తప్పు తప్పకుండు
తప్పు నొప్పుజేసి తప్పించుటకు బ్రహ్మ
కలవిగాదటంచు నను మౌనీ.

నీకూ విధించినది నీ పూజాఫలమే.

నార :- ఓహో! ఈ కథలో నాకథ వచ్చునట్లున్నది. కాలు కద ల్చుటయే శ్రేయము మహేశా శెలవు.

శంక :- కథ ప్రారంభముననే పలాయనమా?

నార :- కథ కాలుజారునట్లున్నది. కథలో నాకథ వచ్చునట్లున్నది. శెలవు తీసుకొనెదను. నారాయణ. (అని పరుగెత్తును.)

( తెర వాలును. )



## ప్రథమాంకము — తృతీయ రంగము.

వీరభోజయాచారి, వీరపాపమాంబ.

పాప :- ఇంకా ఎంతదూరమండి. కాళ్లు పడిపోవుచున్నవి.

వీర :- అదుగో. ఆ మడుగు సమీపించుచున్నది. మన చావు సమీ పించుచున్నది. చచ్చిపోవువారికి కాళ్లుపడిపోయిననేమి, పూడి పోయిననేమి, నడు. - కాదే. సచ్చి సాధించే దేదీలేదు. బ్రతికే సాధించవలెనే. నామాట విను. చచ్చి అంతర్గత పిశాచులమై అల్లాడవలసివచ్చునే.

పాప :- శివ శివ. వద్దు. నా పగవానికి వద్దు. ఈ దరిద్రముతో అల్లాడిచచ్చేదానికన్నా, తెగించి ఒకనాడు ఒక మునక వేస్తే పీడపోతుంది. పగిలేస్తే మధ్యాహ్నానికెట్లు ప్రొద్దువాటాలికే సాయంత్రానికెట్లు. వస్త్రములు పోవచ్చెనే వస్త్రములకెట్లు. బంధువులువచ్చిరే వీరికెట్లా అని నిరంతరము దుఃఖమే. నేను

చేయలేనండీ ఈ సంసారము. ఒకనాటితో ఈ కష్టాలన్నీ తీరి గట్టెక్కుతాము. పద. చచ్చినవాళ్ల కేమి బాధవుంది. చూస్తున్నాముగ.

వీర :- బాధలేకేమే. పెద్ద బాధ. ఆయువుతీరక హత్యచావు చచ్చిన వారిని, ఆత్మహత్యా పాపముక్రింద చేర్చి ఆ లోకానికి రానివ్వరు. ఈ లోకములోనే అంతర్గత పిశాచములై ఆయువు తీరు నంతవరకు ఉండుడని శాసింతురు. అప్పుడు ఈ బంధుమిత్రుల చూచి దుఃఖించుచు, దేహములేనివారము గాబట్టి - మాట్లాడి, మనకష్టాలు చెప్పుకొనుటకు వీలులేక, కష్టములుపడలేక, ఎటు పోవుటకు, ఏమిచేయుటకు తోవగానక అల్లాడవలసివచ్చును. చావు దానంతటది వచ్చువరకు ఉందాము. నామాట విను.

పాప :- శివ శివ. చావెప్పుడొచ్చునని చూపెట్టుకొనేది చచ్చేది నీవు ముందో, నేను ముందో. ఒకరిక్కడ, ఒకరక్కడ తగులుకుంటే మరింత బాధ. వద్దండీ - ఎక్కడున్నా ఇరువురము ఒకేచోట వుండవలె. ఇరువురము ఒకేసారి చత్తాము.

వీర :- నదానదోషే భవద్దరిద్రో । దరిద్రదోషేణ కరోతి పాపం । అన్నారు. ముందుజన్మమున ప్రిక్కయింటిలో వస్తువరుండగా తాను తిని, తేపుచూ, కంటినిండా నిద్రపోయినపాపము - డాంబికుడై తన వైభవము బీదలకు చూపినపాపము - పండను, వుండను, ఇల్లువాకిలి లేక, అతిబాధలకులోనై, కట్టగుడ్డ, తినతిండి లేనివారిని చూచినపాపము, - పసిపాపలు అన్నమో రామచంద్రా అనుచుండ వారి తలిదండ్రులు కంటనీరు పెట్టు చుండ కంటచూచుచు, సకలైశ్వర్యములనుభవించుచు, దయా దాక్షిణ్యములేక కంటచూచినపాపము. - గుట్టలై, కొండలై పెరిగి మసట్టివారుగా పుట్టుచుందురు. అప్పుడట్లుచేసి, ఇప్పుడి ట్లేడ్చిన ప్రయోజనమేమి. చేసినపాపము అనుభవించి తీరిపో యిన - మరుజన్మలో ఇంత కష్టాలుండవు. నామాట విను.

మళ్లీ యిట్లాటిజన్మ తెచ్చుకొనేదానికన్నా - నిత్యము దైవ ధ్యానము పదినిమిషాలైనా చేయుచు, ఎంగిలి మంగలము లేక చేసుకొన్న ఆహారమును దేవునికి చూపించి భుజించుటగాని, సంధ్యదీపము వెలిగించి ఇంత చక్కెరో, బెల్లమో, పండో, పాలో దేవునిదగ్గర పెట్టి నమస్కరించుచు వచ్చిన - రాబోవు జన్మ మంచిది వచ్చును నామాట నమ్ము.

పాప :- వచ్చింది ఏమిటి? దరిద్రము. - నిత్యము గంటలకొద్దీ దేవుని పూజ చేయుచున్నారుగ. ఏమొచ్చింది, ప్రాణానికొచ్చింది - ఆక్కడ ఆ యింటిలో ఉన్నప్పుడు పగలంతా మురికికాలువల కంపు. సాయంత్రమైతే మాంసాలుకాల్చే గబ్బు ప్రొద్దుగూకితే పట్టిచాపలు కాల్చే గబ్బు. శివ శివ. పగవానికి వద్దు. అది తప్పించుకొని ఎట్లో ధనికుల సందుకువస్తే, ఆపక్క యింటిలో పకోళిగల వాసన. ఈపక్క యింటిలో అత్తిరాసాల గుమగుమ. ఎదురింటిలో వడల గమగమ ఎటుచూచిన మధురాతి మధుర మైన వాసనలు వస్తూవుంటే గుటికలు మింగి మింగి చచ్చు చున్నాను. బజారుకట్లపోతే రామ రామ. మిఠాయి అంగళ్లు, పళ్లంగళ్లు చూచి చూచి నాల్కపై నీళ్లూరి వూరి పోతాయి. నీవు సంపాదించేది రాగిపిండి సంగటికి చాలదు. ఎప్పుడు తెచ్చు కొని తినేది. శివ శివ. చావే మేలు.

వీర ఆట్లగాదే దరిద్రమా. ముందుచేసినది ఇప్పుడు అనుభవించుచు, ఇప్పుడు చేసినది ముందుకు అనుభవింతురు - ముందుజన్మలో ఉండి, వరులకు పెట్టని దోషమిప్పుడనుభవించు చున్నాము. - ఇప్పుడున్న ధనికులు పరులకుపెట్టక, రాబోవుజన్మలో నీవతినే వడల వాసనకు దుఃఖించెదరు. - మనము ఇప్పుడు చేయునది రాబోవుజన్మకు అనుభవించెదము. - పాపాయ్, వచ్చుజన్మలో సుఖపడవలయునన్న రెండే మార్గములు. ఒకటి దైవభక్తి, మరొకటి దానము, ధర్మము. మనము దానము చేయుటకు ధనము లేదు గాన దైవధ్యానము చేసి, ధనవంతులుగానో,

ఉన్నతోద్యోగులుగానో, భూస్వాములుగానో, గొప్ప వ్యాపారులముగానో పుట్టి సుఖపడతాము. ఆత్మహత్య మహాపాపము. రోషముతో నీళ్లలోపడి, కాల్చుకొని ఉరి వేసుకొని, గొంతు కోసుకొని, అగ్ని పెట్టుకొని చచ్చిన లాభములేదే ఇంతకన్నా చావు అక్కడున్నదే.

పాప :- దైవమున్నాడు. దరిద్రము తీర్చగలడని చేసినంత చేసినాము. ఏదీ. దినదినానికి నీ వయసు తగ్గుతూవున్నది; దరిద్రము పెరుగుతూ ఉన్నది

వీర :- దైవమును నమ్మి చేయుచున్నవారికి, ఈ జన్మలో నడియండ ప్రయాణములో చత్రీవలె సహాయమిచ్చును. రాబోవు జన్మకు కోరికలన్నీ తీర్చగలడే. అట్లు ముందు జన్మలో చేసినవారికే యిప్పుడు పూర్ణకుంభములతో, వేదాధ్యయనములతో స్వాగతాలు, సుస్వాగతాలు యిచ్చి, ఏనుగుతొండము లావు పూలహారాలు వేసి, వెంకటేశ్వరుని దరిశనము చేయించుచుండేది. షడ్రసోపేత భోజనముల పెట్టుచుండేది, చేయనివారికి కాదే కిట్టక వాదురాదు; పెట్టక పుణ్యములేదు అన్నారు పెద్దవారు ముందుజన్మలో మనవలెనే కష్టపడి. దేవుడున్నాడు, ధర్మమున్నదని, కష్టపడి నీతికి నిల్చి, తెచ్చుకున్నారు ధనము - తెచ్చుకొన్నారు విద్య - తెచ్చుకొన్నారు ఉన్నతోద్యోగములు - తెచ్చుకొన్నారు సుఖము. - ఇప్పుడు దేవుని, ధర్మమును మరచిన, మరల రెడ్డొచ్చె మొదలెత్తుకొమ్మని మనగతే. - మనము ముందు దేవుని దలచక, ధర్మముచేయక, నీతికి నిలువకపోయి, చెడిన దరిద్రులమే. దరిద్రిమా.

పాప :- ఆ - శివ శివ. నేను దరిద్రురాలనా. నీవు దరిద్రుడవా. - ఆడలేక మద్దెలకాని గోడు పోసుకొన్నట్లు, ఆడవాళ్ల గోడు పోసుకొంటారు. పురుషుడు కర్త అన్నావుగ దరిద్రునికి దరిద్రము రాక మంచిది వస్తుందా. ఆడది ఇంటికొచ్చినా, గాటికి ఎద్దు వచ్చినా, దొంతికి కుండ వచ్చినా, మొగవాని అదృష్ట,

దురదృష్టములపై ఆధారపడి వుండుననక, ఆడదానిపై వేసి ద్దినారు. మొదలు నీవు దరిద్రుడవు, ఆటుపై నేను. - దరిద్రము తీరే తీరు నేను చెప్పుతాను. - ఆత్మహత్య చేసుకొన్నవాళ్లు అంతర్గత పిశాచాలవుతారన్నావుగా.

వీర :- ఊఁ. ఔను.

పాప :- అట్లనే అవుదాము. పెద్ద ధనికుని పెండ్లానికి నేను పడతా; మొగునికి నీవు పట్టు. అక్కడ ఆలుమొగుళ్లముగానే వుంటాము. వారికి కాలము తీరిపోతే, మరొకరికి పట్టుదాము. అన్ని అం దాల సుఖపడతాము. బీదవాళ్ళకు మార్గదర్శకులము మన మౌతాము. మనము పట్టి అయినా ధనికులతో దానము చేయిస్తాము. పా పోదాము.

వీర :- కాదే దయ్యమా. శివునాజ్ఞలేనిది చీమైనా చావదు, కద లదు. చచ్చినవాళ్లంతా దయ్యాలైే, బ్రతికినవాళ్లకు పట్టేట ట్లుంటే భూలోకము బూడిదగాదా. ఆ దయ్యములు వేరే నే.

పాప :- అవి ఎట్లుండు నందురు.

వీర :- దయ్యములు, అయోనిసంభూతములు ఒకరికి పుట్టినవికావు, పట్టునవికావు. దయ్యముల భీతి మానవులకు కొందరికి పుట్టు కతో వచ్చును. అది ఆడవాళ్లకు, మొగవాళ్లకుండును. ఆ భీతికి యంత్రములు, మంత్రములు సద్యఃఫలితముగా అప్పటప్ప టికి పనిచేయును.- ఇవి అవిగావు. అత్తబాధతో కొందరికి, ఆడ బిడ్డల బాధతో కొందరికి. మొగుళ్ల బాధతో కొందరికి, ఆలు మొగుళ్లకు అన్యోన్యతలేక కొందరికి, పనిచేయలేక కొందరికి పట్టుచుండును. బుద్ధిః కర్మానుసారిణీ అన్నట్లు వారిబుద్ధి అట్ల ఆడించును గాని, నిజమైన దయ్యములుగావు. అంతర్గత పిశా చాలుగావు. అట్లి కొందరు ఆ దేవునికి, ఈ దేవునికి తిరిగి, టెంకాయలు కొట్టి పూజలు చేయించి పుణ్యము సంపాదించు కుంటారు. కొందరు మంత్రగాళ్లతో వేపాకుమండల దెబ్బలు

తింటూ వాళ్ళమ్మను, వీనమ్మను, మీయమ్మనని బాధించి పాపము గట్టుకుంటారు

పాప :- అయితే చచ్చినోళ్లు దయ్యాలై, బ్రతికినోళ్లకు పట్టవంటూరా.

వీర :- ఔను. విను. మాయింటి పక్కయింటి ఆయన మొగుడు ఇస్పేటుకాడు, చుట్టాల పోలుగాడు. సంసారము నాశనము చేయుచుండగా చూడలేక, దయ్యము పట్టింది. అతగాన్ని చూచేటప్పటికి ఆమె వెంట్రుకలు విరియబోసుకొని పళ్లు పట పట గొరికి, ఒరేయ్. నేను బ్రహ్మరక్షస్సును - నిన్ను, మీయమ్మను, పెండ్లాన్ని, పిల్లల చీల్చుకతింటాను నీవు యిస్పేటు ఆకులు ఆడి, ముండల యిండ్లకు పోయి, భార్యాపిల్లల నోట్లో దుమ్ముకొట్టేదిచూచి, అన్యాయాన్నిచూడలేక నీ పెండ్లానికి పట్టినాను. నీవీ ఆటలు మానుకొంటివా సరి. లేకుంటే ముందు మీయమ్మను, ఆటుపై నిన్ను, మళ్ళీ నీయాలు పిల్లల నల్చుకతింటాను. మంత్రాలు, తంత్రాలు, యంత్రాలు నా దగ్గర కుదరవు. వాళ్లని పిలుచుక వచ్చినావా ముందు నీ పని పడతా. ఊ. చెప్పు. ఇక ఇక్కడనుంచి కదలినావా, ముందు మీయమ్మ చస్తుంది. చెప్పు. అని వూగుతూ, అట్లనే అతగాన్ని సవరించుకొన్నది.

పాప :- అది మంచి దయ్యమే. పా. పోదాము.

(అంతలో వీరభద్రుడు ఒక సన్యాసి రూపముతో వచ్చి)

సాదు :- అయ్యా. వీరభోజయాచారి!

వీర :- (ఉలికిపడి) నా పేరు నీకెట్లు తెలుసునయ్యా.

పాప :- ఈ గడ్డము సన్యాసులు ఈలాటి గోకర్ణవిద్యలు, మళయాల మంత్రాలు, యక్షిణీ విద్యలు, ఎన్నో నేర్చుకొని లోకుల మోసము చేస్తుంటారు. అయ్యా. స్వామి! మాకెందు కెదురయ్యావు. మావూళ్లో నీలాంటి గడ్డము సన్యాసులు, గడార్ల లాంటి కొత్త ముండమోపులను ముప్పురను లేవదీసుకపోయి

నారు. నాలుగోవాడివి నాకెదురయ్యావు. ఇక్కడ నీ పప్పు లుడకవు. పోయిరా. పా. పదండి.

సాదు :- అమ్మా. నేను త్రికాలవేదిని. అట్లాటివాడనుగాదు. ఈ భోజయాచారి మా భక్తుడు. మీ కష్టముల గట్టెక్కించి పోవలె నని ఎదురయినాను.

పాప :- ఆయన మీ భక్తుడైతే, నేను మీ భక్తురాలినా. శివ శివ. నాకు భక్తివద్దు. ముక్తివద్దు. ముక్తిమార్గము చూపించడము లోనే ముగిస్తారు. ముద్రలు చూపించడములో ముద్రవేస్తారు. ముక్తిమార్గానికి పోతే, గక్తిమార్గము చూపి, రంగ రంగ. లేవదీసుక పోతారు. నీ భక్తివద్దు; ముక్తివద్దు పోవయ్యా.

సాదు :- వీరభోజయాచారి! నామాట విను. ఒక పుణ్యదంపతులు తీర్థయాత్రలు చేసుకొంటూ నల్లమలకొండలు సమీపించుసరికి సంపూర్ణ గర్భవతియై మహారణ్యములో ప్రసవించినది. ప్రస వించుసరికి భర్త గతించినాడు. దిక్కులేని పక్షి యైనది. ఆ సమయమునకు నేనక్కడికి వచ్చినాను. నన్ను చూచి, తమ విషయము చెప్పి దుఃఖింపగా, ఆ శవమునకు అగ్ని సంస్కారము చేయ ప్రారంభింపగా, నేను సహగమనము చేయుదను. ఈ పిల్ల వానిని ఏ కటుంబీకులకైనా యిచ్చి పుణ్యము గట్టుకొమ్మని మరింత శోకించగా. నాకు కనికరము కలిగి వప్పుకొంటిని. ఆమె సహగమనమయ్యెను. నా యాశ్రమమునకాపిల్లవానిని తెచ్చి, ఇంతవరకు పోషించితిని. ఆ పిల్లవాడు దైవాంశ సం భూతుడు, మహాతేజస్సంపన్నుడు కాగలడు. ఆ పిల్లవానిని మీ కప్పగించెదను. నిత్యము ఒక ఆవు వచ్చి, ఆ పిల్లవానికి కావలసినన్ని పాలిచ్చి పోవుచుండును. దానికి మీరు మేత వేయ పనిలేదు. నీళ్లు పెట్ట పనిలేదు వేళకు సరిగా వచ్చుచు పోవుచుండును. ఒక ఘట సర్పము ఆ పిల్లవానిని చూపెట్టి ఆడించుకొనుచుండును. ఈ మహాత్తును చూచుటకు వచ్చిన వారు పూలు, పండ్లు యిచ్చి, పిల్లవాని పోషణార్థము కానుక

లర్పించి పోదురు. దానితో మీరు ధనికులై, కావలసినంత సుఖింపగలరు. ఏమమ్మా! ఆ ధనము తో వడలు, పాళిగలు, అత్తెరాసాలు, సొజ్జెలు, బొబ్బట్లు అన్ని చేసుకొని భోంచేయ వచ్చు. - ఇవి లభ్యపడలేదు; దారిద్ర్యము తీరబోదు అని నిరాశ చెందికదా చావబోవు చున్నారు వద్దు సకల శుభములు పొందవచ్చు. ఆ శపోనిధిని చాకుటవల్ల మీ పుణ్యము పండును. ఏ తపస్సులేకనే మీకు పుణ్యలోకము లభించును. అనుమా నింపకుడు.

పాప :- ముందు తండ్రి గతించినాడా, తల్లి పరమపదించి దా.

సాదు - తండ్రి ముందు గతించినాడు అటుపై తల్లి పిల్లవానిని నా కప్పగించి సహగమనము చేసినది తల్లీ.

పాప :- సరే. ఆ పిల్లవానిబరువు మాపై పెట్టి, సల్లగా నీవు ప్రాణా లతో జారుకొందామనుకొన్నావు మంచిది. అయ్యా, ఆచారి. ఒకటి చెడితే రెండు చెడు నన్నారు. ఆ పిల్లవాడు ముందు తండ్రిని దిగమ్రింగినాడు. నాయనో, ముందు చాకుడు తండ్రిని మ్రింగితే నాగతేమి నాయనో, పిల్లవానిని చాకిన షర్లుతో విడువలేక పైలోకానికి పోయిన నీదగ్గరకు రాలేక, ఈ సాధు గాళ్ళపోరు పడలేక చచ్చిపోతా నాయనో. శివ శివ వద్దు వద్దు. చావే మనకు మేలు.

సాదు :- అమ్మా! మీకు చక్కగా జరుగకుండిన, అటుపై ఆట్లనేచేతురు రండి. నామాట నమ్మండి. అదుగో నా యాశ్రమము.

పాప :- అయ్యా! నీ పేరేమి?

సాదు :- అమ్మా! నా ముందు పేరు వీరభద్రుడు. ప్రస్తుతము పిలుచు చున్నది సాధు వీరయ్య. - నా నివాసము చాలాదూరము. ఇక్కడిట్టి దుర్ఘట సంఘటన జరుగునని తెలుసుకొనివచ్చి, పిల్ల వానిని కాపాడితిని. మా కుటుంబమంతయు ఇట్టివారిని కాపా

డటయందే నిమగ్నులైయుందురు. అనాథో దైవరక్షకాః అన్నారుగా.

పాప :- అన్నారు, అన్నారు. అయ్యా! నీకు అలుపిల్లలు, అమ్మా నాన్నా వున్నారా?

సాదు :- ఔను తల్లీ. అమ్మా నాన్నా వున్నారు. అన్నా తమ్ములు అజేయులున్నారు. - తండ్రిపేరు శంకరుడు, తల్లి పేరు పార్వతమ్మ, అన్న పేరు గణపతి, తమ్ముని పేరు కుమారస్వామి అని పిలుచుచుందురు. నాకు ఇల్లాలు కూడ వున్నది.

పాప :- అయ్యో, కైలాసమే ఈ ఇంటిలో వుండినదే - కైలాసము విడచి, ఇక్కడికెట్లొచ్చినావయ్యా?

సాదు :- మా విధి యిది. మమ్ము నమ్మినవారికి సహాయమిచ్చుటయే మా పని.

పాప :- ఇంతదూరము వచ్చి పేరేల మార్చుకొన్నావు. కూనీలు చేసినావా, (భర్త నోరుమూయును. చేయిత్రోసి) రాజుల ధనాగారముల కొల్లగొట్టినావా, ఏదైనా అమ్మాయిని లేవదీసుకొని వచ్చినావా. అట్లచేసినవాళ్ళు అలుపిల్లలు లేనివాళ్ళు మోసాలు చేయు తలంపుగలవాళ్ళు ఈలాటి వేషాలు వేస్తుంటారంటుంటారు. మాదగ్గర ఏమీ లేవండీ. నిర్ధనికులము. మేమిద్దరమే వుండేది.

సాదు :- అమ్మా. అనుమానమెక్కడికైనా యీడ్చును. దాని కంతు లేదు. నిజము తెలియదు, భయములేదు బాగుపడెదరు ఆశ్రమమునకు రండి.

పాప :- అయ్యా. మందులు మాకులు, మంత్రాలు తంత్రాలు, బాగా తెలుసునా.

సాదు :- ఒక్కటునేల, సర్వము నెరుంగుదును. - సమయము వచ్చిన శంకరునికొడుకు వీరభద్రునంతటివాడను. వీరభోః! ఈయను

అనుమానము దీర్చి పిలుచుకొని రమ్ము. (అని శిరమున చెయి బెట్టి) సర్వాభీష్ట సిద్ధిరస్తు. (అని ఆశీర్వదించి పోవును)

పాప :- ఆచారిగారు చూచినారా, మందులు, మంత్రాలు బాగా తెలుసునన్నాడు. నాలుగు నాళ్ళకే నామీద నీకు, నీమీద నాకు మర్లు లేకుండా చేసి, నిన్ను జ్ఞానహీనునిగా నొనర్చి, నన్ను వలలో వేసుకొనేది కాయము. అటుపై నీచారి నీది, నాదారి నాది. శివ శివ. ఆ రూపము చూడు, ఇనుప తుంటలాగ వున్నాడు. సాధులకు ఎముకలు బైటపడివుండును. ఈ సాధువు నూనె కుండలాగ, నున్నగ, మినమిన లాడుచున్నాడు శివ శివ. పిల్లమీద పిల్ల పుట్టేది నిజము. నేను సాదుపేరు చెప్పు దునా, నీపేరు చెప్పదునా, వంశనాశన మౌతుంది. ఏ మంం దలో కట్టినా మనమందలో ఈనివేసరి. అనుకుంటా రా. ఆవు పాలిచ్చేది అబద్దము. నేను పాలిచ్చేది నిజము. తూ. - ఈ సాధువుల నడత మనవూళ్లో చూచినాముగ.

వీర :- ఛీ. ఛీ. నీవు రాను రాను పాపాల భైరవి అయిపోతున్నావు. సాధు ముఖము లో బ్రహ్మతేజస్సు తాండవించుచున్నది. ఈశ్వర అపరావతారము గా నున్నాడు. అందరూ దొంగ సాధువులే నుండెదరా. రా పోదాము.

పాప :- అయ్యో ఆచారిగారు. నెత్తిన నోరుపెట్టుకొని చెప్పుతున్నా, చేయదగినపని చేస్తాడు. కాగలపని అవుతుండి. నిజం. నెత్తిన చేయిబెట్టి అప్పుడే నీబుద్ధి మార్చివేసినాడు. చూశ. శివ శివ. ఎంతపని. ఎంతపని.

వీర :- లేదు రావే. మహనీయుడాయన, ఏమీ జరుగదు. (అని రెట్టబట్టుకొని ఈడ్చును.)

పాప :- కొంచమాగండి. ఆగండి. మందులు మాకులు సర్వము తెలుసునన్నాడుగ. కండ్ల చూసేటప్పటికే నీబుద్ధి మార్చి నాడుగ.

వీర :- నా బుద్దిని మార్చినవాడు నీ బుద్ధి నెందుకు మార్చలేదు.

పాప :- ఇక్కడ నీబుద్దిని మార్చినాడు. అక్కడ నా బుద్దిని మార్చు తాడు. - స్వామి. బ్రతికినన్నాళ్ళు బ్రతికి భోగముదాని వంచనబడి చచ్చినట్లు. - నన్ను సాకినన్నాళ్ళు సాకి. వన్యాసుల పాలుచేస్తారా. వీళ్ళ బుద్ధి శిరిపైన, స్త్రీలపైనే గాని, శ్రీహరిపై వుండదు. మన యిద్దరిని విడదీసి, రాజ్యమేల్తాడు నాయనో, నేను రాను.

(ఆచారి - చేయిబట్టుకొని, యీడ్చుకొని పోవుచుండగా)

స్వామీ వీరభైరవా! తప్పెవరిదో నీవే చూస్తూవుండు.

(అంటూ పోవును.)

---

## ప్రథమాంకము — చతుర్ధ రంగము.

"ఆశ్రమ భూమి"

బాలకుని పైన సర్పము పడగబట్టి వుండును. యోగి జింక చర్మముపై కూరుచొని వుండును. - వీరభోజయాచారి, వీరపాపమాంబ ప్రవేశించి నమస్కరింతురు.

పాదు :- (లేచి నిలబడి) ఇష్టకామ్యార్థ సిద్ధిరస్తు. అమ్మా! అడుగో చిరంజీవి. - నాగేంద్రుడు కాపాడుచున్నాడు. చూడుడు. బాలకునకు పాలు త్రాపునప్పుడు; స్నానము చేయించునపుడు అక్కడికిపోయి నమస్కరించిన, నాగేంద్రుడు ప్రక్కకు పోవును. స్నానము చేయించి, పాలు త్రాపి పరుండబెట్టిన, బాలుని రక్షణ ఆ నాగేంద్రుడే చూచుకొనుచుండును. తల్లీ! తీసుకొనుము. (అని బాలుని తెచ్చియిచ్చును.)

[పాపమాంబ బాలుని తీసుకొనును.]

అమ్మా! ఈ బాలుడు దైవాంశ సంభూతుడు ఈ బాలుని చూడవచ్చు భక్తాదులు తెచ్చి యిచ్చు కానుకలవల్లనే మీారు

మహాదైశ్వర్యములనుభవింతురు. ఈ బాలుడే మీకు జ్ఞానోపదేశమొనర్చి, మంచి త్రోవను చూపును. పొండు.

కం॥ శాపానుగ్రహశక్తులు
పాపనికిఁ గలిగి మిగుల ప్రతిభ గడించుఁ
పాపమ్మ కడుధన్యవు
పాపని పోషించు పరమ పదవి లభించుఁ.

వీర :- సెలవు. (నమస్కరించును)

పాప :- స్వామీ! మీ మంచిని తెలియక మాటాడిన అపచారిని. క్షమింపుడు. (నమస్కరించును)

సాదు :- అమ్మా! నీవుచెప్పినట్టి సన్యాసులుండవలసిన కాలము, కలికాలము గాన నీవట్టి జాగ్రత వహించినావు. దానికి తప్పేమున్నది. ఉన్నదన్నావు. పొండు. (నమస్కరింతురు.) సర్వదా మీకు శుభమగుగాక. — నిష్క్రమింతురు.

## ప్రథమాంకము — పంచమ రంగము.

నల్లిగాడు, మల్లిగాడు — ప్రవేశము.

నల్లి :- ఓయ్, మల్లాయ్! ఆ పిల్లోడు దేవుని వరాన పుట్నోడ్రా.- లేకుంటే, దీఁ తస్సగొయ. పగిలేసింది మొదుల్కోని వచ్చేవోల్లు, పోయేవోల్లు, దుడ్లుఇచ్చేవోల్లు ఎడతెరిపిలేదుర. పల్లు, పూలు, మిఠాయిల్ గుట్టల్ గుట్టల్‌రా. - సూన్ను రెండుకల్లు సాలవ్వరా. - ఆశారి, పాపమ్మ యంత పున్నెంసేసినారో ఏల్లెవానికెరికె. ఇదంతా అదుట్టంరా అదుట్టం. దరిద్దెంతో కుమిలి, కూటికి గడ్డకు సాలక సత్తుండేవోల్లు యిప్పుడో, నాయేల్లవాడ సాల్‌వెంత డబ్బు, సాల్‌నెంత తిన్ను, కట్టు, పెట్టు. ఏమిసెప్పాల్లె మారాజులయ్యార్రా. - అదోతా పూళ్లో ఆశాల్లు సూసి, కండ్లు మండి, కడుపుకాలిపోతుండార్రా.

మల్లి :- ఓహోయ్, నల్లాయ్! యీల్లు సూసి సూసి సావాల్సిందే. ఆ పిల్లోడు దేమునికొడుకేరా. దీనాలిశిగ్గోయ, బెమ్మదేముడు ఏమి రాసినాడు, ఏమి రాసినాడ్రా. ఐదేల్లనుంచి సూత్తుండాముగా. యేలెడంత సందు యెక్కనైనా దొరికిందా. నరుడే అయితే - దీనల్ శిగ్గోయ, మన్ దెగ్గెర బతుకుతాడేమిట్రా. పిల్లోని సంపు, సంపు అంటాడు ఆశారి. యాంది సంపుతావురా.

నల్లి :- బెమ్మదేముని వొరం గాకుంతే, అయిదేల్ల కాలంగా సంపుదామని తిరుగుతుండామే. కాసింత, యేలంత సందు దొరికిందా. అంతే. - ఆశార్లంతా కడుపు మండి సావాల్సిందే. ఆ పిల్లోడు సావర్రా. దేముడు రచ్చన సేత్తుండాడు. దీని తస్సదియ- ఈ శరబయ్యా, శనిగాడు బల్నెట్టు మనకు బళ్నెర్రా. దినము సంపు సంపు అంటాడు. ఎక్కడ సంపుతాప్. - మెల్కవ లేకుంతే, మనమే యేంచేత్తాము. పెల్లాలనోట్లో దుమ్ము పడ్తుంది. తలుచుకుంతే లోట్టికల్లు కైపు, కల్లగా గెట్టికాళ్ళ కాడికి దిగపోతుంది. ఇంగా పని తలపెల్నెమూ, నోట్లో దుమ్ము పడేదె నిజంరా.

మల్లి :- ఓయ్, నల్లాయ్! మాన్న బోవుడు బోజయ్యా, సిన్న సెప్పింది యిన్ లేదేమిరా. - ఉన్నోల్లు లేనోల్లపట్టుకోని, పాతికా పరకా యిచ్చి - వోల్ల కోపాలు, తాపాలు, ఇరుకులు, ఇబ్బందులు - తగాదాలు, తారామల్లు - తీర్చుకుంటార్రా. కల్లు, సారాయి పోయించి, వాన్నికొట్టు, యీన్నితిట్టు అన్ సెప్పి, పాపాలు కత్తుకోమ్మంటారు - యీనపనాయల్ల సేత్తారు. - సేయిత్తేది వోల్లు, సేసేది మీరు. ఆ పాపాలు మీకు సగం, వోల్లకు సగం వత్తుంది. - దాంతో యింగా యీనంగా పుడ్తారు. కట్టబట్ట తిన తిండి లేక సత్తారు. మంచిగా బతుకుతుంతే - మంచిగా పుడ్తారు. మంచిగా బతకర్రా అంటారు. సూత్తే నిజమేరా.

నల్లి :- ఓయ్, మల్లాయ్! యీల్లమాట వినే, యీనాపనాయాల్ల

మైనా మోయ్. యిట్లో పెల్లాని నెత్తిబొచ్చు సమర్తక జానడెత్తు పైకిలేసికోనుంటుంది. అతుకుమీద అతుకు వేసుకొని బట్ట కట్టుకుంటుంది. యింగ పిల్లోలగతేంల్లే, పెప్పనక్కర్లే శరమ్మే బట్టగా వుంతారు. గుడిశ సూత్తామా, నేనెత్తిన బోదలేక, వోనొత్తె దీనాసిగ్గొాయ. పిల్ల జల్ల సావాల్సిందే బైట పకటే; ఇంట్లో పకటే. తెల్లారితే బువ్వకెట్ల పొద్దోతె సంగటి కెట్ల. అని పెల్లాము ఏడుత్తుండేది. మన బుద్ధితక్కువతోనే గదోయ్. - వాడు నల్లిగాడు, వాడు మల్లిగాడు అంతారు. ముందు వాడు, యెనక గాడు యేసి బిగిత్తి దంచుతారు. బాగా బతుకుతుంతే ఎందుకంతారు. రంగన్న, మల్లన్న, నల్లన్న అంతారు. అనాి మానూ.

మల్లి :- ఓయ్, నల్లాయ్! బతుకులో వుందోయ్ బాగోగులు. సచ్చినేయ్, సావనేయ్. తెచ్చుకోని తినేది మానేసి, పెద్దోల్లు సెప్పె యీానపనాయాలి పనులన్నీ వదలేసి, మంచిగ బతుకుతుంతే, వాడు-గాడు యేసి దంచేది మానుకోరేమిటాి - యింతో, అంతో సదుము, మంచి మంచి బాస నేర్చుకోని, మురికిబట్టలు లేకుండా తెల్లబట్టలేసుకోని బతుకుతుంతే. అందర్లో తిన్నాల్లో కలిసిపోయినట్టు కల్సిపోమేమిరా. బాస, యేశాల్లో వుందోయ్ బాగోగులు.

నల్లి :- నడకల్లో, నడతల్లోగూడ ఉందోయ్. నడక, నడత బోగుంతే బేమ్మాలు గూడ కూసో నల్లన్న, కూసో మల్లన్న అన్రా అంత ఓయ్, మల్లాయ్! నోనొకతి సెప్తాయిను. ముందు మనము కెడ్డనాయాలి నడత మానికోని, మనపల్లెలో ఇంటింటికిపోయి, బతుకుతెరువులన్నీ సెప్పి బాగుపర్సాల. మనమాట యినోన్నీల్లపై దీనాలిశిగ్గొాయ, మన రౌడీతనం సూపాల బాగుపర్సాల. ఇది మొగోల్లపని. - పగిలేత్తే నెత్తి నున్నగ దువ్వుకోవల్సిందే. నొసట బొత్తు పెత్తుకోవాల్సిందే. మురికిలేనిబత్తలు కత్తుకోవాల్సిందే. పనికిపోని, పాటకుపోని మనోల్లు అందరి యిదంగా

వుండాల్సిందే. అట్టుంతే తిన్నాళ్లో పెజలు కల్సిపోయినట్లు కల్సిపోమోమేయ్.

మల్లి :- అవునోయ్ యాసానికితగ్గ బాస, బాసకుతగ్గట్టు యాసం. రొట్టికి తగ్గట్టు బతుకుంటే యవున్ని గౌరవిత్తరా? - అంత గౌరవిత్తారు. వన్లోనే వుండేదోయ్.

నల్లి :- అదుగో, శరబయ్యొత్తుండాడు మెత్తగ తిని, మేకులాగుండాడు. తాగ సంపగూడ్దు; సంపర్రి నాయాల్లారా, పాపాలు కత్తుకోర్రి నాయాల్లార అని సంపకతింతారు. మల్ల తిరగబోత కరేపాకులాగ యేరేత్తారు. సూరాగ్రి ఎట్లొత్తుండారో.

( శబరయ్య ప్రవేశము. )

నల్లి :- } దొండాలు సామి, దొండాలు.
వల్లి :-

శర :- ఏమిరా నల్లిగా, దినదినము కల్లు తాగిగిపోవడమేగాని పని యేదిరా. అంత చిన్నపని చేయలేకుండా వున్నారేమిరా.

నల్లి .- యాంది సోమి, యీ నల్లిగాడంటే నీకు తెల్సుగా, ఒక లొట్టికల్లు వట్టంగా తాగి, కేకరొత్తి మూసి, రెండు తేపులు తేసి, మీసం మీద చెయ్యేసి, అట్ల యిట్ల దుద్ది, కండ్లెర్రజేసి, తా లిల్లలో లిల్లాయి లిల్లలో. ఓరామ లిల్లలో లిల్లాయలో- అని కేకేసినాడా, వూల్లో వోల్లంతా వచ్చెనల్లిగాడని, గబగబ వాకిల్లేసుకోవాల్సిందే. అమ్మగోరు కూడ వాకిలేతుకుంతారు. ఆట్లాటోన్ని; గంగమ్మ తల్లిని తల్సుకోని, ఆ పిల్లోడు ఈనాటితో బలి. బోజయ్య పెల్లాము, బోజయ్య ఈనాటితో నలి. అనిపోతే. యేల్లవాడ యేమిసెప్పదున్లే. నలుగురెత్తు చింత మాకలావు మంచి, యేనిగ తలకాయాంత భుజాలు, నీ పొడుగు నా పొడుగు సేతులు, సింతనిప్పులాగ కండ్లు, గంపెడంత గొడుగు వల్లయ్య తలకాయ. సేత యింతలావు గుదిపె పట్టుకోని, తొట్టికల్లుతాగినోని యిదంగా, దీనాలిశిగ్గాయ.

బున యిశుచ్చుంటే, ఆ మొగోన్ని సూసేతల్కి, నా లొట్టి కల్లు సల్లగ గెట్టె కాల్లకాడికి దిగి, గుండె లొటలొటా కొట్టు కోని, వూపిరుంటే వుప్పమ్మకోని బతకొచ్చు పాఁనీ అం టుంది బుద్ది. - ముందు యీ దయ్యంగాడుండాడు. - యెనక తట్టుబోయి సూత్తామనిపోతే, వాటి తస్సదియ్య. ఆబ్బోఁ. అయెక్కడి కుక్కలో మంచెత్తుండాయి మూఁ అని మూల్గే తల్కి, గుండెలవిసిపోయి పరుగే పర్గు - పగులేపోయి, దొ మ్మిలో సంపుదామంటె, అ మాన్నుబావుని సూన్ను వొచ్చే వోల్లు, పోయేవోల్లు కాసింత సందులేదు. - ఇంట్లోకి తొంగి సూత్తే, దీనేలిశిగ్గోయ. పెద్దశాటంత పడిగెతో పెద్ద నాగ మయ్య ఇట్ల. అట్ల ఆ పిల్లోని మీద అడ్డా పాడ్తా వుండాడు. యాడ సంపెదయ్యా మాది దబ్బరంటే, రాత్తిరికి మా యన కాల రా సూత్తువు. - తీత్త పసాదాలు అక్కన్నే, ఇట్లనే పడ్తాయి - పరాతో పడగుతీయలేకపోతివా, ఒక్క దెబ్బతో నీల్లడక్కండా సత్తావు. నోను సెప్పేది కల్లయితే మల్లిగా న్నడుగు.

మల్లి :- నీతోడు, నాతోడు, కల్లుగంగమ్మతోడు నిజం చోమి దీఁతస్సదియ్య। చిన్నసోమికి పెద్దసోమి యాదాలు సెప్పు తుంతే, పచ్చులాలకిత్తాయి. పసల్ నిల్సింతాయి. సిన్సోమి మొగం సూత్తే, నాసోమిరంగ. దేముడు దిగొచ్చాడనిపిత్తుంది. ఆయన పున్నెపురుషుడగుతాడు సోమి. మనం సంపలేము. ఆ రచ్చకుడే కాపాడుతుండాడు. సత్తెంగా సోమి.

శర :- అట్లయితే, మనతో కానల్లేనా. మరేమి చేస్తామంటారు.

మల్లి :- చోమి. ఆయన దేముని వరోన బుట్నేడు. దేవుని మంచి. దినమ్మోపోయి పెదచ్చనం తిరిగి, సెంపలేసుకోని, దన్నం పెట్టు కోని, అపశారం. సమించుసోమి. సల్లగా నన్ను సూసకరా సోమి, నీకేమన్నా సేయిత్తా సోమి అని సెప్పుకో. సూసుకో. నీకు మేలు కలుగుతుంది సామే.

మల్లి :- నిజం సోమి. మా యింట్లోది గంగి, కడుపునొప్పితో సత్తుం డేది ఒకనాడు సోమి దగ్గరకు పోయి, ఓ యీరయ్య సోమి, నాకు కడుపునొప్పిపోతే, నీకు తెంకాయిత్తా సోమి అని సెప్పు కొందంత. ఆ రాత్తిరికే నిల్చిపోయింది. నిన్న అప్పుజేసి, తెంకాయ యత్తకపోయి యీరయ్యసోమికిచ్చొచ్చింది. వూరంతా మొక్కుతుండారు సోమి.

నల్లి - చోమి. నీవు మొక్కన్నేవా. పయిల్ మాణాలాటి కొడుకు పుడ్తాడు సోమి. నామాటిని పో. సూత్తువు. - అమ్మోరు యంటనే నీల్లు పోసుకుంతారు బిడ్డలు గల్గేవి దేముని దయ సోమి.

శర :- ఒరే. మీరిద్దరు నా మనసును మార్చేస్తిరి గదురా. అయితే అంతశక్తి ఆపిల్లవాని కున్నదంటూరా.

మల్లి :- యేంటిదయ్యా. మా యదారి గోగొచ్చి రేపటాల, మాపటేల పాలిచ్చి మాయమయ్యేది. నాగమయ్య పొద్దచ్చమానం పడిగ బట్టేది. లెక్కలేని మందొచ్చి కానుకలిచ్చేది. మొక్కునోళ్లకు రోగాలు పోయేది. అయిదేల్లకే యాదాలు సెప్పేది అందరికి వత్తాయా. యేగిలేత్తె తీత్తపసాదాలు వత్తాయి. యింతమంది మనూర్లో ఆశ ర్లుండారే, ఒక్కడు కలికేసికి వుట్నేదేమయ్యా. పల్కవు. పులిపిల్లయ్యా. దేవుని మంచెంటే మంచే.

నల్లి :- గాడ్దెపిల్ల లెన్నుంటే యెందుకయ్యా. వూల్లో వాల్ల బట్టలు మోయడానికా. అయన మాన్నుబోవుడు ఇదుగో ఆ సో మ్మీద చెడు తలపెట్టారో, సెపుతుండా. ఆయోర్ల జందేలు, ఆయోర్లకు కొట్టుయితాయి తెల్సుకోంది. - కథ సెప్తాయిను. నా పెల్లాము సందేయితే నడిమాడునొప్పి, నడిమాడునొప్పి బెమ్మరిందరం పయిలిపోతుందరో అని మొత్తుకుండేది. వైద్దులు ఎందరో సూత్తారుగాని, ఆబంలేదు సుబంలేదు. ఆ యీరయ్య సోమికి మొక్కుందంత. అక్కన్నే నడిమాడునొప్పి మాయ మయిందంత. చోమి। నా మాతొకటి యిను. ఆయన్ను

యేమో శయ్యాలని యింగ తల్చుకున్నేమా, మా పెల్లాల నోట్లో మనవ్వ అమ్మోరినోట్లో దుమ్ము పడ్తుంది నిచ్చయం. నామాట నమ్ము.

శర :- అట్లయితే, ఆయనకే మొక్కమనెదరా.

వల్లి :- ఔ, అట్లరా దారికి. సేంందల్లా మరచిపోమ్మని సెంపలేసుకొని మొక్కితే, అమ్మోరు నీల్లుపోసుకుంటుంది. పందేయం లేదు. రా చోమి (అని ముందునడచును. శరభాచారి వెంట బోవును.)

వల్లి :- దీని తల్లిశిగ్గొయ్య, అంతమంది ఆశార్లుకు కడుపులో మంట, నన్నెత్తిమంట, కాల్లకింద మంట యేంచేశాడాయన. ఇప్పుడు తగిన పనైంది. దేముడు యెక్కడ సూత్తాడు. మంచిపక్కనే తూల్తాడు. - అబ్బోయి బతికేము. మా పెల్లాలనోట్లో పాలు పన్నేయి.

> తా లిల్లలో లిల్లాయి లిల్లలో
> ఓరామ లిల్లలో లిల్లాయలో.
> (అని పాట పాడుకుంటూ పోవును.)

ప్రథమాంకము — సమాప్తము.



## ద్వితీయాంకము — ప్రథమ రంగము.

"ఇంటి ముంగల"

పాపమాంబ; వీరయ్య - చేతనొక ములుకట్టు, కమండలము బట్టి ముందుకు వచ్చును.

పాప :- (దుఃఖముతో) నాయనా యిది మాయా ప్రపంచము. ఎన్ని చెప్పిననూ, మమకారము చావదు - స్థిరప్రజ్ఞ గలుగదు. యోగి, భోగి విరాగి, ఈ మమకార మాయా ప్రపంచ

సాగరమున మున్కలు వేయుచునే వుందురు. ఈ మమకారము నాయందెట్లు నశించును తండ్రీ - పిల్లలు లేరని పరితపించుచు, దారిద్ర్యముతో కుములుచు, బాధ భరింపలేక చావ సిద్ధమై పోవుచున్నప్పుడు ఆ మహనీయుడు ఎదురై సద్బుద్ధిని గరపి, నన్నిచ్చి, ఈ శిశుగందువు కల్పవృక్షమై, కామధేనువై, మిమ్ము మహదైశ్వర్యవంతుల చేసి, పుత్రానందమొసంగి, కడకు మోక్షమార్గమునకు దారిచూపి గమ్యస్థానము చేర్చును. నమ్మి తరింపుడని సెలవిచ్చెను.

అదేవిధముగా జరిగినది. నీ మహత్తువల్ల సర్వ సౌఖ్యములు ననుభవించితిమి. వారు గతించిరి. భర్త గతించినను, పుత్రుడున్నాడని నిర్భయముగానుంటిని ఇప్పుడు ఈ చిన్న వయసులో తోడులేక ఒంటరివై తీర్థయాత్రలకు పోవ నుద్యమించితివి దుఃఖముగాక సంతోషమెట్లుండును. ఎవ్వరు నన్నాదరింతురు. ఎవ్వరు నాకు దిక్కు. (అని దుఃఖించును.)

పీ :- అమ్మా! దుఃఖించెద వెందుకు.

గీ॥ దిక్కులేనట్టి వారికి దిక్కు నేనె
పరితపింపకుడని హరి పలుకుచుండ
దిగులు పడనేల శ్రీహరి దిక్కుగోను
సర్వవిధముల గాపాడు సత్యమమ్మా.

[శంఖనాదము వినబడును]

అదుగో. సత్యమని భగవానుడు పాంచజన్యమూదుచున్నాడు వినుము.

పాప :- ధన్యోస్మి, ధన్యోస్మి. (అని నమస్కరించును.)

పీ :- తే॥ ధనము గోరెడివారికి ధనము నిత్తు
విద్య గోరెడివారికి విద్య నిత్తు
మోక్షము గోరువారికి మోక్ష మిత్తు
ననెడి శ్రీహరి పలుకులు వినుము తల్లి.

[ధవళశంఖుల నాదము వినబడును.]

ఆ మాట సత్యమని ధవళశంఖుల నూదుచుండిరి. వినుము - తల్లి.

పాప :- కృతార్థురాల. (అని నమస్కరించును.)

వీ :- అమ్మా, దుఃఖింపక నిలువుము. నేను పోయివత్తును.

పాప :- నాయనా, నీ కాపరమేశ్వరుడు సర్వశక్తి నొసంగియున్నాడు. సర్వజ్ఞుడవు. నా కాశక్తి ఎక్కడిది. కాపాడెడివారు కను లెదుట లేకుండుటొకటి, కాపాడెద ననుమాట వినబడకపోవుట మరొకటి, నా కన్నులెదుట ఉండినవాడవు నీవు నను వీడి పోవుట ఇంకొకటి. ఈ మూడు నన్ను దుఃఖమున ముంచుచున్నవి. ఎట్లు భరించి, జీవింతును తండ్రి.

వీ :- అమ్మా, నీకు కనబడి చెప్పిన నమ్మవుదువా. అంత అపనమ్మక మెందుకు తల్లి.

తే॥ ధర్మదేవత నీకండదండగాను
నిలచి నినుగాచు నెపుడు నిశ్చయంబు
నిన్ను గాపాడమని వేడుకొన్నవాడ
గారడిదిగాదు కనులార గనుము తల్లి.

(అంతలో డాం. అను శబ్దముతో ధర్మదేవత గానవచ్చును. - శంఖనాదములు వినబడును.)

ధర్మ :- పాపమాంబా! నిన్ను నేను కాపాడెదను. నన్ను నమ్మి, నిర్భయముగా నుండుము. నీ కుమారుడు త్రికాలవేది, సర్వశక్తి సమోపేతుడు. దైవమున్నాడని నిరూపించుటకు, భగవధ్యానము చేయుటకు, సర్వమతములు వకటేనని, సర్వమతములవారికి హక్కుగలదని నిరూపించుటకు జన్మించెను. ఆతని పోవనిమ్ము. నేనున్నాను. భయములేదు.

పాప :- తల్లి. నిన్ను కన్నులార చూచుటచే నా జన్మ కృతార్థత చెందినది. అనంత బ్రహ్మాండ భాండోదరీ! నా అనంత ప్రణామముల గైకొమ్ము. (అని నమస్కరించును.)

వి :- అమ్మా! నీ అవసానకాల మెరింగి, తప్పక నీ చెంత జేరి, సర్వ కార్యములు చక్కగా నెరవేర్తును. నిర్భయముగా దైవధ్యానము చేయుచుండుము. - పొమ్మా.

పాప :- నాయనా. దారిమధ్యలో చోరుల భయము, సర్ప విషక్రిమి కీటకాదుల బాధ, తీర్థయాత్రా స్థలములలో జలగండము, ఇన్నిటను వైతొలగించుకొని, నా అవసానకాలమునకు వచ్చెదవా తండ్రీ. నా మనస్సు నిలువలేదు. దుఃఖమాగలేదు.

వి :- అమ్మా. జలగండమా. (అని నవ్వి)

తే॥ అజుని వేదంబులఁ గొని, జల్ధి దూరి
దాచుకొనియున్న సోమకు పీచమడచి,
బ్రహ్మవేదాల గొనివచ్చి బ్రహ్మకిచ్చి
దయను గాచిన మీనావతారుఁడదుగో.

[ మీనావతారము గాన్పించును. శంఖారవములు, గంటానాదము, ధవళశంఖులు వినబడును. ]

పాప :- (మోకరించి నమస్కరించును.)

వి :- అమ్మా! ఆ దేవదేవుడు నాకు తోడైయుండ జలగండమా -

తే॥ క్షీరవారధిలో గిరి చేర్చి పట్టి
తరచుచుండగ బరువయి గిరిమునుంగ
వీపునను నిల్పినట్టి యాకృష్ణుమూర్తి
దయను నను గాచు కూర్మావతారుడదుగో.

[ భయంకర శబ్దముతో కూర్మావతార మగుపడును ]

పాప :- (నమస్కరించును.)

వి :- అమ్మా! నదీ నదములందు, సముద్ర స్నానములందు, - ఆదిమూర్తులగు మీన, కూర్మరూపులు తోడునీడై నన్నెల్లప్పుడు కాపాడుచుందురు. భయమందకుము. ఇక మార్గమధ్యములో నందువా.

పాప :- ఔను నాయనా.

వీ :- తే॥ భూమి చాపగచుట్టిన పొగరుబోతు
నాహిరణ్యాక్షు దునుమాడి అవనిగాచి
సర్వజీవుల బ్రోచిన స్వామినన్ను
దయను గాచు వరాహావతారుడదుగో.

[ శంఖా, గంటా నాదములతో భయంకర శబ్దములతో వరాహావతార మగుపడును. ]

పాప :- ధన్యను. ధన్యను. (అని నమస్కరించును.)

వీ :- అమ్మా! అరణ్యమార్గములలో క్రూరమృగముల బాధ గలుగు నని గదా। భయము.

పాప :- ఔను తండ్రి.

వీ :- తే॥ రక్కసుండైన హైరణ్యు నుక్కడంచి,
భక్తుడైనట్టి ప్రహ్లాదు బాధమాన్పి,
త్రిభువనంబుల గాచిన దివ్యమూర్తి,
ముందు నను గాచు నరసింహమూర్తి అదుగో.

[ భయంకర శబ్దముతో నృసింహావతార మగుపడును. ]

పాప :- కృతార్థత జెందితిని. (మోకరించి నమస్కరించును.)

వీ :- అమ్మా! చిన్నవాడనని నాకు తప్పు తెలియదని, ఎవరితో యెట్లు మాట్లాడవలయునో తెలియనివాడే యని, ఎవరితో యెట్టి బాధలు గలుగునో యని బాధనొందెదవా.

తే॥ బలిని దిగద్రొక్కి ఇటు రసాతలము జేర్చి
దేవతల యార్తిబాపిన దివ్యమూర్తి
యింట, బైటను నెపుడు నావెంటనుండి
ముందు నడిపించు వామనమూర్తి అదుగో.

[ శంఖారవముతో వామనావతారము గానవచ్చును. ]

పాప :- కృతార్థురాలను. (అని నమస్కరించును.)

వీ :- అమ్మా! యింకా సందేహమా. మార్గమధ్యమున చోరులు, క్రూరులు, కిరాతకులు బాధింతురందువా.

తే॥ భూపతులనెల్ల పొలియించి భూమినెల్ల
కశ్యపున కిచ్చినట్టియా ఘనభుజుండు
పురుషసింహుండు జమదగ్ని పుత్రుడెపుడు
ప్రేమ ననుగాచు భార్గవరాముడదుగో.

[ పరశురామావతారము గాన్పించును. ]

పాప - ధన్యోస్మి, ధన్యోస్మి. (అని నమస్కరించును.)

వీ :- అమ్మా! నన్నహర్నిశము కంటికి రెప్పవలె కాపాడు మరొక రాముని చూడుము.

తే॥ దశరథాత్మజుడై పుట్టి దానవులను
చించి చెండాడి సుజనుల చింతదీర్చి
ధరణి పాలించినట్టి కోదండధరుడు
దయను ననుగాచు రామావతారుడదుగో

[ కోదండరాముడు గాన్పించును ]

పాప .- కృతార్థురాలను. (అని నమస్కరించును )

వీ :- అమ్మా! నిద్రావస్థలో, జాగ్రదావస్థలో ఇంట బైట అండదండగా నిల్చి కాపాడు ఇంకొక రాముని చూడుము.

తే॥ యదుకులంబున పుట్టొంది అధికులైన
దానవులనెల్ల దునుమాడి ధరణియందు
బాహుబలుడంచు ప్రఖ్యాతి బడసినట్టి
స్వామి ననుగాచు యాబలరాముడదుగో

[ బలరామావతారము గాన్పించును. ]

పాప :- కృతార్థురాలను. (అని నమస్కరించును.

వీ :- అమ్మా! స్త్రీలనుండి, సిరినుండి కాపాడి గట్టెక్కించు బ్రహ్మాండభాండోదరు నటుచూడుము.

తే॥ బుద్ధుడ౯ కృష్ణుడ౯ పేర భువినివెలసి
దైవసాన్నిధ్యము౯ జేరు దారిచూపి
నసురులనునెల్ల బరిమార్చినట్టి స్వామి
దయను ననుగాచు బౌద్ధావతారుడదుగో.

[ కృష్ణావతారము గానవచ్చును. ]

పాప :- (నమస్కరించును.)

వీ :- అమ్మా! కలికాలమిది. క్రూరులు విచ్చలవిడిగా తిరిగెడి కాలము. ఎవ్వరేమి చేయుదురో, ఎచ్చటెట్టి విపత్తులు గలుగునో యని భయమా. కలిపురుషుడే నాకు తోడునీడైయుండిన భయము లేదుగదా.

ఆ॥ కలియుగంబునందు కలికావతారడై
కలినినడుపు వాని బలముగలుగ
నాకు భయము గలదె, లోకాలలోనెందు
కలివ పోనుభావు గనుము తల్లి.

[ కలికావతారము గానుపించును. ]

పాప :- (మోకరించి నమస్కరించి, లేచి చేతులు జోడించి) నాయనా, నే చాకిన కుమారుడవు. మానవుడన్న అజ్ఞానము తొలగినది. దివ్యజ్ఞానమూర్తివని, దైవసమానుడవని, త్రికాలవేదివని యెరింగితిని. ఇక ఈ మల్లోకములలో ఎచ్చట భయము లేదని తెలియ నయ్యెను. ఒక కోరిక. - నాయవసానకాల సమయమునకు నా చెంతచేరి నా కట్టె కడతేర్చెదనని, ఒకమాటనుము చాలు. (అని నమస్కరించును.)

వీ :- అట్లే కానిమ్మా. తథాస్తు. (అని చేయిసాచి ఆశీర్వదించి వెడలి పోవును.)

పాప :- (ఆయన వెళ్లిన వైపు చూచి చూచి, దుఃఖముతో వెనుదిరిగి పోవును.)

( తెర వాలును. )

## ద్వితీయాంకము — ద్వితీయ రంగము.

ఆసాదివాళ్ళు — బదిరిగాడు, సివెంకన్న.

కొండా్రియుడు, కొండా్రియుడు
తిరుమల కొండా్రియుడు, కొండా్రియుడు.
[ అని పాడుకుంటూ, జవనిక వాయించుచు ప్రవేశము. ]

బద్రి :- ఓహోయ్, యంకాయ్! ఇక్కడేదో జరుగుతుంది. దండిగా పెజలుండారు. కాసింత కథ వినిపిద్దాము- మహానుభావులు, డబ్బున్న దాతలు. ఇంతో, అంతో, సూంత ఏత్తారు. ముందు మనేలకు మనకు కావలెగా, కల్లుముంత కామాచ్చమ్మకు. -

వెం .- కానీ మామోయ్. కాకెక్కి పోయింది. రెండు ముంతలు పడేత్తేనేగాని సల్లగా వుండదు. కానీ. (జవనిక వాయించును.)

బద్రి :- సోములోర్లకు, సబాసదులందరికి దండాలు దండాలు.
మహంకాలి మాయమ్మ కాలికాదేవి రావమ్మో!
పెద్దమ్మతల్లి ఇసుకోటి యల్లమ్మతల్లి మాయమ్మ రావమ్మో!
తల్లీ మాపాలసిల్చి, మానోటబలికించి ముమ్మ గాపాడుమమ్మో॥

వ॥ ఏమోయ్, యంకాయ్! ఈరబెమ్మము తనను సాకి సంతరించిన యీరపాపమాంబకు సమాధానము సెప్పి, తీర్తయాత్తర్లు సేయ బోయినాడంత - పోవడము పోవడములోనే,
తిరుపతి యేడుకొండలరాయుని దరిశనము చేయవలెనని తలంచి- ఏడుకొండలెక్కి- ఎగువతిరుపతి చేరినాడో - ఆ. ...
పుష్కరిణిలో మూడు మున్కలేసి, సూర్యదేవునికి మొక్కి, యంక టేసుని సూడబోవునపుడు - తన కమండలము, ములుబట్ట, తాల పచ్చగెందము అక్కడబెట్టి కోతుల కావిలుండమన్నాడో- ఆ. ...
కోతులు కోటగట్టి, కోలన్న వేయుచుండగా అందరుసూసి, జంతువులకూడ వశము చేసుకొన్నా వీరెంతవారో అని ఆశ్చర్య పోయినారో - ఆ. ...

వ॥ అప్పుడు బెమ్మగారు లోపల పవేసించి, చేతులు జోడించి,
దేవ దేవశరణు - మహా దేవ దేవశరణు।
నాపాలి సామిశరణు - నన్నేలు సోమి శరణు।
శ్రీ వెంకటేశ శరణు - శ్రీ తిరుమలేశ శరణు॥

అని యేనోల్ల దేవుని యేడుకోని, చేతులు జోడించి, మోకరించి మొక్కినాడో - ఆ. ...

అప్పుడు సామి మొరాలించి, సూసి సంతోషించి, తన కుడిచేతిలో పూలమాలను ఈరబెమ్మము మెడలో పడునట్లు చేయగ, అక్కడున్న పూజార్లు, బామ్మలు ఆశ్చర్యపడి - యంత బకుతుడు, యంత బకుతుడని పొగడసాగినారో - ఆ. ...

దేవుని దరిశనము చేసుకోని బయటికి వచ్చేయాలకు; పులిగోర్లు, దద్దోదనాలు, సక్కెర పొంగల్లు, వడలు, లడ్డుంట్లు, మనోహరాలు తెచ్చి యిచ్చి, దండాలు పెట్టి నిలుచుకొనగా, ఆ తెచ్చిన వన్నీ కోతులకు యిందుజేసి పెట్టేయాలకు, పెజలు చుట్టుకున్నేరో - ఆ. ...

వ॥ అప్పుడు బెమ్మంగోరు పెజలను సూసి, ముందొచ్చె కాలము సంగతులు సెబుతాను; వినండయ్యా - అని

గీతం :- పెద్దకులాలోల్లు పల్చనైపోతారు
పెద్దింటివాల్లంత పెబువులౌతారు
అన్నాడయా బ్రిమ్మమన్నాడయా ॥ ఆ ॥

మంతాళ్రిలవాల్లంత మాయమైపోతారు
యంతాళ్రిలవాల్లంతా అధికులైతారు ॥ అన్నాడయా ॥

యగ్నేలు యాగాలు నష్టేటపడతాయి
పంచమలె యాదాలు పటియించుతారని ॥ అన్నాడయా ॥

రానురానూ రవిక లెగజారిపోతాయి
రానురానూ చీర్లు దిగజారిపోతాయి
రవికకు చీరకు సందింతవుండంగ.
యువకులంతా చూచి కలవరిత్తారనీ ॥ అన్నాడయా ॥

కట్టుజుట్టూ బొట్టు కడదోసవేత్తారు
కట్టేల బొట్టేల (తాళి, బొట్టేలనంటారు
వేదాలు సంస్కృతము పెన్నెటబడిపోవు
పరదేశ జానలు పెబలమౌతాయని ॥ అన్నాడయా ॥

ఆడవాళ్లాశక్తి మిన్నంటిపోతుంది
మొగవారిలోశక్తి దిగజారిపోతుంది
పసలేని పురుసుడని మూతిపొడిచే కాల
మొస్తుందనీ ముందుకొస్తుందనీ ॥ అన్నాడయా ॥

ఆడోళ్ల బట్టలు మొగవాళ్ల కొత్తాయి
మొగవాళ్ల బట్టలు ఆడోళ్ల కొత్తాయి
ఆడమగలనుగుర్తు పట్టజాలని కాల
మొస్తుందయో, ముందు కొస్తుందయో ॥ అన్నాడయా ॥

( వీరబ్రహ్మము వచ్చి, రామభద్రియ్యా అని పిలుచునంతనే, భద్రిగాడు ఉలికిపడి )

బద్రి :- దండాలు దండాలు. యేలినోరికి దండాలు. అంతమాటనకు సోమి అంతమాటనకు. నా పేరు బద్రిగాడు అంతారు, ఆ పేరు మానాయన పెట్టుకొన్న పేరు సోమి.

వీ :- నాయనా, ఎట్లు పిలిచినను ఆ రామునే చేరను. గాడు, వాడు శబ్దముల ఉపయోగించిన, పిలచినవారికే పాపము వచ్చును. ఒరుల పిలువడములోనైన రామశబ్దము నోట ఉచ్చరించునని, వినునని; పలుకుటచే, వినుటచే పుణ్యము వచ్చునని మన పెద్ద వారు దేవుని పేర్లను మానవులకు పెట్టిచారు. చక్కగా పిలు వని దోషము వారినే ఆశ్రియించును. నిన్నాశ్రియించదు. - అది అటుండనీ. నీది మల్లేలగదా; అక్కడ కలరా వుండుట వల్ల భయపడి పొరుగూరికి వెళ్లుతున్నావుగదా.

బద్రి :- ఇదేంది సోమి, ఇదేంది సోమి. నా పేరు, వూరు తెల్సుకు న్నేవు. ఆ మారెమ్మ తల్లిని తెల్సుకున్నేవు. దేవునిలాంటి ఒనివి. దండాలు దండాలు.

వీ :- భద్రియ్యా! మృత్యువును తప్పించుకొనన నౌనా. ఎక్కడున్నా అయువు తీరినవేళకు యోగిని, భోగిని, విరాగిని కూడ పట్టి చంపును. పా పోదాము మీ వూరికి. మీ భయము దీర్చి పో యెదను.

బద్రి :- అయ్యో సోమి, వద్దు వద్దు. మొన్న పెద్ద సాదు, చిన్న సాదు యిద్దురొచ్చి ఎంకాయలు, నిమ్మకాయలు తెప్పించి, మంత్రాలు, యంత్రాలు చేసేయేలకు - అమ్మోరికి కోపం వచ్చి పెద్ద సాదుకే తగిలింది. తగిలి, దీనితస్సదియ. యనక్కు ముందుకు, ముందుకు యనక్కు పదిమాట్లు ఊంచి తగిలించే టప్పటికి పెద్ద సాదు గడ్డు పెట్టినాడు. చిన్న సాదు అదిసూసి పరారైనాడు. ఎత్తకపోయి పారేయడము మామీదనే పడింది. అమ్మోరికి కోపం వచ్చింది. అందర్ని సంపుతుందని చెట్టుకొకడు గట్టుకొకడైనాడు. సామీ వద్దు. సన్నాసులసూత్తే బెల్లమెత్తు కున్నెట్లే. మేము రాం. సోమి, రాం రాం. ఊపిరుంటే ఉప్పమ్ముకోని బతకొచ్చు.

వీ :- భద్రయ్యా! ప్రాణభయము అన్నిభయములకన్నా మిన్నైనది. జీవులకని - నాకు తెలుసు మీరు చూసేట్లుగా ఇక్కడికే ఆ మారికా ఉపద్రవశక్తిని పిలిచి, - పోయెదనని మీ యెదుటనే చెప్పి, వప్పించి పంపించెదను. - నమ్మెదరా.

బద్రి :- సోమి! కండ్లకగుపడకుండా ఉంటేనే ఇంత భయంగావుంది. సూత్తే, అరిసి ఆట్లనే సత్తాం. మా సోమి వద్దు వద్దు.

వీ :- నేనున్నామగా- భయపడకుడు. జేయ్ భవాని. (అని యోగ దండమెత్తి) ఓ మారికా ఉపద్రవశక్తి, ఇటురా. ఊ రా. రా. [భద్రయ్య, వెంకన్న భయ దిగ్భ్రమములతో చూచుచుందురు. నోరు తెరచుకొని భయంకరాకారముతో ఒక శక్తివచ్చును. దానిని చూచి భయపడి భద్రి, వెంకన్నలు - పెద్దమ్మ తల్లి అని కేకవేసి, బోర్ల పండుకొందురు.]

వీ :- ఓ శివశక్తి! నీవు ఈ చుట్టూ రెండామడ దూరము విడచి, తక్షణం వెళ్లిపొమ్ము. ఎక్కడగాని వుండినా, ప్రజల బాధించినా నీ రూపమే లేకుండ చేతును. - భద్రిము. పొమ్ము.
(శక్తి మాయమై పోవును.)
[ఎగచూచి, తల్లీ భవానీ! అనును. పార్వతి ప్రత్యక్షమగును.]
తల్లీ! ప్రజలు భయభ్రాంతులై చెట్టుకొకడు, గుట్టకొకడు పోవుచుండ చూచి వూరకుందువా. కరుణలేదా. నీ సంతతి కాదా.

పార్వతి :- వత్సా! మాకు జీవులపై దయాంతఃకరుణ లేకపోలేదు. ఈ మారికా స్ఫోటకములచే చచ్చెడివారు, బాధనొందెడివారు, పూర్వజన్మ మహాపాపులు. తలిదండ్రికి అన్నము పెట్టక, చక్కగా చూడక, వారి శాపగ్రస్తులై, గురవుల కపకార మొనర్చి, అక్క చెల్లెండ్రిను, సగోత్రులను; పెదతండ్రి, పినతండ్రి పిల్లలను; సోదరుల భార్యలను కామాతురులైపొందిన పాపమాపాదించి, మారికా స్ఫోటక ఉపద్రవ శక్తులచే బాధనొంది చచ్చెదరు. - ఇది పరమేశ్వర నిర్మితము. వారియాజ్ఞ ఎవరు తప్పింప జాలరు. దీనిని తప్పించిన మరొకరూపమున చంపును. వత్సా! చింతింపకుము. చేసిన పాపము అనుభవింపక తప్పదు.

వీ :- చిత్తము. (అని నమస్కరించును.) [భవాని మాయమగును.] భద్రియ్యా! లే లెమ్ము. మారికాశక్తి పోయినది. లే.

బద్రి :- (లేచి దండముపెట్టి) సోమీ, నీవు భగవంతుడవు. నమ్మినాము. మావూళ్లో మీపాదాలు పెట్టితే మావూరు పావనమౌతుంది. ఓరుసోమి మీరు?

వీ :- భద్రియ్యా, నీవింతవరకు కథ చెప్పుచుండిన వీరబ్రహ్మమును నేనే.

బద్రి :- (ఉలిక్కిపడి) ఓరే యంక, పెద్ద దండంపెట్టు. పెద్ద దండం పెట్టు. మాన్నబోవులు. (మోకరించి దండము పెట్టుదురు.)

వీ :- జ్ఞానాభివృద్ధిరస్తు. (అని దీవించి) భద్రియ్యా! దండములలో పెద్ద దండము, చిన్నదండ మేమిటి?

బద్రి :- అయ్యో సోమి. చూసినోల్లకందరికి వంగి దండం పెడ్తుంటాము. అది పనిజరుపుకునే దండం. మీబోటి పెద్దసోములోర్లకు పెట్టే దండం - మోకరించి మనసార పెడ్తాము.

వీ :- ఆహాఁ అట్లనా. మంచిది - నాయనా, నేను బనగానిపల్లెకు పోవలయును. మీవూరి దారినేవచ్చి పోయెదను గ్రామములో ఈ వార్త చెప్పి, అందరూ వూరుచేరునట్లు చేయుము. నిర్భయుడవై పొమ్ము.

భద్రియ్యా! మీవలెనే మీ పిల్లలు భిక్షమెత్తుకొని జీవించునట్లు చేయక, ఇది మావృత్తియనక, కల్లు సారాయి మొదలగు నీచపదార్థముల జోలికి పోక కష్టముచేసి జీవించుచు-దైవధ్యానము చేయుచుండునట్లు చేయుము. ఆ ధ్యానశక్తి, మరుజన్మకు ధనికులుగా, విద్యావంతులుగా, ఉద్యోగులుగా జన్మింపచేయును. అందరివలె మీరు జీవింతురు. అందరిలో కలిసి మెలసి వుందురు. సాత్విక వృత్తితో జీవించుటచే ఈ జన్మలో గౌరవప్రతిష్టలు గలుగును. ఘనముగా జీవింతురు. మానవుని నడకలోనే గౌరవా గౌరవము, పుణ్యముండునని తెలుసుకొనుము.

బద్రి :- సిత్తం సిత్తం. తప్పక సేత్తాను సామి. తమ దయవుండాలి.

(బద్రిగాడు, సిదెంకన్న నవ స్మరిస్తూ వెన్కు వెనక్కె జరిగి పోవుదురు.)

[అంతలో ఒక సాధువు, తత్వము పాడుకొనుచు వచ్చును.]

వీ :- నాయనా సాదు. తత్వములు పాడుచు భిక్ష చేసుకొనుటకన్నా భగవన్నామోచ్ఛరణ చేయుచు భిక్ష చేసుకొనరాద. భుక్తి, ముక్తి లభించును. - ఈ మట్టివల్ల గలిగెడి పాపము భగవన్నామ సంస్మరణమువల్ల నశింపగును పూర్వజన్మ కర్మ నాశమొందును; నాయనా.

ఆ॥ ముష్టి నెత్తుకొనుచు భుక్తిని గడపిన
ముష్టి మునకపడునె ముందుకీక
మునకపడెడు ముష్టి మురిసి చేయుదురేల
తెలియకడుగుచుంటి తెలుపుమయ్య.

ముష్టి మునకపడదు. మునకపడదనియే భిక్ష వేయుచుండిరి. మునకపడునట్లుండిన వేయబోరు. కష్టముచేసి ఆరించి తినక, ముష్టి యెత్తుకొనుట మహాపాపము ఈ ముష్టి పాపమును పోగొట్టుకొనవలయునన్న, ఈ ముష్టి ధాన్యమును దుర్వ్యయము గావింపక, పచనమొనర్చి, దైవనివేదనచేసి భుజించిన, అటు ముష్టి నొసంగినవారిని, ఇటు తీసుకొన్న నిన్ను, ఆ పరమాత్ముడు బాధ్యత వహించి రక్షించును. ఒరులేదొసగినను, కృష్ణార్పణమని భగవదర్పితమొనర్చి భుజింపవలయును. లేదా మరుజన్మమున భిక్షకూడ దొరుకక, అన్నాహారములకు అటమట పడవలసివచ్చును. పెట్టిన వారిబాకీ తీర్పవలసివచ్చును. నీవు దైవనివేదన చేసి భుజించిన, దైవమే వారికియ్యవలసివచ్చును. యీ పాపమునుండి తప్పించుకొందువు.

కం॥ పెట్టనిది రాదు పుణ్యము
తిట్టనిదే రాదు పాదు తెలిసినదేగా
పెట్టక కృష్ణార్పణమని
పుట్టుదురే ధాత్రి పుణ్యపురుషులు వత్సా

కం॥ పెట్టినవారలె యిప్పుడు
పుట్టుకతో సర్వసౌఖ్యములు పెంపొందన్
దిట్టముగ గద్దెనెక్కియు
పెట్టినఫలమనుభవించు పెద్దలు వత్సా.

కం॥ వినువీధిని విహరించుచు
దినమొక సుస్వాగతంబు తేరకునియ్యన్
దినమణివలె వెలుగొందెడి
ఘనులే మునుపెట్టినట్టి ఘనులు ధరిత్రిన్.

వారు పుణ్యము కావలెనని పెట్టినారు. నీవు పుణ్యముకావలె నని దైవనివేదన చేయుము. వారికి నీకు యిచ్చుటకు దైవ మున్నాడు. - నాయనా, నీవు అందరివలె భార్యాపిల్లలతో సుఖపడవలయునన్నను; ధనము, విద్య దేహశక్తి కావలయు నన్నను; ఉదయమే స్నానముచేసి, కట్టు జుట్టు బొట్టు సవ రించుకొని -

శ్లో॥ వనమాలీ గదీ శార్ఙ్గీ శంఖీ చక్రీచనందకీ
శ్రీమన్నారాయణో విష్ణుర్ వాసుదేవోభి రక్షతు.

అని దైవమునుతలచి, భిక్షాపాత్ర చేపట్టి, బయలుదేరి ఆ భగవ ధ్యానము చేయుచునే ఓక్షమెత్తుకొనవలయును. భిక్షవేసిన తోడనే కృష్ణార్పణమని చెప్పవలయును.

హరేరామ హరేరామ - రామరామ హరేహరే
హరేకృష్ణ హరేకృష్ణ - కృష్ణకృష్ణ హరేహరే.

లేదా

శ్రీరామ జయరామ - జయజయ రామ

లేదా

రఘుపతిరాఘవ రాజారాం - పతితపావన సీతారాం.

ఈ గీతముల స్మరించుచు, పాటరూపమున పాడుచు, మధ్యా హ్నము వరకు భిక్ష చేయునప్పటికి వేలమార్లు భగవన్నామము నాలుకతో నుచ్చరించినవాడవగుదువు భిక్ష దినదినాభివృద్ధియై పెరుగును. దైవబలము కావలసినంత లభించును.

ఆ॥ ఉండవలయుశక్తి నుభయలోకంబుల
లేనివాడు నేమి లేనివాడు
శక్తి మహిమలోన భుక్తిముక్తి యణంగి
యుండునయ్య దేవుడుండునయ్యా.

భిక్షా ధాన్యము పక్వమొనర్చి, భగవన్నివేదన చేసి భుజించిన వానికి కైవల్యము దానంతటది ఎదురైవచ్చును.

కం॥ దైవార్పితమగు నన్నము
జీవిత పర్యంతముగను స్థిరుడై తిన్నన్
కావలసిన సుఖములతో
భావిని కైవల్యమెదురువచ్చును యోగి.

కం॥ నిత్యము హరి మదిదలచిన
నత్యంత ముదంబుతోడ నలరుచు నాపై
నత్యున్నతమగు పదవికి
సత్యమునరుదేగు చూడ సాదువరేణ్యా.

నాయనా, మరొకటి చెప్పెదను విను. భిక్ష చేసుకొని, సత్రిముకో, సావిడికో పోయి పాకము చేసుకొని భుజింపవలయుననిన మహా కష్టము. ఒక అనాధస్త్రీని రక్షించిన వంటవల్ల బాధ వైతొలగును. అనాధను రక్షించిన పుణ్యము లభించును.

సాదు :- రక్షింపుము. సాదువులకు, సన్యాసులకు స్త్రీతోడు కూడ దందురే స్వామి.

వీ :- నాయనా, స్త్రీ తోడున్నంతమాత్రమున తప్పులేదు. ధనాశను చూపించియో, బాహుబలముతోనో, ఎట్లో కుటుంబ స్త్రీలను నాశనము చేసినను, భార్యవుండగా మరొకస్త్రీని ఉంచుకొన్న తప్పక మరుజన్మము సన్యాసిజన్మ మొచ్చును. ఆ పాప ఫలమే నిన్నిప్పుడు సన్యాసిగా చేసినది. ముందు జన్మమున స్త్రీల కపకారము చేసినవానికి సన్యాసిజన్మ తప్పదు. పురుషుల కప కార మొనర్చిన స్త్రీలకు విధవత్వము తప్పదు - నాయనా.

కం॥ వావియు వరుస గణింపక
కావరమున కన్నుమిన్నుగానక తిరుగన్
స్త్రీవిభవము శూన్యంబై
భావిని సన్యాసిజన్మ వచ్చును యోగీ.

కం॥ ఇంటను కులసతి తనకై
కంటను నీర్వెట్టుచుండ కాంతలతోడన్
కొంటెతనంబున తిరిగెడి
తుంటరి సన్యాసియగుచు దుఃఖించు ధరన్.

యోగీ! మరి వక్కటి విను.

కం॥ పతి కపచార మొనర్చిన
సతియే వైధవ్యమొంది సౌఖ్యము చెడగ౯
మతిచెడియు విరాగినిగా
బ్రతుకును జీవచ్ఛవంబు భాతిగ యోగీ.

అట్టివారికి పాపము, చక్కగా సంరక్షించిన యెక్కడనుండి పాపము వచ్చును - రాదు.

కం॥ వండను పెట్టను గృహముల
నుండను, కార్యములు చేయుచుండను నండ౯
అండజయాన యొకర్తుక
యుండిన, కైవల్యపదవి యొదవదె పాదూ.

కం॥ అడుగడుగున పురుషుండిల
పడు కష్టసుఖాలనెల్ల పంచుకొనంగ౯
పడతికి మించినవారీ
పుడమిని వేరొకరుగలరె పొడగన సాదూ.

నాయనా, దేవతలకుకూడ కింకరులున్నారు. దాస్యము చేయువారు లేకున్న భగవత్కైంకర్యములు కూడ సాగవు. వివాహము లేక నీవెట్లు జీవింతువు. చూడు -

ఆ॥ ఆండలేని జన్మముండరాదని బ్రహ్మ
పట్టుపట్టి భార్యమై గట్టుకొనడె
ఆలులేకయున్న నగచాట్లపాలని
నాదిదేవులిద్దరాండ్రి గొనరె.

ఆ॥ బ్రహ్మలందరికిని భార్యలుగలుగరో
సప్తఋషులకెల్ల సతులులేరొ
మహిమతగ్గి వారు మగ్గిరా మగ్గిరా
తెలియకడుగుచుంటి తెలుపుమయ్యా.

ఆ॥ చీమ మొదలుకొనియు శివుని పర్యంతంబు
జంట జంటలుండ కంటబడదొ
కాంతపొత్తుచాల కంటకప్రాయమా
తెలియకడుగుచుంటి తెలుపుమయ్యా.

నాయనా, సాలుగా కార్యము నడుపుచుండిన పాపములేదు. రాదు. - ఉదయము బిక్ష చేసుకొని, మధ్యాహ్నము నుండి దేవాలయము చెంతచేరి పరిశుభ్రము చేయుటో, తులసిని, పూలచెట్లను పెంచి దేవతాపూజకర్పించు ప్రయత్నమునముండి, సాయంత్రము దైవధ్యానముచేసి, ఉన్నదేదో భుజించి, పరుండుట నియమముగా నుంచుకొనవలయును. దేవతాసేవక్రింద ఈ దేహమునుపయోగించవలయును. అప్పుడు ఈ బిక్షాపాప మంతరించును. మరు జన్మమున సకలైశ్వర్య సంపన్నునిగా భగవంతుడు పుట్టించును. సర్వవిధముల సుఖింతువు. దైవమును మరచిన, ఈ ముష్టిదోషమున పశుపక్షి క్రిమికీటకాదులలో జనించి దుఃఖించుట నిశ్చయము. భగవంతుని దలంచి పురోగమింతువో, తలంచక తిరోగమింతువో ఆలోచింపుము.

ధర్మబద్ధుడవై, కష్టపడి దైవధ్యానము చేయక ఈ దాడిపెంచి, కావివస్త్రములు గట్టి. యోగదండము, కమండలము చేతబట్టి, జింక చర్మము సంకన బెట్టినంత మాత్రమున యోగి కాడు.

కం॥ పులితోలు కప్పినంతనె
కలుగునె ఘనపౌరషంబు గార్ధభమునకున్
తలబోడి కొట్టుకొనినను
వలువలు మార్చినను ముక్తివచ్చునె వత్సా.

నాయనా, మైధున నిద్రాహారములు సకలజీవులకు నైజముగా పుట్టబడినవి. అనైజముగా వీటిని తుడిచివేయ మానవులకవునా.

ఆ॥ పక్వబుద్ధి మనసు పట్టిబంధించును
పక్వబుద్ధిగాక పట్టగలదె
బాడబాగ్నిచేత బట్టినట్లుండును
మనసుబట్టనౌనె మానవులకు.

నాయనా, బుద్ధిః కర్మానుసారిణీ అన్నవచనము విన్నావుగదా.

ఆ॥ కర్మనంటి తిరుగు కలకాలము ♦ బుద్ధి
బుద్ధినంటి తిరుగబోదు కర్మ
బుద్ధియెట్లో యట్లు బోధించు యోచించు
దాని ద్రిప్పనౌనె ధాతకైన.

వత్సా! స్త్రీని సహాయము తీసుకొని, ఆమెను చక్కనిమార్గమున త్రిప్పి, ఇహపరములకు మార్గదర్శకుడవై పుణ్యము గట్టుకొనుము. - నీకుకాగా మిగిలిన ధనమును భగవత్కైంకర్యములకు వినియోగింపుము. - దురాభ్యాసములకు వశ్యుడవుగాక, శాకాహారివై, దైవధ్యానము చేయుచు, దారిద్ర్యమును జయించి నీ కోర్కెల తీర్చుకొనుము - పొమ్ము.

సాదు :- చిత్తము. - సెలవు. (అని నమస్కరించును.)

వీ :- జ్ఞానాభివృద్ధిరస్తు. [సాదు నిష్క్రమించును.]

( వీరబ్రహ్మము పాడుకొనుచు పోవును. )

---

## ద్వితీయాంకము – తృతీయ రంగము.

" గరిమిరెడ్డి అచ్చమ్మ యింటి పంచటరుగు. "

వీరబ్రహ్మము యోగదండము, కమండలము అరుగుదగ్గర పెట్టుకొని పరుండును - కొంతసేపటికి నలుగురు దొంగలు వచ్చి చూచి, ఆ కమండలము దొంగలింప దలంచి, ఒకడుపోయి కర్రయెత్తుకొని కాళ్లప్రక్క నిల్చును. - మరొకడు చెంబుపై చేయిపెట్టును చేయి కరచకపోవును. తనకలాడినను రాకపోవును. వానిని ఈడ్వవలయునని మరొకడు వానిని పట్టి లాగును. వాడూ కరచకపోవును. మూడవవానికి అట్లే జరుగును. ముగ్గురు యిడిపించుకొనుటకై తనకలాడుచుందురు.

బడేసాబు :- (తిన్నగ) ఏమీరా, అట్లా పీకులాడుతారు.

[అని ముందుకు కాలు పెట్టబోవును. కాలు రాదు. చేయి దించబోవును. చేతులు ముందుకు రావు.]

అరెరే. చేతుల్, కాల్లు పోయినాయిరా. అరెరే. చింతాకు కొడ్క! నీది మాటయిని నాది పానం, మానం పోయెగదుర. అరే మంగల్ కొడ్క - ఇప్డు ఏమి సేయాలా?.

సామి, సాదు దయ దల్సు. దొంగ కొడ్కుల్ సెంబుకోసం, సేతగాని పనిసేసి, నాకీ దింపినార్; సంపినార్. యెన్నట్కి రాను. తల యెత్తి సూడ. సలాం సలాం. అల్లా అంతటి వాడౌ. ఈ ముర్దార్ కొడ్కుల్ అని యిడిసీపెట్టు. బతికినంత కాలం నీకి తలుస్తాం. - అల్లా ... (అని గట్టిగా అరచును)

[అచ్చమ్మ వాకిలి తెరచుకొని వచ్చి చూచి]

అచ్చ :- ఏమయ్యా! చేతులు వెనక్కుపోయినవే ఎందుకు? మీరేమి వకరినొకరు పట్టుకొని ఆట్లువ్నా రెందుకు?

దొంగ :- అమ్మా! తప్పు క్షమించు. ఈ చెంబు యెత్తుకపోదామని చేయిపెట్టినాను. కరచకపోయినది. నన్ను గడ్డకు తీయడాని కొచ్చి, వీళ్లు కరచకపోయినారు. బడేసాబ్ సాదువుదగ్గర కత్తె యెత్తుకొని నిల్చినాడు. నిల్చినోడు నిల్చినట్లే వుండాడు. (అని యేడ్చును)

బడే :- అరే ముర్దార్ కొడ్క, నీది మాటయిని నాకీ పానం, మానం దిగిపోయింది గదుర. తెల్లవారితే ఊరంతా మొకాన్కి మూస్సార్. మల్ల బత్కేది యట్లరా. - అమ్మా తల్లీ! సాదుకీ లేపి, దయ - తల్చ - మణ. సల్లాములు పెడ్తాం

అచ్చ :- వారు మహానీయులున్నట్టున్నది. మీకు కావలసినంత పని చేసినాడు. (అని కాళ్ల దగ్గరకుపోయి నమస్కరించి) స్వామీ! తెల్లవారవచ్చినది. లేచి, ఈ దుండగుల అపరాధముల సైచి, పొమ్మని చెప్పుదురని ప్రార్థించెదను. (అని నమస్కరించును.)

వీ :- గోవింద. గోవింద. (అని లేచును.)

బడే :- సామి, గోయిందా గోయింద. మాకీ, మాకీ కటాచ్చించు. తప్పు సేసినాము. నీకు బిడ్డలము. - తెల్లకాత్రె, ఎట్టిబుట్టల

యమదూతల్ పట్టాపోతారు. కొట్టి కొట్టి పానాల్ని తీస్తార్. మానాల్కి పోతాయ్. అల్లాతోడు. ఇంక సేయఁ౯. - అరే ముర్దార్‌కొడుకుల్ చెప్పరేమిరా. అచ్చమ్మకు నడ్డీపున బొక్కా యేస్తాం అన్నేడు మంగల్ కొడ్కు. సాదు సెంబు యెత్తా పోయి, కుద్వపెట్టి, సారాయి తాగుదాం అన్నేడు బోయిల్ కొడ్కు. అరే గోయింద గోయింద, మాకీ యిడ్సా. బతికి పోతాం - నిన్ను తలుస్సాం.

వీ :- సాయబు. వీలుపడియుండిన నన్ను చావకొట్టి, చెంబు ఎత్తుక పోయివుందురుగదా. అందిన జుట్టు అందకున్న కాళ్లు పట్టు కొందురుగదా.

బడే :- అరే సామి, గడ్డి తిని సేసినాం. బుద్ధి కుదిరించినావు. బలే బుద్ధివచ్చిందె. ముచ్చదెబ్బల్ తించేగాని ముంద్కురాదు మంచి. వచ్చినాము. అల్లాతోడు వచ్చినాం, సచ్చినాం. (అని పడ్చును)

వీ :- నాయనా. సాధువుల, సన్యాసుల, అనాధల, దిక్కులేని వారల బాధించి, దొంగలించి ఎన్నాళ్లు బ్రతికెదరు. - ఈ వయసు యెన్నాళ్లుండును. వృద్ధాప్యము రాదా. చావు సిద్ధించదా. అప్పుడీపాపము విడుచునా. దొంగతనము చేయువారు, జోబీ లను కొట్టువారు, దోపిడీలను చేయువారు, మోసము చేయు వారు, ఒరులను ఎక్కిరించి రాళ్ల వేయువారు, ఎగతాళిచేయు వారు; కోతులై, గండ్రంగులై పుట్టి దొంగతనము చేయుచు, రాళ్లదెబ్బలు తింటూ, ఆకలిని భరించలేక, ఆకులలుములు తిన వలసి వచ్చును. అన్నమో రామచంద్రాయని, ఒక జన్మమం తయు అల్లాడవలసి వచ్చును. అప్పుడు కరుణించువారొకర్రుం డరు. - కష్టముచేసి అందరివలె జీవించుడు. - అపరాధమునకు శిక్ష, నాలుగు కాళ్లతో ఈ వీధి ఆఖరువరకు గోవిందలు పె ట్టుతూపోయిన మీకీబంధవిముక్తి గలుగును. పొండు. (అనును)

[వారు చేతులు క్రిందమోపి నడచు చుందురు.]

(బడేసాబును చూచి) సాయబు, నీవు వీరివెంట గోవిందోహరి అంటు పొమ్మా. నీ చేతులు చక్కబడను. పొమ్మా. ఏదీ చెప్పుము.

[గోవిందో హరి అని చెప్పును. వాళ్లు ముగ్గురూ నాలుగు కాళ్లతో నడచచు, గోవిందా. గోవిందా, ఏమి దావువచ్చె గోవిందా. అంటూ పోతూవుండగా; గోవిందోహరి అంటూ మొఖాన ఎంగిలి మూస్తార్. గోవిందోహరి ఊరంతా మూస్తారు. గోవిందోహరి. (అంటూ పోవుదురు.)

అచ్చ :- స్వామి, వీరికి తగినశాస్తి చేసినారు. తమదేవూరు?

వీ :- అమ్మా, నాకింకా వూరు స్థిరపడలేదు. దేశమంతా నావూరే.

అచ్చ :- తమరే వంశజులు?

వీ :- విశ్వబ్రాహ్మణ శిల్పాచార్యులము.

అచ్చ :- స్వామి, ఈ చిన్నవయసులో ఎంతటి మహత్తు సంపాదించినారు. తమ గురవరేణ్యుల నామధేయము?

వీ :- వీరభద్రస్వామి.

అచ్చ :- తమ నామధేయము.

వీ :- ప్రకృతము వీరయ్య అని పిలిచెదరు.

అచ్చ :- స్వామి, కాలకృత్యములు తీర్చుకొని రండు. పాలు కాచి, సిద్ధముచేసి వుంచెదను. (నమస్కరించును.)

వీ :- మనోవాంఛాఫల సిద్ధిరస్తు. (పోవును.)

అచ్చ :- గొప్ప మహనీయుడున్నట్లున్నది. నిత్యము నాకు స్వప్నమునవచ్చి, అమ్మా నీవు గురువుకొరకై యోచించి, చింతించుచున్నావుగదా. నేను వచ్చుచున్నాను. కొంత కాలము నీ వద్ద నుండి నీకు జ్ఞానోపదేశము గావించి, మోక్షమునకు మార్గము చూపింతునను మహనీయుడు వీరే. నా భాగ్యము పండినది. - (అని సంతోషముగా లోపల పోవును)

( తెర వాలును. )

## ద్వితీయాంకము — చతుర్థ రంగము.

" గరిమిరెడ్డి అచ్చమ్మ గృహము. "

ఒక కుర్చీముందు ఒక స్టూలువేసి వుండును అచ్చమ్మ.

[ వీరబ్రహ్మము ప్రవేశించును. ]

అచ్చ :- కూరచొనుము స్వామి. (అని చేయిచూపును.)

[వీరబ్రహ్మము కూర్చొనును. - అచ్చమ్మ పాలు తెచ్చి పెట్టును ]

వీ :- అమ్మా! నా కోరిక ముందు తీర్చిన, నీవిచ్చిన ఈ గోక్షీరమును త్రాగుదును. లేదేని పోవుదును.

అచ్చ :- అడుగుము స్వామి. తమరు మహనీయులు. అడుగరానిది, నా చేతగానిది- లేనిది ఎట్లడుగుదురు. త్రికాలవేదులు, దయామయులు. సెలవిండు.

వీ :- నిన్నటి దినము ఆవుల కాపరిలేక, ఆవులు దొడ్డియందే వున్నవి గదా.

అచ్చ :- ఔను స్వామి.

వీ :- కాపరి ఎవరు దొరక లేదని చింతించుచున్నావుగద.

అచ్చ - ఔను దయామయ.

వీ :- నేను కొన్నాళ్లు గోపాలదేవునివలె గోవుల కాయవలెనను ఆశయముతో నున్నాను. - కొంత కాలము నీ గోవుల కాయుటకు నన్నుంచుకొనెదననిన, ఈ పాలను త్రాగుదును లేదా మట్టకనే పోయెదను.

అచ్చ :- (ఆశ్చర్యముతో) స్వామీ, తమరు ఆవుల కాయుటయా. ఎంతటి మాట. అంతటి పాపము నాకాపాదింప చేసెదరా.

వీ :- లేదు. పాపపరిహారమొనర్చి, పరమాత్ముని చేరుమార్గము చూపెదను. నా కార్యము నెరవేర్చుకొందును. - ఏమనెదవు?

అచ్చ :- ఏమో స్వామి. తమకు తెలియనిది నాకేమి తెలియును.

దైవసమానులు. తాము నా గోవుల కాపరివైన, నాకు పాపము వచ్చునని భయమందుచున్నాను. తమకు ఆశ్రమ మేర్పరచెదను. అందుండుడు. తమకు కావలసిన పదార్థములు, సౌకర్యములు లోటువలేకుండ చేయుదును. నా మనవి ఆలకించుడు.

వి .- అమ్మా పావని, ఆ కాలము ముందున్నది. నీ కోర్కెను నెరవేర్తును. ముందు నా కోర్కెను నెరవేర్పుము.

కం॥ అంతర్గత సన్యాసము
చింతింపక సొంతముగను స్థిరుడై నడువన్
నంతంబై యఘములు శ్రీ
మంతుండై హరినిచేరు మనుజుడు తల్లీ.

అమ్మా! నీవిప్పుడు అంతర్గత సన్యాసము నడుపుచుంటివి. వినుము.

ఆ॥ విధురుడయ్యు నతడు విడువక గృహమును
ధర్మమార్గములను తప్పిపోక
తాను తినెడిదేదో దైవంబునకు చూపి
హరినిచేరు కడకు నరయు మమ్మా.

ధర్మము చేయుచుంటివి. దైవము నారాధించుచుంటివి. ధర్మమొరుల నడుగలేదు. దైవమును మరువలేదు. యింతకన్న వేరొక మార్గము కావలయునా. నీవెవ్వరికి బాకీపడవు అందరు నీకే బాకీపడెదరు. భగవంతుడు నిత్యము నీవిచ్చు ఆతిథ్యము కొరకై రాక తప్పలేదు. అంతటివానిని పిలిచి పెట్టుచుంటివి. అంతటివాడు నీకు ఆప్తబంధువైయుండెను. ఆశ్రమములేల. శ్రమలు పడనేల.

కం॥ ఆశ్రమముల సృష్టింపక
నేత్రములకు వెరువబోక నెప్పుడు నెవరిన్
నాశ్రయమడుగక శ్రీహరి
నాశ్రయము గోరుచుండు నతనిదె ముక్తి.

అమ్మా. గోవులకాయు కొలువుతో నా పని నెరవేర్చుకొందును.

యోచింపక సరే నను.

అచ్చ :- (నమస్కరించి) స్వామి. నీకు పాపము రాదు లేదు నా కోర్కెపైనే కాయుచున్నానని మనసార చెప్పుము. ఆ పాపము నన్నంటకుండ చేయుము.

వీ :- అమ్మా, నా పాపము పోవుటకై గోవుల కాయుచుంటినేగాని, నీకు పాపము రావలయునని కాదు. ఇది సత్యము - నమ్ము నా మాట.

అచ్చ :- సరే స్వామి, అట్లనే గానిమ్ము దయతో జ్ఞానోపదేశమొనర్చి, జన్మరహితమార్గము చూపెదనని వాగ్దానము చేయుము. (నమస్కరించును)

వీ :- తథాస్తు. అట్లనే కానిమ్ము. - సద్గురుని చూపమని నిత్యమా సర్వేశ్వరుని ప్రార్థించుచున్నావుగద. ఆ సర్వేశ్వరుడే, అచ్చమ్మ ఆవుల గాయుచు, అయమకు జ్ఞానోపదేశ మొనర్పమని నన్నని పెను. దైవాజ్ఞను యిరువురము శిరసావహింతము. (అని పాలు త్రాగును.) ఆవులెక్కడున్నవో చూపుమమ్మా?

[ అచ్చమ్మ ఆవుల చూప బోవును. ]

( తెర వాలును. )

## ద్వితీయాంకము — పంచమ రంగము.

అచ్చ :- (ఆలోచించుచు) వీరయ్య పరబ్రహ్మస్వరూపుడయ్యు ఆవుల గాయుట చూడ వింతగానున్నది. ఏండ్లు గడచిపోవుచున్నవి. పండుగ, పర్వదినములలో కూడ చద్దిఅన్నము తప్ప మరొకటి గానడు. సాయంత్రము పాలు మాత్రము త్రాగును. ఏ ఫలహారములు ముట్టడు. దేహము తగ్గక దినదినాభివృద్ధి యగుచున్నది. తగ్గలేదు. - వారుపదేసించుమార్గము, వారుచేయు తపస్సు. వారి మహామహిమలు చూచిన చెప్పుటకు అలవిగానివి.

మానవుడేగాని, మానవత్వముదాటి దేవత్వము చేకూర్చుకొన్న దైవాంశసంభూతుడు, పుణ్యపురుషుడు, సర్వము నెరుంగగల సిద్ధపురుషుడు, మహానీయుడు. వీరితో సేవ చేయించుకొన వలసి వచ్చెనే యను చింత తప్ప మరొక్కటి లేదు.

[ అనుకొనుచుండ, బ్రిహ్మానందరెడ్డి అమ్మా! అవి పిలుచును. అచ్చమ్మ లోపల పోయి పిలుచుకొనివచ్చి కూర్చుండచేయును. పలకను తడివి చూచి కూర్చొనును ]

బ్రిహ్మ :- అమ్మా! ఇక్కడెవరైనా ఉన్నారా.

అచ్చ .- లేరునాయనా, ఏమి?

బ్రిహ్మ :- అమ్మా, యదార్థము చెప్పుచున్నాను విను పది దినములుగా స్వామివారు నా స్వప్నమున నా చెంతకు వచ్చి, నాయనా, నీకు కన్నులు గానవచ్చునట్లు చేసెదను. ఈ దినము నుండి పదియవదినమున నేను ఆవులతోలుకొని ఇలుచేరు వేళకు నీకు కన్నులు కానవచ్చును. నీవు సంపూర్ణముగా నా శిష్యుడవయ్యెదవని చెప్పి, నిత్యము నా చెంతకువచ్చి, నా శిరమున జలము చల్లి, చేతిలో నీళ్లువేసి కన్నుల తుడుచుకొమ్మని చెప్పుచున్నాడు. ఎవరితో చెప్పవద్దన్నాడు. - ఇది పదియవదినము. ఎంత పొద్దయినదమ్మా

అచ్చ - స్వామి దయామయా! నేను చెప్పుకొనలేకున్నను, నా జీవితానంతరము వీని గతేమని చింతించుచున్న, నా దిగులు తెలుసుకొని, వీనికి కండ్లిచ్చ్వదలంచితివా. కరుణామయా! నేనెన్ని జన్మలెత్తినను నీ ఋణము తీర్చుకొనలేనుస్వామి.

[బ్రిహ్మానందరెడ్డి చేతుల చూచుకొనుచు, నమస్కరించుచు - గురుదేవ. గురుదేవ అనుచుండును.]

(అచ్చమ్మ కుమారుని చేతులు పట్టుకొని) నాయనా, నీ జన్మ సార్థకమైనదిరా. ఆ మహానుభావుని పలుకు రిత్తపోదురా. ఇక నీ కన్నులువచ్చినట్లే, నీ జన్మతరించినట్లే, నా కష్టము తీరినట్లే. మనపాలిటి దేవుడా మహానీయుడు.

బ్రహ్మ :- అమ్మా కొంచము కొంచముగా కానవచ్చుచున్నవే. నీవు నాకు కానవచ్చుచున్నావే. జై వీరబ్రహ్మగురూ! (అని గట్టిగా అరచును. చక్కగా కన్నులు కానవచ్చును.) అమ్మా, ఎన్ని సంవత్సరము లాయె నినుచూడక. ఆ గురుదేవుని దయతో చూడ గలిగితిని. (అని పాదములపై పడును.)

అచ్చ :- (కుమారుని లేపి) తండ్రీ, నీవు అంధుడవైతివే. నా అనంతరము నీకు దిక్కెవ్వరని భగవంతుని అహర్నిశము దలంచుచున్నందుకు, గురుదేవుని దిక్కుచూపి నిన్నుద్ధరించినాడు. నేనిక రేపే గతించినను దిగులు లేదు నాయనా. గురుదేవా! నీ ఋణ మెట్లు తీర్తును తండ్రీ.

[వీరబ్రహ్మము ప్రవేశించి]

వీ :- ఏమో, తల్లీ కొడుకు దీర్ఘాలోచనలో వున్నట్లున్నదే.

[అచ్చమ్మ, బ్రహ్మానందరెడ్డి గురుదేవా! అని పాదములమీద పడుదురు.]

అచ్చమ్మా! నేనేమీ చేయలేదు. నీ కుమారునికి దుష్కర్మ క్షయమై, సత్కర్మ ప్రవేశించినది భగవానుడు కరుణించినాడు. కన్నులిచ్చినాడు. నీ దుఃఖము పోయినదిగదా.

అచ్చ :- తమ దయతో కష్టము గడచి గట్టెక్కినాను తండ్రీ.

బహ్మ :- స్వామి! నిత్యము నా స్వప్నమున మాట్లాడించి, తీర్థముతో కన్నుల తుడుచుకొమ్మని తీర్థమిచ్చుచున్న మిమ్ము, నిజమైన కన్నులతో చూడగల్గుభాగ్యము గలిగినది. అంధుడనై అటమట పడుచున్న నన్నుద్ధరించి, మానవత్వమొసంగి, సువిశాల ప్రపంచమును చూచు శక్తి నొసంగితిరి. మానవత్వము నుండి దేవత్వము చేరు జ్ఞానోదయ మొసంగితిరి. మహాత్మా, నీ ఋణ మెట్లు తీర్చుకొందును. (అని నమస్కరించును.)

వీ :- కుమారా! పది దినములవరకు నీకు కన్నులు వచ్చినట్లు గ్రామములో యెవరికి తెలియపరచకుము. పది దినములు అవిధి

యున్నది అక్కడికి అరణ్యవాసము, అజ్ఞాతవాసము అవుల కాపరితనము తీరిపోవును. ఆటుపై యిరువురము ఒకేతూరి ప్రజలకు కన్పడెదము. జ్ఞాపకము ంచుకొనుము. పూజకు వేళ అయినది పా పోదము

బ్రిహ్మ :- చిత్తము. (అని నమస్కరించును.)

( తెర వాలును. )

ద్వితీయాంకము — సమాప్తము.

# తృతీయాంకము — ప్రథమ రంగము.

పసలకాపరి బుచ్చన్న, అచ్చమ్మ.

బుచ్చ :- అచ్చమ్మా! [అని పిలుచును. - అచ్చమ్మ వచ్చును ] తల్లీ! ఒకమాట చెప్పవచ్చినాను. మీ సాధువు అవుల నిత్యము తోలకపోయి ఆ తాటిచెట్ల పెద్దగయి దగ్గర అవుల నిలదోలి, ఎక్కడపోతాడో పోతాడు. అవులా కట్టుకదలవు. మేయబోవు. చిరుతపల్లు, నక్కపోతుల, క్రోర్నలు చుట్టూ తిరుగుతుంటాయి గాని, అవుల్లోకి చస్తేపోవు. దొంగనాయాళ్లు తోలుకపోదా మని మందలోకి పోబోతే, వాయల్లైవాడ యేం చెప్పుదులె. అబోతు కోడె రంకెలేత్తూ, చీత్తు, తోక నడ్డీపున కెత్తుకొని వత్తుంది దాన్ని సూసేటప్పటికి, ఓయబ్బో. పానాలు నిలు వునా అల్లే పోతాయి. దొంగనాయాళ్లు పరుగో పరుగు. - మాంచి దొంగనాయాళ్లకే అలవిగాలె. దినమ్మ యింతె.

అచ్చ :- బుచ్చన్నా! మా మందలో ఆట్లాటి అబోతులేదే. చాలా సాదువే.

బుచ్చ :- ఏమోతల్లీ. దొంగల పసిగట్టిందో ఏమోగాని, దాన్నితల్సు కుంటే దిగులు పుట్టుంది. అమ్మా! ఆసాదు ఎక్కడవుంటాడో,

ఎక్కడపోతాడో ఏమో. ఇట్లయితే ఆవులు చెడిపోవు. - ఏమో తల్లి, మీ పాలేరుగాన్ని గాజట్టి చెబుతుండాను. చూసుకో.

అచ్చ :- బుచ్చన్నా! రేపే పరీక్షించి, ఆ సాధువును పొమ్మంటాను.

బుచ్చ :- ఆదిమాట - సాదులు ఆవుల కాయాలంటే అవుతుందా. ఎంతో ఓర్పుండాల ఎండా గాలికి ఓర్చుకోవాల తల్లి.

అచ్చ :- బుచ్చన్నా! దొంగలకు, చిరుత పులులకు వీలుకలిగిస్తాను. - అన్నా! ఆ మహానీయుడు వచ్చి ఎంతో కాలమైనది ఆవులు దినదినాభివృద్ధి గావస్తున్నవి. ఒక ఆవుగాని, దూడగాని నష్టము గాలేదు. - ప్రతి సంవత్సరము అయిదారు ఆవులన్నా, దొంగలవల్లనో, పులులవల్లనో నష్టమగుతూనే వుండెడివి. ఆ దొంగలకు దొరుకలేదని చింతా. అయినా, నేనుచూచుకొనెదను పో.

బుచ్చ :- ఏమో తల్లి, చెప్పవలసినది చెప్పినాను. అవతల నీ ఇష్టము. (అని పోవును.)

అచ్చ :- ఈ కాలములో మిత్రులవలె, బంధువులవలె వుండి ద్రోహము చేయుచుందురన్నమాట వాస్తవము. వీడు మిత్రద్రోహి, దొంగ. ఆయనను వెళ్లనంపు; నాపని నేను సాగిస్తానని, సాడీలు చెప్పవచ్చినాడు. వీనికి నేను చేసినమేలు ఎంతోవున్నది. నాకే ద్రోహము చేయనెంచుచున్నాడు. వీని ద్రోహము, వీనినే నాశనము చేయకపోదు. - కానీ, ఆ మహానీయుడెక్కడ పోవునో చూచుట మంచిదే. రేపే పోయి చూతును. కానీ. - (పోవును.)

( తెర వాలును. )

## తృతీయాంకము — ద్వితీయ రంగము.

"కొండ" కొండలో గుహ; గుహముందు అటవీవనము గన్పించును.

వీ :- (ప్రవేశించి) గోమాతలారా! రండి. (అని పిలుచును.)

[గోవులు వచ్చి నిలుచును. ఆబోతు గుహా ముఖద్వారమునకు అడ్డము నిలుచును.]

(వీరబ్రహ్మము తాటిచెట్టును చూచి) ఓ తాళవృక్షమా! నీవే పాపముచేసి, ఈ అడవిలో తాళవృక్షమై పుట్టితివి. చెప్పుము చూతము. - నీకొక రూపము, వాక్కు నొసంగెదను చెప్పుము. (అని కమండలోదకము చల్లును)

[పండితుని రూపమునవచ్చి నిలుచుకొని]

పండి :- దయామయా! స్థావర వర్గమున వృక్షమునై యున్న నాకు మానవత్వ మొసంగి, మాట్లాడు శక్తినిచ్చి పూర్వజన్మ స్మృతి నొసంగితివి. నిశ్చయము వక్కాణించెదను. - నేను పూర్వజన్మమున సంస్కృత విద్వాంసుడను; ఉపాధ్యాయుడను. - విద్వాంసుడనను గర్వముతో అడిగినవారికి చక్కని సమాధానమియ్యక, విద్యార్థులకు చక్కగా బోధింపక, జీతములతో భార్యాపిల్లల పోషించుకొంటూ, కడుపార తిని, కంటూర నిదురపోయి, పెద్ద. నేను పెద్దనని గర్వించి తిరిగిన పాపమునకు, పెద్ద తాటిచెట్టువై శాఖోపశాఖలు లేక, నాయనువారు లేక, ఒరుకొట్టి కష్టముల పెట్టినను చెప్పుకొన నోరులేక, వేయేడులు అరణ్యమున పడియుండుమని బ్రహ్మ విధించెను. దయామయ! నాకు పుణ్యము లభించుటెట్లు, ఉత్తమ జన్మ వచ్చుటెట్లని మొరపెట్టుకొనగ, నీ పత్రములయందు ఏ మహనీయుడుగాని హరికథా సద్గ్రంథముల వ్రాయునో, అప్పుడు నీకు ఉత్తమ జన్మ వచ్చునని తెల్పెను. తాము నా పత్రములకోసి కాలజ్ఞానము వ్రాయుచుంటిరి. తమ హస్తస్పర్శచే నా జన్మ తరించినది. నానుండి కల్లును తీసి వామాచారులు, పాపభూయిష్టులు త్రావుచుండిరి గాని, దైవనివేదనకు పనికిరాక పోయెను. నాకు పుణ్యమెట్లు లభించును తండ్రీ.

వీ :- ఉన్నది పుణ్యము. లేకపోలేదు. వామాచారులు, వామాచార

దేవతల కర్పించియే విక్రయించుచున్నారు త్రాగెడివారు, వారి కర్పించియే త్రాగుచున్నారు. ఆ వామాచార దేవతలే నీకు, ఈత చెట్టుకు పుణ్యము లభింపచేతురు. అటు చూడుము.

ఓ పెద్దమ్మా, ఓ కాళమ్మ, ఓ యల్లమ్మ, ఓ రుద్రకాళీ! ఒకరిటు రండి. – రా. ఊఁ. రా.

[వికార స్వరూపముతో, గజ్జలు కట్టుకొని, డమరుక మొకచేత పట్టుకొని వచ్చును.]

ఓ మాంకాళీ! తాటికల్లు, ఈతకల్లు, టెంకాయకల్లు త్రాగెదవా? కైపగునా? ఈ చెట్టుయి జన్మించిన వీరికి పుణ్యము గలదా?

కాళి – ఔను. ఈ చెట్లనుండి సుర ఉత్పన్నమగుచున్నది, వామాచారులు – వామాచార అధిష్టాన దేవతలకు చూపి, వామాచారులు త్రావుచున్నారు. వీటి పండ్లను తినుచున్నారు. వారు చేసిన పుణ్యము ఈ చెట్లకు లభించి, పాపపరిహారమై మానవత్వము సిద్ధించును.

వీ :- వివ్నావా. – ఇప్పుడు కైపులో ఉన్నావా.

కాళి .- ఔను.

వీ :- అట్లయిన శివతాండవము కొంతసేపు చేయుము చూతము. – [లోపల నుండి శబ్దములు పలుకును. శంఖనాదములు, ధవళ శంఖులు వినబడును. నృత్యము చేయును.]

డాం డడడాం డడడడ – డడడడ డడడాం.

(లోపల డాం. అని శబ్దము గలుగును. శివతాండవ మాడును. వాయిద్యములు మోగును.)

వీ :- ఆపుము. — [కాళి నమస్కరించిపోవును ]

కాళవృతమా! వింటివిగదా. ఇక పొమ్ము. — [పోవును.]

ఓ పూలమొక్కలారా! ఇటు రండి. (అని పిలుచును. వచ్చును.)

మీరీ అరణ్యమున పువ్వులు పూయుచు ఎన్నాళ్లుండినను పాప పరిహారము గాదు. అడవిని పూసిన పువ్వులు, దరిద్రుని యౌవ నము నిరర్థకములు మీరు పూసిన పువ్వులు దైవార్చనకు చేరవు. ఏ పుణ్యవతి శిరమున నలంకరించదు. దరిద్రుని యౌవ నము ఏ స్త్రీకి ఉపకరించదు. మీకెట్లు పుణ్యము లభించును. మీకొక శక్తినిచ్చెదను. మీరందరు పోయి, గరిమిరెడ్డి అచ్చమ్మ గారి పెరటిలో పుట్టుడు ఆయమ మిమ్ముల పోషించి, మీ పువ్వులతో దైవార్చన చేయును. మీరును, ఆమెయు తరింప గలరు. పొండు. (అని కమండలోదకము చల్లును పోవుదురు.)

[తాళవృక్షము వంగును. తాటాకుల కోసుకొని, గుహా ద్వా రము చెంతకు పోయి]

వృషభరాజా! గుహలో ప్రవేసింపనిమ్ము - నీదీ ఒక పుణ్యమే. కర్షకుల చేతిలో పడి, సేద్యము చేయుచు కష్టమందక ఆల మందలో కామ కేళీవిలాసములతో, హాయిగా కాలము నడుపు చున్నావు: నీకు అడ్డము లేదు నీవెవడవు?

[వృషభము యోగి రూపమున వెలువడి]

యోగి :- స్వామి, నేనొక సన్యాసిని. నిరంతరము భగవధ్యానము చేయువాడను. ఆశ్రమ నివాసిని. కామ మాపలేక, శిష్య రూపమున నా చెంతకు వచ్చిన స్త్రీల నందరిని భోగించితిని. ఆ దోషమున ఆబోతునై గడ్డితిని బ్రతుకవలసి వచ్చినది. దైవ ధ్యాన పుణ్యమున ఈ కామ సౌఖ్యము దొరికినది. దయా మయా! ఇకనైనా మంచిమార్గమున నడచునట్లు నన్నాశీర్వ దింపుడు. (అని నమస్కరించును)

వీ :- (ఆశీర్వదించి) నీవిక్కడ పవిత్రముండతగవు. నినుచూచి, అచ్చమ్మ భయపడును. వెనకకు పోయి దూరమున నుండుము. (పోవును.)

[వీరబ్రహ్మము గుహాయందు ప్రవేసించి, తాటాకులపై వ్రా యుచుండును. - అచ్చమ్మ వచ్చి, ఆవుల చూచి, గుహ సమీ

పించి వీరబ్రహ్మమును చూచి, నమస్కరించి చెంపలు వేసుకొని, ముందుకు వచ్చి నిలచి]

అచ్చ :- విరామకాలము కొరకై, అలకాపరియై యిక్కడ కూర్చున్నాడు మీకు దైవసమానులు. ఇంక అవుల కాయనియ్యను. ఇప్పుడు కట్టుచున్న యింటికి చుట్టూ ప్రహారి కట్టించి మీకి ఆశ్రమముగా నియమించెదను. - పాదములపై పడియైన, ఆ పనిని నెరవేర్చుకొని, జన్మ తరింపచేసుకొనెదను. (అని వెళ్లిపోవును.)

( తెర వాలును. )

## తృతీయాంకము — తృతీయ రంగము.

"నవాబు ఆస్థానము"

వేశ్య నాట్యము చేయుచుండును. నవాబు హుక్కా పీల్చుచు, అచ్చా, బౌతచ్చా. అని అనందపడుచుండును. — లోనుండి మహారాజా! అని పిలుపు వినబడును.

నవా :- మంత్రి వస్తువుండాడు. - నీకి చాలీయించి లోపల్కి పో.
[నాట్యకత్తె సలాంచేసి పోవును.]

మం :- సలాం, సలాం. (అని వంగి సలాంచేయును.)

నవా :- కూసుకో.

మం :- నవాబు గారికి ఒక సిన్నమాట, ఈ వూరిలో ఒక సాదు, అచ్చమ్మ ఇంట్లో చేరి సాలా కాలం అయింది అంట. అచ్చమ్మ కొడ్కుకి కండ్లు పోయినేటియ్ తెప్పి యించి, సూపు ఇచ్చి నాడంట. యిందువల్లో అంత ఫకీర్ వుండాడు అంటే మన్కు యట్ల వుండాలి. - పైకి మంజల్ మంటల్ వేస్సువుండాయి. మన్మ యిక్కడ్కి పిల్చి, సాధు కథ - తేల్చి యేయాలి. కొడ్కుల్ పైకి పోతే - మన్కు కిందీక్కి పోతాయ్ సూసి సూసి, విడ్వ కూడ్దు.

నవా :- మన్మా, ఏమి సేయాల్ అంటావు.

మం :- ఇక్కడిక్కి పిల్చి, ఏదో వక్తి పరీచ్చా పెడ్తామ్. - పరీచ్చా బల్ మయిందిగా వుండాల్సి వుంది. - వక్తి నాకి బుద్కి వచ్చియింది.

నవా :- ఏమి అది, సెబు సూస్సాం.

మం :- ఇందువులు దేవుడని మొక్కే గరడ సంబం తెప్పియించి. - నీళ్లు పోసి, దాన్కి వత్తి పెట్టి, - దీన్కి ముట్టియించమంటే సాదు బగిసీ తెల్సిపోదు. - అంతే.

నవా :- అచ్చా అచ్చా, బోవుత్ అచ్చా. ఏమి తెల్వి, ఏమి తెల్వి. తెల్విం అంటే నీది తెల్వి. (అని నవ్వుతూ యేబు వూపును.)

మం .- అరే, జవాన్ బుడ్డేఖా! (అని పిల్చును జవాన్ సలాములు కొట్టుకొంటూ వచ్చును.) - అరే నువ్వు పొయ్యి, గర్విరెడ్డి అచ్చమ్మ కాడవుండే సాదుకి సూసి, - నీకి నవాబు గారు పిల్చక రమ్మని సెప్పినాడు అని సెప్పి, పిల్చకరారా పోరా.

జవా :- సలాం సలాం. చిత్తం చిత్తం. (అని వెనుకకు పోవును.)

( తెర వాలును. )

## తృతీయాంకము — చతుర్థ రంగము.

"అచ్చమ్మ యిల్లు"

వీరబ్రహ్మము, బ్రహ్మనందరెడ్డి, అచ్చమ్మ కూరుచొనివుందురు.

వీ :- అమ్మా! నీ దొడ్డి ఆవరణములో ఇప్పటికి ఏ చెట్టు లేదుగదా. అచ్చట నీళ్లు చల్లమని చెప్పి, ఏ చెట్లు మొలచినను, పాదులు చేసి నీళ్లు పోయుచుండుము. ఆ స్థలమంతయు పూల చెట్లు మొలచి, పెరిగి పూలు పూయును. నిత్యము ఆ పుష్పాలతో దైవార్చన చేయుచుండుము. దానితో నీజన్మ తరించును.

అచ్చ :- స్వామీ! చెట్లను పెంచి, పూలనుకోసి, దేవుడని పటములకు పెట్టినంతనే ముక్తికి పోయెదరా. తెలియక చేయుచున్నారని కొందరందురు. దేవుడు మనలోనే వున్నాడని కొందరందురు. ఏది యెంతమట్టుకో నాకు బోధపడుటలేదు.

వీ :- అమ్మా! దేవుడున్నాడను నమ్మకముతో పటమునో, విగ్రహమునో పెట్టి, దీపము ముట్టించి, తాను వేసి పెంచిన చెట్ల నుండి పువ్వులనో, తులసినో కోసి, దేవునికి పెట్టి, ఏదో వారి కున్నది బెల్లమో, చక్కెరో, పాలో, పండో కొంచములో కొంచమైనా పెట్టి, నమస్కరించి - స్వామి, నిన్ను నమ్ముకొన్న నీ బిడ్డలము. మమ్మొక కంట చూచుచుండుమని చెప్పుకొను పుణ్యాంగనలకు, పుణ్యపురుషులకు మరు జన్మమున సకలము వనకూడును సర్వసంపదలు గలుగును. దైవసేవ ఏవిధమున చేసినవారికైనను లభ్యపడనిదేదీలేదు. నమ్మి ఆచరణలో నుంచుకొమ్మా.

ఆ॥ ఉన్నదన్నవారి కున్నది సర్వంబు
లేదటన్నవారి కేదిలేదు
నమ్ముకున్న సొమ్ము, నమ్మకుండిన దుమ్ము
వేదవాక్యమిదియె వెతకిచూడ.

(అంతలో జవాను వచ్చి, సలాముచేసి)

జ :- మాదీ నవాబు మీకి రమ్మన్ చెప్పినాడు. నాకీ వెంటన్ పిల్చక రమ్మన్నేడు. సలాం.

వీ :- అమ్మా! నీ కుమారునికి కన్నులు వచ్చినది ఊరందరికి తెలిసినది. అది విని నవాబుగారు నన్ను పరీక్షించి పరీక్షలో ఓడిపోయిన అవమానముచేసి సాగనంప తలచినాడు. పోయివచ్చెదను.

అచ్చ :- వారికి కండ్లు పోవుటకో కాళ్లు పోవుటకో వచ్చినది. అగ్గిని ముట్టిన వూరకుండునా. బొబ్బలు పోవును. - స్వామి! మతాంధులు మహమ్మదీయులు. అందులో ధన మదాంధులు. సైన్యబలము గలవారు.

పీ :- భయము లేదు. త్రిభువనముల పాలించు త్రిమూర్తులు కుడి భుజమునందే వున్నారు. - (పోవును.)

( తెర వాలును. )

## తృతీయాంకము — పంచమ రంగము.

"నవాబు ఆస్థానము"

పీరబ్రహ్మము ప్రవేశించును. - హుక్కా పీల్చుచున్న నవాబు కూచూ కోండి అని కుర్చీ చూపును. బ్రహ్మము కూర్చుండును. - గరుడ స్తంభములో నీళ్లుపోసి వత్తివేసియుందురు. - మంత్రి కడుపు కదిలించలేక కదిలించుచు -

సాదు సామి! మాదీ కోర్కె తీరిచి నవాబుగారు యిచ్చు బహుమతి తీసుకోవాలెనని నీకి సలాం సేస్తు వుండాము.

పీ :- మంత్రిగారు! మీరు కోరెడి కోరిక ముందే నాకు తెలియును. మా గృహములలో నూనెవేసి దీపము వెలిగించెదరు నవాబుగారి గృహములో, మంత్రుల యిండ్లలో నీళ్లుపోసి దీపముల వెలిగించు ఆచారమున్నదని తెలుసుకొనివున్నాను. - ఔను, యే యిండ్లలో యే మర్యాదగలదో అదేరీతిగా వర్తించవలయును. మీ కోర్కెప్రకారమే వెలిగింతును. ఈ మంచినీళ్ళ దీపము వెలుతురు చూచువారు మహనీయులుగా నుండవలయును. అన్నిమతముల నొకటిగాచూచు బుద్ధి వుండవలయును. సర్వజీవులయందు భూతదయ గలిగినవారుగా నుండవలయును. లేకున్న కండ్లుపోవుట నిశ్చయము. ముట్టించమన్న ముట్టించెదను ఏమండీ మంత్రిగారు! ముట్టించమందురా. పోయిన కండ్లను మళ్ళీ కావలయుననిన వచ్చుట కష్టము. ఏమందురు.

మం :- ముట్టియించు. దాన్కి తగిలీయించు. సాదు! ముట్టియించక నే యిన్ని పల్కుల్ పల్కితే ఫలం యేమివుంది కానీ. (భయం అభినయించి) అల్లా వుండాడు. కానీ, తగిలిపిచ్చు. దైటపడ్తావ్.

వీ :- మంత్రిగారు! అల్లాను బాగ తలచుకో.

(మంత్రి చేతులు రొమ్ముపై పెట్టుకొని, అల్లాను తలచుకొనుచుండును. - వీరబ్రహ్మము లేచిపోయి దీపము ముట్టించును. ఆ వెలుతురు చూచినతోడనే నవాబుకు, మంత్రికి కన్నులు కానరాకుండ పోవును )

నవా :- అరే మంతిరి నాకీ కండ్లు రెండు కానరావ్రరా సాదు సామ్కి అపశారం సేయమనిసెప్పి, గాడ్దెక సేసితివిగదురా. అరే, అల్లా అల్లా అరే మంతిరి. నీకీ గడ్డితినే గాడ్దె బుద్ధి గదురా. - నీకీ కండ్లు వుండాయ్.

మం :- నాకీ కండ్లు పోయినాయి. బుద్ధి కిందికి దిగిపోయింది

నవా :- నీకీ కండ్లు, సండ్లు రెండుపోవాలెరా. నీకీ నాల్కె కోయాల. కడ్పు చెక్కియించాల్రా. నాకీ సెప్పి ఎంతపని చేయించితివిరా కొడ్కు. కండ్లు రానీ చెప్త. సెప్పల్‌కీ తినిపిస్తా

సాదు సామి! నీది అల్లాకు సమానం. ఏదో గడ్డితిని సేసినాము. కండ్లు తెప్పియించు. కాల్లు పడ్తామ్ సలాం జేస్సాం అల్లా సామి

వీ :- అందియుండిన జుట్టు పట్టుకొని వుందురు అందలేదు కాబట్టి కాళ్లు పట్టుకొన సిద్ధముగానున్నారు మంత్రిగారు! మంచి నీళ్ళ దీపములోగల మహాత్తు తెలిసినదా.

మం :- సాదు సామి! తినరాంది తిన్నేం - దయదల్చు. కడ్పునిండా పిల్లల్కి వుండార్, నాకీ గుడ్డిదైతే సచ్చిపోతాయ్. - సలాం సలాం

వీ :- నవాబు, హిందూ ముసల్‌మానులను భేదములేక చూచెదనని వకటి, హిందూదేవాలయముల పడగొట్టి కోటగోడలకు ఉపయోగించనని మరొకటి, సాధువుల సన్యాసుల బ్రాహ్మణుల బాధించనని ఇంకొకటి, ప్రమాణముచేసిన కన్నులు వచ్చును. ఈలాటివి చేసిన తప్పక మళ్ళీ కండ్లు పోవును. ఏమనెదవు.

నవా :- కన్నుల్ తెప్పించు, సెబుతాన్.

పీ :- అట్లయిన నేను పోయెదను. జేయ్ భగవాన్.

నవా :- సామి సామి, వద్దు వద్దు. అల్లాతోడు. - అట్లనే సేస్తాన్. యీన్కి మాటల్ బుఱ్ఱలోకి పంపన్. (అని సలాంమీద సలాం చేయును.)

పీ :- (కమండలోదకము చల్లును. కన్నులు వచ్చును.)

నవా :- సలాం సలాం. అల్లాకు నీకీ భేదంలేదు. మడ్డివాని గడ్డితినే కూతల్ యిని సేసినాను. యింక సేయన్.

అరే కొడ్కు, నీకీ యింక కండ్లు సండ్లు రాలేదు. అరే జవాన్! వీన్కి నాల్కకోసి, కడుపుసెక్కి, కారంపొడ్కి సల్లు. పో. బుద్కిలేని ముండాకొడ్కు, ముల్లా మల్లా సాడీల్కి సెబుతాడ్. పో.

[జవానువచ్చి పట్టుకొనును. మంత్రి జోబీలో డబ్బుతీసి నవాబుకు కానరాకుండ జవాన్‌చేతిలో పెట్టును. గట్టిగా లాగకుండా చేయిపట్టుకొని, రా. రమ్మంటూ వుండును.]

మం :- నవాబుగార్కి సలాముల్ సలాముల్. బుద్ధి కుదిరింది. వద్దు వద్దు. మీది కాల్లకాడ మాకీ వుంటాది. సాదు సామి, ఇంగ సేయన్. మాకీ దయాసూడు. కడుపునిండ్కా పిల్లలుండాయ్.

పీ :- మంత్రి! నవాబు దగ్గర సాడీలు చెప్పి, హిందువుల బాధించు చున్నావు. గ్రామమంతా తల్లిలేని పిల్లలవలె తల్లడిల్లుచున్నారు. అట్లు చేయనని ప్రమాణము చేసెదవా?

మం :- అల్లా తోడు. పిల్లల్కి తోడు. ఇంక అట్లసేయన్. సామి దయా సూడు. - పిల్లల్కి చూడకుంటే వుండలేన్. అరే అల్లా.

పీ :- అట్లయిన గోవిందో హరి అని అయిదుమార్లనుము. కండ్లు వచ్చును.

మం :- అల్లా అల్లా అని పదిమార్లు సెప్తా.

వీ :- అల్లా అన్నను గోవిందా యన్నను ఒకటే. భాష వేరు, దైవ మొకడే. మతములు వేరు, మనుషులొకటే. కులములు వేరు, మానవులొకటే. చేయుచున్న వృత్తులలో ఉత్తమ, మధ్యమ, అధమ, అధమాధమముల వల్ల కులతత్వ మేనాడో ఏర్పడినది. మతములు మతకర్తల భావ విభేదములవల్ల కలిగినవి. ఒక మత మంతరించి, మరొక మతము కాలానుగుణ్యముగ వచ్చుచునే వున్నది. ఒకరి రాజ్యమంతరించి, మరొకరి రాజ్యము వచ్చుచునే ఉన్నది. వారివారి మనస్సుకు నచ్చిన మతముల మానవులు పుచ్చుకొనుచునే వున్నారు. - మతద్వేషముల పెంచుకొని మానవుల హింసించుచు, పాపముగట్టుకొని, పశు, పక్షి, క్రిమి కీటకాదులలో జన్మించుచునే వున్నారు. అన్ని మతములకు దేవుడొక్కడే. ఏ పేరున పిలిచినను పలుకును. మతపిచ్చి వదలి పిలువుము.

మం :- పిల్సాం‌తాప్ - నవాబుగారు, ఇందూ దేవ్నిక. (అని యేడ్చును.)

నవా :- అరే, పిల్వారా. - సెప్పినంద్కు, సేసినంద్కు అనారా అను.

మం :- ఏమని. (యేడ్చును.)

వీ :- గోవిందో హారి అని అను.

మం :- నీవుగాదు. (నవాబు అనవలెనని చేతచూపును.)

వీ :- చచ్చునపుడు కూడా గోవిందా అనకూడదని వీరి మతము. మతద్వేషముతో మసియైపోయెదరు.

నవా :- గోవిందో హారి - అనారా.

మం :- గోవిందోహారి (ముందుకు నడచి) గోవిందో హారి, (కన్నులు తడివి చూచుకొని) మస్త్ మస్త్ గా వుండాయ్. గోవిందో హారి. దగ్గెదగ్గె కానవస్సాయ్. గోవిందోహారి. బట్టబయల్ బట్టబయల్ అంతా. కింద్కి మింద్కి బట్టతీసి సూసినట్లయింది.

ఎంత బాగవుంది. సలాం సలాం. సామికి సలాం. నవాబుకీ సలాం.

పీ :- మంత్రిగారు! మంచినీళ్ళ దీపము ఏమిచేసినది తెలిసినదా. - ఇక్లైన్నటికీ సేయకుము.

మం :- గంగఱపల్లేది గాడుపట్టి హాలాయించింది. ముచ్చదెబ్బల్ తిని బుద్ధి వచ్చియింది. యింక ఆట్లసేయఱ. సలాం సలాం.

నవా :- అరే మంతిరీ! వల్లీ గడ్డితినకుండా సామీకి కానికల్ సలాముల్ సేసి యిచ్చి, పల్లకీలో కూసోపెట్టి, మెరువన్కి చేసి, యిడిసీపెట్టి రారా. మల్ల తప్పిదం సేసినావా నీకీ కడ్పుకీ కోయిస్సాం. సలాం సామి, పోయిరా. హెన్నటీకి యీని కూతల్ యిని సోముల్ కీ అపకారం సేయం, సలాం. - మాకీ ఉపదేశం యిచ్చి దయ దల్చు.

పీ :- ఈ రాత్రికే నీకుపదేశమిచ్చెదను. నాకొరకై వేచియుండుము.

నవా :- సిత్తం సిత్తం. (అని వంగి సలాంచేయును.)
(మంత్రిని చూచి) అరే గోవిందాకీ సెబుకుంటాపోరా.

మం :- (కడుపు అల్లాడేటట్లు గోవిందో హారి అంటూ పోవును.)

( తెర వాలును. )

తృతీయాంకము — సమాప్తము.

---

## చతుర్థాంకము — ప్రథమ రంగము.

" గరిమిరెడ్డి అచ్చమ్మ గృహము. "

అచ్చమ్మ, బ్రహ్మానందరెడ్డి, వీరబ్రహ్మముగారు ప్రవేశింతురు.

అచ్చ :- స్వామి! మిమ్ముచూడక, మీ పలుకులు వినక ఎట్లుండగలము. దయామయా! తమదయతో సందేహానివర్తియై, క్రమబద్ధమై బుద్ధి కుదిరెను. ధన్యులమైతిమి. నా కుమారుడు చచ్చినవాడు

బ్రతికినటాయెను. మీ ఋణమెట్లు తీర్చుకొనగలము. తమ దరిశనభాగ్యమెప్పుడు?

వీ :- అమ్మా! నేనొచ్చిన కార్యమైపోయినది నా నివాస స్థలము రమ్మనుచున్నది. ఈ స్థలము పొమ్మనుచున్నది. నిద్ర, నీళ్ళ ఋణము ఎచ్చట ఎంతకాలమో అంతే వుండనిచ్చును తల్లీ! నేను చేయవలసిన కార్యములు మెండుగా నున్నవి. చేయక తప్పదు. నా నివాసస్థలము కొలది కాలముననే తెలియును అక్కడికి రండు. పోయివత్తును.

[అచ్చమ్మ, బ్రహ్మానందరెడ్డి నమస్కరింతురు.]

వీ :- మోక్షఫల ప్రాప్తిరస్తు. (అని పోవును.)

[అచ్చమ్మ, బ్రహ్మానందరెడ్డి "స్వామి!" అని దుఃఖంతురు.]

( తెర వాలును. )

## చతుర్థాంకము — ద్వితీయ రంగము.

" ఆచారి శివకోటయ్య గృహము . "

సాధువు :- మాతా భిక్షాందేహి. (శంఖు పట్టును.)

[గోవిందమ్మ పళ్ళెముతో భిక్ష తెచ్చును]

సాధు :- కన్యకామణి! నీ పుణ్యముపండినది. నిత్యము నీ స్వప్నమున గానవచ్చు సిద్ధపురుషుడు రాత్రికి నీ చెంతచేరును.

[అను నప్పటికి కోటయ్య, శివమ్మ వత్తురు.]

శివ :- ఎవరయ్యా ఆయన. ఏవిధంగా వస్తారు? ఎందుకు?

సాధు :- నీ బిడ్డను పెండ్లాడుటకు. అమ్మా! నీ బిడ్డ మహా పుణ్యురాలు. ఆ జగన్మాత వరపుత్రిక. కాబోవు అల్లుడు సిద్ధపురుషుడు. ప్రసిద్ధ పురుషుడు. వారి అనుగ్రహమున మీ భార్యాభర్తలుకూడ తరింపగలరు.

కోట :- కాదయ్యా. కలలుగంటూవా, కలవరపోతావా. విపరీతముగా చెప్పుచున్నావే.

సాధు :- లేదు నాయనా. నీ పుత్రికనే అడుగుము. నిత్యము వారు దరిశనమిచ్చుచున్నారో లేదో అడుగుము. - వారి ఆలింగన సౌఖ్యము పొందుచున్నదో లేదో అడుగుము. - ఎప్పుడు ప్రొద్దు గ్రుంకునా, ఎప్పుడు వారివడిలో వ్రాలుదునా అను కామాతురత్వమున్నదో లేదో అడుగుము. అమ్మాయి సిగ్గు పడకుము, నాయట్టి వృద్ధసాధువులకు అన్నపూర్ణవై బిక్షనొసంగి, క్షుద్బాధ దీర్చి, మా యాశీస్సుల పొందుము. ఆ సిద్ధపురుషునికి ఇల్లాలివై, మదనతాపమార్చి, సుపుత్ర పుత్రికల గని, జగద్విఖ్యాతి గడించి, ఆచంద్రార్కముగ గోవిందమ్మ యను నామధేయము నిల్పుకొని, వారి అనుగ్రహము సంపాదించుకొనుము. ఆ జగన్మాత మాయా ప్రపంచమును గల్పించి, సకల జీవులకు మాతయై పోషించుచున్నది. కళత్రరూపమై పురుషుని సురత సుఖాంబోధి తరంగములలో నుయ్యాలలూపుచున్నది పుత్రికా రూపమై కన్యాదానఫలము నొసంగుచున్నది. ఆ జగజ్జనని మాయను యోగులు, భోగులు, విరాగులు, త్యాగులు, జోగులు దాటుటకు కష్టమని, కుటుంబాశ్రమమందే నిలువదలచినారు. కుటుంబాశ్రమమునకు తనకు తగిన యిల్లాలివని నిన్ను వారు వివాహమాడ నిశ్చయించుకున్నారు. కన్యకాశిరోమణి! ఈ రాత్రికే కల్యాణము, ఈ రాత్రికే గర్భాదానము. (గోవిందమ్మ చిరునగవుతో తల వంచుకొనును) కన్యకామణి! సిగ్గు పడకుము. శుభ ముహూర్తమీనాడే. నీ రొట్టెవిరిగి నేతిలో పడినది. రేపే ఈ గ్రామమున వారు ప్రవేసించి నీకు దరిశన మొసంగుదురు. నీ పుణ్యము పండినది. బిక్ష వేయుము. (అని పాత్రపట్టును. గోవిందమ్మ బిక్ష వేయును.) కల్యాణ ప్రాప్తిరస్తు.

కోట :- కాదయ్యా! సాదుగాళ్లకు, సన్యాసుల కివ్వడానికి చేతగాని వాడననుకున్నావా. మహాపురుషునిలాగా చెప్పుచున్నావే.

వాడెంతటివాడో చూస్తాను. శాని మాయలు, మంత్రాలు
ఇక్కడ సాగవు. నేను అంతటివాడనే.

సాధు :- అయ్యా ఆచ్చారిగారు! వారి మహానుహిమ చూచినగాని
తెలియదు. విను. -

సీ॥ గట్టు బంగారంబు మట్టిగా చేయును
మట్టిని బంగారు గట్టుచేయు,
మోద్దుల బ్రతికించి పువ్వుల పూయించు
మతిహీను దీవించి మాన్యుచేయు,
రాతిబొమ్మలతోడ రాగాలు పాడించు
పశువుల బిల్చి శాకుశలమడుగు,
కోపానలంబున కొండల మసిచేయు
కనులిచ్చి అంధుల కరుణజూచు.

తే॥ అట్టి మహనీయమూర్తి నీకల్లుడైన
మిన్నుముట్టవె పుత్రిక వన్నెగనదె
పుణ్యపురుషుండు నీకన్న భువినిగలదె
వెనుకముందుకు చూడక పెండ్లినడుపు.

అయ్యా! నీయట్టివారు పదివేవురేకమైనను, కాగల కార్యము
కాకమానదు. బ్రహ్మ వ్రాతను కాదనుటకు - నీ తరమా,
నా తరమా. (అని పోవును.)

కోట :- కానీ చూతము. పో (అని మీసము దిద్దును.)

శివ :- ఇదేమమ్మా, వింతగా నున్నదే. ఇది నిజమే ననెదవా?

గోవి :- (సిగ్గుతో) ఔను. వారు, వారము దినములుగా నిత్యము
నా చెంతకువచ్చి, నన్ను వివాహమాడెదనని. పుణ్యమార్గము
చూపెదనని, ఈ రాత్రికే మంగళసూత్రము ఆ త్రిదేవుల
యదుట కట్టెదనని నా స్వప్నమున చెప్పుచున్నది నిజమే ముం
దెట్లు జరుగునో తెలియదు. వారే నాకు భర్త. వారినికాదని
అన్యుల వివాహమాడను. దైవసాక్షిగా వారే నా భర్త.

కోట :- ఏమే, కూతురికి ముదిరింది. ఆ మాయదారి సన్యాసి నా యాలు స్వప్నములో గన్పడడము, ముద్దుల ముచ్చట్లు నడుపడము, అమ్మాయి సావిత్రిలాగ వరించడము, ఈ ముసలి సాదుగాడు ముందుగా వచ్చి చెప్పడము, ఆ దివ్యపురుషుడు రేపు యిక్కడికే దిగడము అరెరే, బాగుంది బాగుంది.

ఏమే, నాకు మంత్రాలువస్తాయి అనుకో. ద్రష్టి తగిలిన దంటే సాంబ్రాణి మంత్రించిస్తా. దయ్యాలు, పిశాచాలు పట్టినాయంటే రతేసి మంత్రిస్తా. పోతే పోయినట్లు, పోకుంటే పోనట్లు. ఆ దయ్యాలు దొంగవే. ఈ మంత్రము అంతేననుకో. దాటు వచ్చిందంటే ముగ్గేసి దాటిస్తా. పీడ వచ్చిందంటే ఆ చెట్టుకు ఈ చెట్టుకు తిరగమంట గాని, కలలోవచ్చి కడుపుచేసే నాయాళ్లకు యంత్రాలు, మంత్రాలు మా నాన్న చెప్పలేదు. నేను వేయ లేను. ఒకప్పుడు ఒకాయమను మోహిని గాలి తొక్కుతుండేది. ఆయమ మొగుణ్ణి పట్టుకొని యేడుస్తు కలలో నన్ను మోహిని గాలి తొక్కుతూవుంది. తప్పక కడుపగుతాను. ఆ పాడుదయ్యం తొక్కకుండ నన్నెట్లయినా కాపాడుకొమ్మని మొగుని కాళ్ళమీద పడి యేడ్చేది. అతగాడు నాతో చెప్పి, యంత్రమేయమన్నాడు. వీరభద్ర యంత్రం వేసినానుగాని, కడుపయ్యేది మాత్రము తప్పలేదు. - మళ్ళీ దయ్యం కథ బైట పడింది. అట్ల కలలో కడుపుచేసి పోతే, గతేమే. నా మంత్రాలు సాగేటట్లులేదే. - భేతాళుడు పట్టినట్లు ఈ సాదు గాడు పట్టెనే. ఏం చేసేది.

ఏమే, రూపం పాపమన్నారు. కచ కుచముల బిట్టు బాగావుండి, ముఖంలో కొంచం చంద్రకళవుంటే, ఎగజూచే నాయాళ్లు, దిగజూచే నాయాళ్లు సందులేదు. సందేల. దిష్టి తీసివేయవలసిందే. నడుము సొట్ట, కాళ్లు సొట్ట, మూతి సొట్ట వుంటే నాయాళ్లు చూడరుతెమ్మనుకుంటే, అంతకంటె సొట్ట నాయాళ్లు వుంటారు. ఈమె అపరూపవతియై మంచి బుద్ధి

వున్నందుకు సాదుగాడు పట్టి సాధిస్తా వున్నాడే. అయ్యో రామ రామ.

గోవి :- నాన్నా! చింతచేయవద్దు. నా మాట వాస్తవము. వారు సిద్ధ పురుషులు. వారిని సామాన్యులుగా భావింపకుము. నీ వియ్యాక తప్పదు. నేను చేసుకొనక తప్పదు. దైవేచ్ఛయని వూరకుండుము. కాగల కార్యము కాక మానదు.

కోట :- ఏమే, కూతుర్ని బుద్ధి మార్చేసినాడు మంచి మంత్రాల మారిగాడుగా వున్నాడు. ఈ రాత్రి బాగ మేలుకొనివుండి, వాని డొక్క చీల్చి వేయాలి. ఆ వాకిటికాడ నీవుండు. నేనీ వాకిట దగ్గరవుంటా. ఎట్లు వస్తాడో చూస్తాము. నేను వెతకి వెతకి మంచిపిల్లవాణ్ణి తెచ్చి చూస్తువురా అమ్మా అంటే వీడు మా యింటాయనకాదని మూలన కూర్చుంటుంది ఇప్పుడీ సన్యాసి గాణ్ణి వరించిందంట. చూస్తాము ఎట్లొస్తాడో కానీ పా. పొద్దుగూకనీ

శివ :- ఏమమ్మా సన్యాసి అంటున్నారే - నిన్ను, నీ పిల్లల పోషింప గలడా. ఎక్కడి మాట. బాగా ఆలోచించుకొనుము

గోవి :- అమ్మా, దైవసమానులు వారు నన్ను పోషింపలేరా. వారి దివ్యశక్తి తెలియకనుచున్నారు. ముందు మీకే తెలియగలదు.

కోట :- తెలుస్తుంది తెలుస్తుంది. రాత్రికి బాగా తెలుస్తుంది. - రావే లోపలికి. (పోవుదురు.)

( తెర వాలును. )

## చతుర్థాంకము — తృతీయ రంగము.

" కోటయ్యాచారి గృహము. "

గోవిందమ్మ మంచముపై పరుండియుండును. కోటయ్యాచారి ఒక కట్టె తీసుకొని అటూ యిటూ తిరుగుతూ —

కోట :- ఏమె, ఆ వాకిటిదగ్గర జాగ్రితగవుండు. ఈ వాకిలి బాగా బిగించినానులే. ఎట్లొస్తాడో, ఎట్ల పెండ్లి అవుతుందో చూస్తాను. నిద్రిపోయేవు భద్రిము. ఆ అక్షింతల తట్ట యిట్ల పట్టుకరా. (అని పుస్తకము తిరగతిప్పుతూ వుండును. - శివమ్మ తట్ట తెచ్చును. - శివమ్మను చూచి ఆచారి) దానికి మంత్రిం దీనికి మంత్రిం. దానికి యంత్రిం దీనికి యంత్రిం అని అన్నిటకు వుందిగాని, స్వప్నాల్లో కనవొచ్చె సన్నాసి నాయాళ్ళకు మంత్రిం అనిగాని, యంత్రిం అనిగాని లేదు. - అక్షింతలు ఇటు తే. (అవి తీసుకొని, మంచమునకు తూర్పుమండి) కం కం కం వీరభద్రియ ప్రాగ్దిశ దిగ్బంధయామి. గం గం గం రౌద్రరూపాయ ఆగ్నేయదిశ దిగ్బంధయామి. చం చం చం బాహుబలపరాక్రమాయ దక్షిణ్యాం దిగ్బంధయామి. జం జం జం రుద్రాత్మజాయ నైరుత్యాం దిగ్బంధయామి. (పశ్చిమము, వాయువ్యమున, ఉత్తరమున, ఈశాన్యమున ఎనిమిది దిశల అక్షింతలు వేసి - నిదానించి) పైనుంచి రాకూడదు. క్రింది నుంచి రాకూడదు. అక్కడ చేయవలసినదే. పం పం పం ప్రళయ కాల రుద్రస్వరూపాయ అంతరిక్షం దిగ్బంధయామి భం మం యం రం లం వం శషసహ భూమ్యాం దిగ్బంధయామి జార చోర పిశాచ యక్ష రాక్షసుల రానీయకుండ, చేరకుండ కాపాడు స్వామి. అర రే, సాదువుల సన్యాసుల చెప్పక పోయితినే - సాధువులు సన్యాసులు ఇక్కడచేరకుండ ఇక్కడరాకుండ చూడు స్వామి. వాళ్ళతోనే ఇప్పుడొచ్చివుండేది. (అని కూర్చొనును. ఆవలించును) ఓసి నీ తలగాల నిద్రి తోసుకొస్తావే. ఈ ప్రొద్దుటిది, రేపటిది రేపే చూసుకొందువు పో. ఈనాడు కుదరదు పో. పొమ్మంటే పోవాల. రమ్మంటే రావాల. జై వీరభద్రా. (అని నోరు తెరచుకొని గురక పెట్టును.)

గోవి :- జగన్మాతలారా! ప్రణామములు. మీ పుత్రికరీతి నన్ను కాపాడుడు.

**కోట :-** (ఉలిక్కిపడి లేచి, విని) జగన్మాతలారా! వాళ్లుకూడా వచ్చినారా. ఎక్కడ గానమే. అంతా అవుతావున్నట్లే వున్నది. విందువురా. (తల్లి వచ్చి వినును.)

**గోవి :-** అబ్బా! ఈ మేళతాళములు, ఈ వైభవము మానవాతీతమైనది. ఇది ఇంద్రలోకమా, ఆ నృత్యాంగన రంభయా. ఏమి నృత్యము. ఏమి రూపము.

[ఆచారి - వినమని భార్యకు సైగ చేయును.]

స్వామీ! తెల్లవారి నాకు మీరు దర్శనమిచ్చి, నేను మీ భార్యనని నిరూపించుకొనకుండిన ఈ తాళి యేమగునో, నేనేమగుదునో గమనించుడు. - వచ్చెదరా, తమ ప్రభావముతో నా తల్లిదండ్రుల నప్పించి తమ ధర్మపత్నిగా అగ్నిసాక్షిగా స్వీకరించెదరా.

**కోట :-** ఏమే, తాళికూడ కట్టినట్లే వున్నదే. మాయదారినాయాలు మటుమాయం చేసినాడే. కానీ.

**గోవి :-** స్వామీ! నిన్నువిడచి అరక్షణము బ్రతుకలేను. విడచిపోయెదరా. తెల్లవారువేళ ఆయినదా.

**కోట :-** ఏమే, అన్నిపనులు అయినట్లే అయింది. ఆ సాదుగాని మాట నిజంగానే వున్నదే. కొంచము అట్లచూడు.

**శివ :-** (గోవిందమ్మ కప్పుకొనివున్న కాళ్లపై దుప్పటి తీసి చూచి) పసుపు పూసినారండీ. (కప్పుకున్నగుడ్డను తీసిచూచి) అయ్యో అయ్యో, చూడండి బుగ్గలపై మసిబొట్లు. సర్వాభరణాలు. అయ్యో, తాళికూడ కట్టినాడండీ. చేతికంకణము విప్పలేదండీ. పూలహారము మెడలో వున్నదండీ. ఉదయము ఆ సాదు చెప్పినది నిజమేనండీ ఆయనెంతటివాడో యేమో. ఆయన ధనికుడు గాకున్న ఇన్ని ఆభరణాలెట్లు పెట్టగలరండీ.

**కోట :-** (ఇట్ల, అట్ల పరికించి చూచి) అమ్మాయి కలవరించినది చూస్తే

రెండు ముహూర్తాలు వకేసారి అయినట్లే. ఎంతపని చేసినాడు నాయాలు. అష్టదిగ్బంధన ఆరిస్సచ్చింది. లేపు అడుగుదాము.

శివ :- అమ్మా గోవిందా, లే. (అని తట్టును.)

గోవి :- (లేచి, తనను తాను చూచుకొని సిగ్గుపడును.)

శివ :- ఏమమ్మా జరిగినదంతా నిజమేనా?

గోవి :- ఔనమ్మా. కండ్లార చూచుచున్నారుగద. మీ అల్లుడు మహనీయుడు, సిద్ధపురుషుడు, భగవత్స్వరూపుడు. నా భాగ్యము మీ భాగ్యము పండినట్లే. [ఆచారి భార్యకు సైగచేయును.]

శివ :- అమ్మా, ఇంకా జరుగవలసినవి జరిగినవా. నిజము చెప్పుము.

గోవి :- (సిగ్గుపడును)

శివ - సిగ్గుపడకమ్మా. తల్లితో చెప్పుటకు సిగ్గా. చెప్పు తల్లీ.

గోవి :- ఔను. నా పెండ్లి వైభవము చెప్పుటకు అలవిగాదు. అప్సరసలే నృత్యముచేయుచుండిరి. ఆ జగదారాధ్యులగు త్రిమూర్తులు, త్రిదేవులు మమ్మాశీర్వదించిరి సర్వకార్యములు దేవాంగనలే నడుపుచుండిరి - ఆ శయనమందిరాలంకారము మానవలోకమున వుండదమ్మా. (సిగ్గు నభినయించును.) వారు తెల్లవారి మనవూరికి వచ్చెదనన్నారు. మీరుపోయి పిలుచుకరండి అమ్మా.

కోట :- ఏమే, కలలోనే కడుచేసి లోకులతో మానం తీయించేటట్లున్నాడు. దీనికెక్కడ దాపురించెనే యీ భూతం.

గోవి :- నాన్నా! అట్లనకు. వారు దివ్యపురుషులు. వారు నాకు భర్తయై, మీకు అల్లుడగుటకన్నా వేరొక పుణ్యములేదు.

కోట :- నీది పుణ్యమేనా?

గోవి :- పుణ్యములో పుణ్యము.

కోట :- రేపు వస్తానన్నాడా?

గోవి :- తప్పకవస్తాడు నా-న్నా.

కోట :- రానీ నాయాలు. కథ ముగిస్తా.

గోవి :- నాన్నా! వారి మహిమ తెలియక తూలనాడి, తప్పక మీదికి తెచ్చుకొని చింతించెదగు.

కోట :- కానీ చూతము. రావే రేపు తేల్చుకుందాము.

(అని పోవును.)

( తెర వాలును. )

## చతుర్థాంకము — చతుర్థ రంగము.

"దేవాలయము" - అరుగుపై వీరబ్రహ్మము కూరుచొని జప మాల త్రిప్పుచుండును. ఒక యువకుని అయిదారుమంది పట్టి ఎత్తు కొని పోవుచుందురు.

వీ :- నాయనా, బ్రతికినవాని ఎత్తుకొని పోయెదరెందుకు? బ్రతికిన వాసిని కాటికెత్తుకపోవు వాడుకా.

అందులో వకడు :- లేదయ్యా, రాత్రి చనిపోయినాడు.

(అని పోపోదురు.)

వీ :- కొంచము ఆపండి నాయనా. దింపండి చూతము.

అందులో వకడు :- దింపరా చూతాము.

మరొకడు :- దింపుడుకల్లము కాదుగదరా.

వీ :- బ్రతికినవానికి దింపుడుకల్ల మెక్కడున్నది నాయనా. దింపుడు.

[దింపుదురు. కమండలోదకము చల్లును ]

చచ్చినవాడు :- (లేచి కూరుచొని - వీరబ్రహ్మము చుట్టు తిరిగి, వంగి చేతులు జోడించి) దయామయా! నన్నా యమలోక మున యమదూతల నుండి విడిపించిన మహనీయులు మీరు.

జీవితాంతము మీకు శిష్యుడనై, పాపముల జోలికి పోక బ్రతికెదను. భూతదయ లేక జంతువుల హింసించుచు, జంతు వధ చేసి మాంసము విక్రయించి జీవించు చుంటిని. యిక నా జన్మలో జంతువధ చేయను. మానవుల, జంతువుల హింసింపను. మీ శిష్యుడనై జీవింతును. నన్ననుగ్రహింపుడు. (అని నమస్కరించును.)

వీ :- దీర్ఘాయురస్తు. జ్ఞానాభివృద్ధిరస్తు. పొమ్ము నాయనా. - (అని అరుగుపై కూరుచొనును.)

[ అందరూ నమస్కరించి పోదురు. ]

( తెర వాలును. )

## చతుర్థాంకము — పంచమ రంగము.

" ఆచారి శివకోటయ్య గృహము. "

(కోటయ్యాచారి అయిదారుమందిని పిలుచుకొని లోపలనుంచి వచ్చి)

కోట :- ఏమండాయ్! ఇదంతా కకనట్టు. ఈ గోకర్ణ విద్యల కేమి లే. ఇట్లాటివి వేనకువేలు నాకు వచ్చు. ఒరే, చచ్చినవాడు బ్రతికితే, బ్రతికినవాడు చావవలయునుగదా. మీరు ఒకని చచ్చినాడని మోసుకొనిపోయి, చచ్చినాడని యేడ్వండి. యేమి చెప్పునో చూతము. అప్పుడు ఈతగాని బైసి బైటపడుతుంది.

[అలాగేనయ్యా అని వారట్లు చేయుదురు.]

ఒరేయ్, గుండె ఆగిపోయినదని ఏడ్వండి ఆగిత్తైము చేయండి. పొండి. (వారు సరేనన్నట్లు తలలులూపి వెళ్ళిపోవుదురు.)

ఇప్పుడు తెలిసేది ఈతగాని మళయాల మంత్రాలు, గోకర్ణ విద్యలు, యక్షిణీ ప్రభావాలు. బ్రతికినవాడు చావవలయునన్న సామాన్యమా. సాదుగాని బైసి బైటపడుతుంది. పిట్ట పడుతుంది.

వీ :- (లోనుండి ఆకాశవాణి పలికినరీతిగా) ఎన్నిచేసినా నేను అల్లునిగాక, నీవు మామవుగాక, నీకూతురు నా భార్యగాక తప్పదు ఇది విధి విధానము.

కోట :- ఆఁ ఆఁ! ఈ నాయాలు ఇంట బైట అంతటా వున్నాడే. దీనికి తగిన మంత్రిమేమీలేదే. ఏమి చేసేది.

వీ :- అయిదు నిమిషములలో నా మంత్రిము పారుతుంది చూడు.

కోట :- చూస్తా చూస్తా ఇంతటితో నీపని కాస్తా అయిపోతుందిలే.

వీ :- సగమయిపోయింది. అ సగము ఇప్పుడై పోతుంది. వస్తావు నా చెంతకే వస్తావు.

కోట :- వస్తానా, వస్తా. ఈ కోటయ్యాచారి అంటే యేమనుకొన్నావో. అంత సుఃభోపాయము కాదోయ్. ఈ కోటయ్యను జయించాలంటే, మీ తాతరావాలె. చూస్తా. (అని మీసము దిద్దుకుంటు పోవుచు) ఈ కలలో కడుపుచేసే మంత్రం వస్తే. కన్నుపోకుండా, కాటుక చెడకుండా కాగల కార్యము చేసుకొని పోతూవుండవచ్చు. కొట్లాట లేదు, కాట్లాట లేదు. న సామిరంగ. అదివస్తే కోరికంతా తీరినట్లే. నిష్క్రమించును.)

( తెర వాలును. )

చతుర్థాంకము — సమాప్తము.

---

## పంచమాంకము — ప్రథమ రంగము.

వీరబ్రహ్మము అరుగుపై కూర్చొనివుండును. ప్రజలు చుట్టు మూగి వుందురు.

[కొందరు మనుషులు చేతులపై ఒకని ఎత్తుకొనివచ్చి, అక్కడ దించి]

స్వామీ! యీ పిల్లవాడు ఉన్నట్లుండి కను మూసినాడు. బ్రతికించి పుణ్యము గట్టుకోండి. (అని దండాలు పెట్టుదురు.)

వీ :- నాయనా, బ్రతికే తెరవున్నవాడు బ్రతుకును. పూర్తి చచ్చిన వాడు బ్రతుకగలడా. చచ్చియే పోవును. ఈతడు చచ్చినాడు. మీ పని మీరు చేయబోండి.

[వారందరు హేళనగా - బాగ తెలుసుకున్నావయ్యా. వీడు బ్రతుకడా. చూడు బ్రతికిస్తాము. (అని పోయి) ఒరేయ్! మీది గుడ్డనుతీసి లేయరా. (అని అందురు. లేయడు. ఊపి లేపుదురు. పరీశీలింతురు. నిర్విణ్ణులయి, వకరినొకరు చూచుకొందురు.)]

అందులో వకడు :- స్వామీ! బ్రతికినవాడిని తెచ్చి, చచ్చినాడని మిమ్ము అవమానపెట్ట చూచినాము. బ్రతికినవాడు చచ్చినాడు. దయతో బ్రతికించండి స్వామి. (అని దండాలు పెట్టుదురు.)

[ఈ వార్త విని, చచ్చినవాని తండ్రియగు పాపిరెడ్డి వచ్చి]

పాపి :- మీకిది చెప్పినవాడెవడురా. అన్యాయముగా నా కొడుకును చంపినారే. మహనీయుడాయన. ఆయనను అవమానపెట్ట దలచిన వాడెవడురా ముందు చెప్పండి. (అని కోపంగా అనును.)

వారు :- ఆచారి కోటయ్య యిట్లు చేయమని మమ్ము బలవంతపెట్టగా చేసినాము. కావలసినంత అయింది. నీ కొడుకు తీరిపోయి నాడు. మామో. (అని దుఃఖింతురు.)

పాపి :- (వీరబ్రహ్మమును చూచి) తండ్రీ! అపరాధమును క్షమించి, నా కొడుకును బ్రతికించి పుణ్యము గట్టుకొనుడు. వీడొకడే కొడుకు. (అని నమస్కరించును.)

వీ :- అయ్యా! ఆ ఆచారిని అడగండి. లేదా నా దగ్గరకు పిలుచుక రండి నేనడిగెదను.

పాపి :- అదీ మంచిమాటే. (అని ఆతురతగాపోయి, ఆచారిని రెట్ట బట్టుకొని ఈడ్చుకొని వచ్చి) నీవు బ్రతికిస్తావో లేక ఆయన కాళ్లమీదబడి బ్రతికింప చేయిస్తావో. కానీ నా కొడుకు బ్రతుకకపోయిన, నీవు బ్రతుకవు. ఊఁ కానీ.

కోట :- వీరభద్రా! నన్ను కాపాడుస్వామి. (అని గట్టిగా అరచును.)

వీ :- ఆ వీరభద్రుడు నా గురుదేవుడు. వారు నన్ను కాదని రారు. కానీ పిలువుము.

కోట :- సాదుగారు! నే చేసిన తప్పు క్షమించి, ఈ పిల్లవానిని బ్రతికించి పుణ్యము గట్టుకోండి. (అని నమస్కరించును.)

వీ :- ఆచారిగారు! నేను విశ్వబ్రాహ్మణుడను. గృహస్థాశ్రమమున నుండదలంచితిని. నీ పుత్రికనిచ్చి పుణ్యము గట్టుకోండి. ఈ పుణ్యము గట్టుకొనెదను.

అందరు :- అయ్యా! గోవిందమ్మకు తగిన భర్త ఈ మహనీయుడు. ఇస్తానని చెప్పవయ్యా. ఊ. (అని తొందరింతురు.)

కోట :- సందుచూచి గుద్దిలేసినాడు తలుపుసందున యిరికించినాడు అదును బాగదొరికింది. ఇప్పుడు తప్పించుకొనడానికి వీలులేదు.

పాపి :- ఏమయ్యా, అట్లాలోచిస్తావు. యింతకన్నా మంచి అల్లుడు నీ జన్మలో దొరుకడు. సరే ననవయ్యా.

కోట :- నా భార్యను, అమ్మాయిని అడుగవద్దేమయ్యా.

పాపి :- సరేనయ్యా, వాళ్ళను నేను వప్పిస్తాను. మమ అనవయ్యా. ఆలశ్యమైతే పిల్లవాడేమవుతాడో చెప్పవయ్యా. స్వామీ! ఈ ఆపద దాటించు. ఆయన ఒప్పకున్నా నేను పెళ్ళిచేసేవాణ్ణి. ఊరందరు నీకు సహాయము చేస్తారు ఆచారి! నేనంటే నీకు తెలుసుగా. ఇటుసూర్యుడటు మొలచిన నీ కూతురు ఆయన భార్యే. నన్ను కాదనేవాడు యీ వూళ్లో పుట్టలేదు. నీవెక్కడపోతావో చూస్తా. ఏం, వప్పుకుంటావా? తీర్థ ప్రసాదాలు నేలన పడాలనా. (అని పంచ ఎగజెక్కును. మరొకడు పట్టుకొనును.) దేవునిలాంటి మనిషికి కూతురినిమ్మంటే ముడ్డి తిప్పుతాడు చూడా.

కోట :- కానివ్వండి. కాగల కార్యము కాకమానదు. అట్లనే కానివ్వండి. దైవేచ్ఛ.

వీ :- ఆచారిగారు! నీ కుమార్తెకు పతిలోటు గలుగబోదు నాకు తగిన యిల్లాలనియు, ముందుజన్మమున ఈమె నా ఇల్లాలేయనియు తెలుసుకొన్న వాడను గాబట్టి అడుగుచున్నాను. దైవికముగా వివాహామైపోయినది. ఇక లోకమర్యాదగా కాదగియున్నది. అది జరిపించుటకు వప్పుకొనుము. సందేహింపకుము.

కోట :- తమ కోరిక ప్రకారమే శిరసావహించి నెరవేర్తును. తమ మహిమ తెలియక పలికిన పలుకుల క్షమింపుడు. (అని నమస్కరించును.)

[ వీరబ్రహ్మము కమండలోదకము చల్లును. యువకుడు లేచును. ]

పాపి :- ఆచారి! చేసినపనికి చెంపలేసుకొని అల్లుని పిలుచుకొనిపోయి, అన్నపానీయములు చూడుము. నేను గంటలో పూర్లో డబ్బు వసూలుచేస్తాను. రేపే పెండ్లి. రా సామి. పోదాము. - ఇదిగో ఆచారి! యింటికిపోయి ముడ్డితిప్పినావా, ముట్లుడుగుతాయి భద్రం. జాగ్రత. [అందరు పోదురు.]

( తెర వాలును. )

## పంచమాంకము — ద్వితీయ రంగము.

" కోటయ్యాచారి గృహము. "

ఆచారి బ్రహ్మమును కూర్చుండ నియమించును. - గోవిందమ్మ చిరునగవుతో చేరవచ్చి పాద నమస్కారము చేయును.

వీ :- అష్టకామ్యార్థ సిద్ధిరస్తు. (అని రెట్టబట్టి లేపి) కార్యము నెరవేరినదా?

గోవి :- అంతా తమ దయ. [పాపిరెడ్డి ప్రవేశించి]

పాపి :- ఆచారి! నీ ఖర్చు కానీకూడ వద్దు. ఈ పెండ్లి పూరందరిదీ. కావలసిన సామానులన్నీ సమకూరినవి. సమీప బంధువుల పిలుచుకొని వచ్చుటకు మనషుల పంపి, వివాహము చేయించు

బృహస్పతుల వారిని పిలిపింపుము. వధూవరులకు కావలసిన వస్త్రముల చూతురురండి. రేపే వివాహము. అల్లుని చక్కగా విచారించుడు. (అని పోవును.)

( తెర వాలును. )

## పంచమాంకము — తృతీయ రంగము.

హోమము వెలుగుచుండును. వధూవరులు ప్రదక్షణము చేసి, మోక రించి నమస్కరింతురు. అందరు అక్షింతలు వేయుదురు.

వీ :- (లేచి నిలుచుకొని) మహాశయులారా! నేను బ్రహ్మచర్యము తోడనే సాధింపతగినవన్నీ సాధింపతలచితిని గానీ, ప్రారబ్ధకర్మ మింకా కొంతున్నది. కుటుంబాశ్రమము నిర్వహించక తప్పి నదిగాదు. ఎన్నియో జన్మములనుండి వెన్నంటి వచ్చుచున్న ఈ యిల్లాలిని విడచిపోవుటకు వలను పడలేదు. వలను పడదు. అందువల్ల మీ అందరి దయతో కుటుంబికుడనైతిని. యీ కుటుంబ యాత్రాస్థలము కందిమల్లయపల్లె అందు నివసించి నా విధిని నేను నెరవేర్చుకొందును. మీ గ్రామవాసులందరు శ్రమ దానము, దానమొనర్చి నా వివాహము సాంగముగ నెరవేర్చినందుకు కృతజ్ఞుడను. మీ మేలు మరువను మీ కెల్ల రకు ధనాభివృద్ధి, జ్ఞానాభివృద్ధి భగవానుడు ప్రసాదించుగాత - రేపే నా ప్రయాణము. (అందరు నమస్కరించి పోదురు.)

సిద్దేఖా :- అరే సామి! మాదాన్కి పిల్లలేదు, జల్లాలేదు. అల్లాకు సెప్పి ఎంత మొత్తుకున్నె, ఎంత కొట్టుకున్నె ఎంత కష్టంచేసిన ఒక పిల్లకూడ పుట్టలేదు. అమ్మయ్యకి పిల్ల పుట్టై తల్కి నాకు పిల్ల పుట్టించు సామి. పిల్లాకి చూడాలని జెను. సలాం.

వీ :- అజరత్! నీ భార్యకు నెల తప్పినది ఆమె గర్భమున మహా

తేజస్వియగు పుత్రుడు పుట్టును వంశము నుద్ధరించును నాకు శిష్యుడై జగద్విఖ్యాతి గడించును పొమ్ము.

బుడ్డే - సలాం సలాం. (వంగి సలాం చేయును.)

[వీరబ్రహ్మము, మొదలగువారు పోవుదురు.]

అరెరే, కడ్పు పట్టి సూడ్కనే పిల్లగా తెల్సుకున్నేడు. ఏమే, పిల్లవుంది కడ్పులో. (బూబు వూకొట్టి నిజమేనని పోవును.) అరెరే జెమ్మదేవుడు సామీ! కడ్పు పట్టిసూసిన, మందుల్ మాకుల్ పెట్టిసూసిన, దేవుల్ కీ సెప్పిసూసిన పిల్లల్కి తెల్పు కోలేక పోయినారు. - గబుక్కినా పట్టుకున్నట్టు కడ్పులో పిల్లగా తెల్సుకున్నేడు సామి యేమీ తెల్సొ, యేమి తెల్సో. - కడ్పు యెక్కడుంది. సామి ఎక్కడుండాడు. ఏమి మాత్రెం. వైద్దుల్ పట్టి పట్టి సూస్నార్. పెట్టి పెట్టి సూస్నార్ (శతస్తోపు) డొక్కల్ పక్కల్ కొట్టికొట్టి, పిస్కిపిస్కి సూస్నార్. పట్టిన లేదు, పెట్టినా లేదు - మంచికీ దేవుడు తోడు కావాలి చెప్ప డాన్కి. - పిల్లాకి పుడ్తే, అల్లాకి కోడి పలావు సేయిస్నా. పకీర్లకి పెట్టిస్నాన్. (అని పోవును.)

( తెర వాలును. )

---

## పంచమాంకము — చతుర్థ రంగము.

" వీరబ్రహ్మము గృహము. "

గోవిందమ్మ, పోతులూరు గోవిందయ్య కూర్చొని వుందురు.

గో :- నాయనా పోతులూరు! మీ తండ్రి ఎన్నాళ్ళని కష్టము చేయ గలడు. మీరు పెరిగి, పెద్దవారయ్యి తండ్రికి సహాయము చేయక, కులవృత్తిని నేర్చుకొనక సోమరులై తిరుగుచున్నారు. మీ తండ్రికి వయసు మీరవచ్చెను. ఇంకా కష్టముచేసి, సంపా దించి మిమ్ముల చాకవలెననిన, అవునా. నాయనా, తండ్రికి

సహాయము చేసి, తలిదండ్రుల ఋణము తీర్చుకొనవలసిన ఈడు యేనాడో వచ్చినది. ఇంకా తండ్రి ఋణములోనే ఎందుకు పోయెదరు తండ్రిమాట విని మన వృత్తి విద్యను, కులాచార వ్యవహారములు, దైవశక్తిని ఆర్జించుకొనండి.

వృత్తి విద్యలేక, ఆచారవ్యవహారములు, లోకజ్ఞానము లేక సంచరించువారికి పిల్లనెవ్వరిత్తురు. - ఉత్తముడని నెవ్వరందురు. - బాల్యముననే భార్యాపిల్లల చాకు తాహాతు సంపాదించుకొనకుండిన, వాడొక మానవుడని ఎట్లందురు. మీ తండ్రి మహనీయుడు. వారి కోపము వూరకపోదు. మిమ్మధోగతి పాలు చేయకతప్పదు. చక్కగా కుతికల పర్యంతము తిని, వీధులవెంబడి తిరుగుచుండిన, ముందు కాగలకార్యము లెట్లగు ననుకొంటిరి.

పోతు :- అమ్మా! ఒక్కనాడైనా మా నాన్న పిలిచి, ఇది కాదిదియని చెప్పగా చూచినావా. ఏమో, తెగబారెడు చెప్పెదవు

గో :- కాదురా. వారి ననుసరించి, ఆయన చెంతచేరి, ఆయన కష్టములో పాలుపంచుకొని, కనికరము గలుగునట్లు, నా కొడుకులని శాంతికల గునట్లు ఆచరణచూపిన గదేమిరా నా కొడుకులనేది. వేకువజామున లేచి, దినకృత్యములు దీర్చుకొని, దేవతార్చన, నివేదనచేసి, నివేదనాన్నమును ఇంతో అంతో భుజించి, పనిలో ప్రవేసించును. అంతవరకు నిద్రలేయక, స్నాన సంధ్యానుష్టానములులేక, ముఖప్రక్షాళనము చేసి చేయక భుజించువారికి ఆ మహనీయుడు యేమి చెప్పునురా. ఆయనతో పాటు లేచి, దినకృత్యములు దీర్చుకొని ఆయనతో పనిలో ప్రవేశింపగలిగితే, తండ్రి సంతోషించి, చెప్ప తగినవి, నేర్ప తగినవి నేర్పును. నెత్తిన నోరుపెట్టుకొని నేనెంత చెప్పినా వినరే. ఏమి చేయుదును.

కొరగాని కొడుకు పుట్టిన
కొరగామియె గాక తండ్రిగుణముల చెరచున్.

అన్నారు పెద్దలు. అట్లనే వున్నది.

అట్టి తండ్రికి ఇట్టివారు పుట్టితిరి. తండ్రికెట్టి సంతోష ముండును. ముందేమిగతియో పరమేశ్వరున కెరుక.

పి :- (ప్రవేశించుచు) గోవిందా! పోషించెడువాడు లేడని చింతగా నున్నదా? పోషించెడివాడు, పేరు ప్రతిష్ఠల నిల్పువాడు, కాలితో చూపిన చేతితో చేయువాడు వచ్చుచున్నాడు జ్ఞాన సిద్ధుడు. భయపడకుము.

[బ్రహ్మముగారి మాట విన్నతోడనే కుమారులు వెళ్ళిపోదురు గోవిందమ్మ లేచి నమస్కరించును.]

(బ్రహ్మము కూరుచొని) గోవిందా! తలిదండ్రుల ఋణము తీర్చెడివారు గాదని చింత చేయకుము. ఇట్టి చింత ముందు జన్మమున నుండవలయును. ఇప్పుడు చింతించిన ఎక్కడనుండి వత్తురు. - సత్పుత్రులు, పుత్రికలు కావలయునని, సుగుణ సంపత్తిగల భర్త కావలయునని ఒక జన్మమంతయు తన ఆరాధన దైవమునకు చెప్పుకొన్నవత్తురు. చెప్పుకొనక ఎట్లువత్తురు. ఏది నీవుకోరి దైవమునకు చెప్పుకొన్నావో అదియే వచ్చును. అదియే దైవమిచ్చును. - భర్త మంచివాడు కావలెనని కోరి నావు ఇచ్చినాడు. భార్య మంచిదికావలెనని కోరినాను, వచ్చి నావు. సత్పుత్రులు కావలెనని కోరలేదు, కలుగలేదు. వారికి మనము బాకీతీర్చుచున్నాము. మనకు వారు బాకీలేరు. అదుగో వచ్చుచున్నాడు సత్పుత్రుడు.

గో .- (చిరునవ్వుతో) ఇంకా సంతతియా స్వామి.

పి :- నీ కడుపున దుస్సంతతి పండినది పంట ఉడిగిపోయినది. కని పెంచకనే పూర్వపుణ్యఫల విశేషమున నీకు చేసిపెట్టవలసిన సత్పుత్రుడు వచ్చుచున్నాడు. మాట్లాడించి చూడుము. నీ బాకీ తీర్చెడివాడు అవునో కాదో. - (అని లేచిపోవును.)

[అంతవరకు వెనుకనుండి వినుచున్న కుమారులు వచ్చి]

పోతు :- అమ్మా! కని పెంచని కొడుకు వాడెవడే, వింతగా నున్నదే! నీకన్నా ముందు మా పెద్దమ్మకేమయినా పుట్టినాడేమోనమ్మా.

గో :- ఛీ. బుద్ధిలేని పీనుగ నోరు మూయరా. తామరపుష్పము క్రింద నున్న కప్ప ఆ పుష్ప పరిమళము తెలుసుకొనలేదు. ఎక్కడనుండియో తుమ్మెద వచ్చి, ఆ పరిమళము అఘ్రాణించి, ఆ పుష్పాడిని భక్షించిపోవు విధముగా నున్నది మా బ్రతుకు. తండ్రి మహామహిమ మింతవరకు తెలుసుకొనలేని మంద భాగ్యులు. మీకేమి తెలియును. తల్లిదండ్రుల దుఃఖంపచేసిన పాపము మరుజన్మమున ఫలించును. పుట్టుకతో తలిదండ్రులు నశించి, అమ్మా నాన్నా అను వారులేక అల్లాడునట్లు చేయును. అప్పుడు తెలియును

సీ॥ పురిటింటనే తల్లి పరలోకమున కేగ
నల్లాడు పిల్లలఁ గనరయలేద,
తల్లి చల్లనిచూపు తమకెందు కనరాక
శోకించు పిల్లలఁ జూడలేవ,
చెంత చేర్చెడివారు చెయిజాచు వార్లేక
దీనులౌ పిల్లలఁ గానలేద,
కడుపు మంటలనార్ప గంజిగానక యేడ్చు
పసిపిల్లలే కంటబడగలేద.

తే॥ వీరికెందుకు తలిదండ్రి దూరమైరో
జ్ఞానదృష్టికి నందదా గావబడద,
వీరు తలిదండ్రి శాపాగ్ని వేగ్రిలి మున్ను
ధరజనించిన పాపులు నరసిచూడు.

అట్టి వారయ్యేదరని వారికి బాగా తెలియును. ఎవరి కర్మ వారిది. పొండు.

[సిద్దయ్య ప్రవేశించి 'మాతా నమస్కారము' అని మోకరించి నమస్కరించును.]

గో :- ఎవరు నాయనా నీవు? ఎందుకు వచ్చితివి?

శిద్ద :- గురుదేవుని కొరకు వచ్చితిని. తల్లీ! జ్ఞానభిక్ష పెట్టి నన్నుద్ధరింపుము.

గో :- నీవే వంశస్థుడవు నాయనా?

శిద్ద :- అమ్మా! నేను దూదేకుల వంశస్థుడను ముడిమేలపేట నా గ్రామము. జ్ఞానోపదేశము కొరకై గురుదేవుని ఆశ్రయింప నిట కొచ్చితిని. జ్ఞానార్థిని.

పోతు :- మంచివాడవే ఎదురైనావు. యిటు హిందువులకు, అటు ముస్లీములకు గాక మధ్యలో నల్లాడు దూదేకులవాడవు. మా తండ్రికి శిష్యుడవయ్యెదవా? ఓరి నీ బుద్ధిగాల నీయట్టివారికి ఉపదేశమా? ఉపదేశము లేదు, పరదేశము లేదు. పో.

శిద్ద :- అయ్యా! నేను ముందుజన్మమున ఇట్టి అజ్ఞానముచేతనే దుండగుల పజ్జచేరి దుర్గుణము లలవరచుకొని, సుజ్ఞానులైన తలిదండ్రుల మాట వినక, వయోగర్వమున సంచరించి, మాతృ పితృ శాపగ్రస్తుడనై, నీచ జీవనులకు జన్మించితిని. తల్లిదండ్రి శాపగ్రస్తుడను గాకుండిన, వారి ఋణముతీర్చియుండిన, ఇట్టి దుర్గతులు నాకు దాపురించవు. - కట్ట బట్ట, తిన తిండిలేక కాయకష్టముపై ఆధారపడి, ఇల్లు వాకిలిలేక ఏ చెట్టునీడనో పశువువలె కాపురముచేయుచు, ఇహము పరము తెలియని తలిదండ్రులకు పుట్టితిని. ఇప్పుడు దిక్కు పరదిక్కు లేక, దరిదాపు గానక నల్లాడుచున్నాను.

దేవతాస్వరూపిణియైన ఈ మహాతల్లికి దైవస్వరూపులై, త్రికాలవేదియై, భూతభవిష్యద్వర్తమాన కాలముల నెరింగియు, కర్మబద్ధులై, మానవత్వము చేకొన్న మహనీయునకు పుత్రులై, దుస్సహవాసమున వయోగర్వమున చెడిపోవుచున్నారు. ముందు చెడి అల్లాడువాడను నేను. ఇప్పుడు చెడుచున్నవారు మీరు మీరు నన్ను బహిష్కరింపదలచినను గురుదేవుడు

బహిష్కరింపడు తల్లీ! నీ చల్లనిచూపుతో నన్ను నీ పుత్రునిగ చూచి, జ్ఞానభిక్ష పెట్టి కాపాడు. ఈ జన్మమున మీ ఋణము తీర్చుకొందును.

గో:- నాయనా! వారి నడుగవలయును యెందరెన్ని విధముల ప్రార్థించినను, స్వకులస్థులనే శిష్యులగా తీసుకొనకున్నారు. నిన్ను తీసుకొనునా అను సందేహము

పోతు:- ఏమయ్యా, పిచ్చిపట్టినవాని వగిదిగా వదరెదవు. ఇచ్చి ఇచ్చి నీయట్టి ద్వందకులస్థునికే ఉపదేశమియ్యవలయునా నీవెక్కడ, ఉపదేశమెక్కడ. పోవయ్యా వచ్చిసదారిన.

సిద్ద - స్వామి! నీచజాతీయులకు పుట్టినను, న లోనున్న జీవుడుమాత్ర మందరియందున్నవాడే. కుమ్మరింటి కుండ ఏ జాతీయునింటికి పోయిన, ఆ జాతీయమౌనుగదా. కుమ్మరింట కుండ నున్నంత వరకు ఏ జాతి కుండయని చెప్పగలవు. ఏ జాతీయుడు నీళ్ళు పోసి కడుగునో ఆ జాతీయమౌచున్నది జీవుడు ఏ జాతీయు లని నిశ్చయింపబడినారో ఆ తలిదండ్రులకు పుట్టి ఆ జాతీయు డౌచున్నాడు - పాప పుణ్యానుసారముగా జీవుడు పుట్టు చుండును. సుఖదుఃఖములు గలుగుచుండును. జాతులు వచ్చు చుండును. పరోక్షజ్ఞానులకు అందరు వకటే. అపరోక్షజ్ఞాను లకు జాతిమత ద్వేషములు, ఆచారవ్యవహారములందు భిన్నత్వ మేర్పడును. భావ విభేదములతో కూలిపోవుదురు. యిది ప్రారబ్ధకర్మ. మాతా! నన్ను మన్నించి, జ్ఞానభిక్ష పెట్టుతల్లీ.

పో:- ఇదిగో, చెప్పుచున్నాను విను మాటలతో పోకపోయిన, మెడ బట్టి గెంటివేసెదను. నీవిక్కడ తగవు. పో. - ఏమో, మహా బ్రహ్మజ్ఞానివలె మాట్లాడెదవు పా. బయటికి.

సిద్ద:- అమ్మా! ఉండమని ఒక్కమాట చెప్పు తల్లీ నా గురుదేవుని నాకు చూపి, నన్ననుగ్రహించు తల్లీ.

పోతు:- ఇదుగో ఈసారి మళ్ళీచెప్పతున్నా. పోయెదవా లేక మెడ బట్టి నూకవలెనా.

శిద్ద :- అయ్యా! నా దేహమునందున్న ప్రతి రక్తబిందువునందు నా గురుదేవుడున్నాడు. పొమ్మనుటకు, ఉండమనుటకు వారికి శక్తిగలదు. నీకాశక్తి ఎక్కడిది. ఏదీ కానీ, త్రోయి చూతము. (గురుదేవా! అని చేతులు జోడించి నిల్చును.)

[పోతులూరు మెడపట్టిత్రోయ శిద్దయ్యపై చేయిబెట్టి, కాలింది కాలింది అని చేతులు విదలించుకొనుచు. మంట మంట అమ్మా మంట యని బాధపడను.]

శిద్ద :- ఊఁ కానీ. రా. త్రోయి (అని పోతులూరును హెచ్చరించును)

గో :- శిద్దయ్యా.

శిద్ద :- అమ్మా! బుద్ధిలేనివారికి బుద్ధి కుదుర్చుటకు చతుర్థోపాయమే గావలయును. - అయ్యా! ఆ మంటలనార్పు శక్తి ఆ మహా తల్లి పాదపద్మములకే గలదు. ఆ పాదము లంటుము. పోవును.

(అంటును, మంటలు పోవును. పోతులూరయ్య గోవిందయ్య చేతిలోనున్న కట్టెనుతీసుకొని కొట్టుటకు పైకెత్తును. శిద్దయ్య గురుదేవ! అని అపుటకు చేయి పైకెత్తును. పోతులూరయ్య చేతులు వంగుటకు వీలులేకుండ పైకే నిలుచును. అబ్బా అబ్బా అని బాధపడును.)

స్వామీ! ఆ మహామహులు నాయందు వున్నంతవరకు నీయట్టి వారు లక్షలాదిగా కొట్టవచ్చినను కొట్టలేరు. - నీ వక్కనితో ఏమగును.

గో :- శిద్దయ్యా.

శిద్ద :- తల్లీ! నీ చేతులతో దింపుము. దిగును. నాకాశక్తి ఎక్కడిది.

[గోవిందమ్మ పోతులూరయ్య చేతులను దింపును. దిగును.]

అమ్మా! నా గురుదేవునితో నీవు నా మనోవీధి నిరంతరము సంచరించుచు, నా హృదయకమలమున పదిలముగ నెలకొని యున్నావు. నీవు నన్ను కాదని మెడబట్టి నూకించినను, నా

హృదయకమలమునుండి విడిపోలేవు. ఇదియంతయు మీ మహా మహిమయే తల్లీ. చల్లని నీనోట వుండమని ఒకమాట చెప్పు తల్లీ. వారు కన్నపుత్రులు. నేను గురుపుత్రుడను. కాదనకు తల్లీ. గురుదేవుని చూపింపుము.

పోతు :- అమ్మా! వీడు మంత్రాల మారిగాడు. మనయింట వుండ నిచ్చిన, తప్పక మమ్ముల చంపుట నిజము. ఆ మాటనకమ్మా.

వీ :- (ప్రవేశించి) యేవూరు నాయనా?

సిద్ద :- గురుదేవ (అని సాగిలపడి నమస్కరించి, లేచి) గురుదేవ! నాది ముడిమేల గ్రామము. మీకు తెలియనిదేమున్నది. దూదే కుల వంశీయుడను. జ్ఞానోపదేశముకొరకై తమచెంత చేరితిని. జ్ఞానార్థిని. దయామయా, దయ దలంచు. (అని చేతులు జోడించును.)

వీ :- దూదేకులవానికి హిందూమత సంప్రదాయ జ్ఞానోపదేశమా? ఔరా. పోతులూఱ! వీనిని మెడబట్టి ఆవలనూకుము.

పోతు :- నాన్నా! వద్దు వద్దు. వాడు కాలుతాడు. కాలుస్తాడు. మంత్రిగాడు.

వీ :- దూదేకుల వంశజునకు మంత్రసిద్ధి యట్లగునురా. నీవు సద్వంశ సంజాతుడవై, నిత్యానుష్ఠాన గరిష్ఠుడవైన నీవు వీనిని ఆవల త్రోయలేవా, సిగ్గుచేటుగాదా? సద్వంశజులనే దైవము కటా క్షించునా, హీనుల కటాక్షింపడా? యిప్పుడు తెలిసినదా? గోవిందా! నీవైన పొమ్మనలేకపోయితివా.

గో :- నేను గురుపుత్రుడను. మీ ఋణముతీర్చెదను. నన్ను పొమ్మ నకు మమ్మా అని దీనతగా పలుకుచున్నాడు ఎందుకో కరుణ గలుగుచున్నది. కాదనలేక, పొమ్మనలేక మిమ్మడుగమని చెప్పి తిని. ఇంతలో వీడు ఇంతపని చేసినాడు.

వీ :- మరి, ఉండనివ్వమందువా? పొమ్మని చెప్పమనెదవ?

పోతు :- అమ్మా! (పొమ్మని చెప్పుమని సైగచేయును)

గో :- ఏమోనండీ, ఒక ప్రక్క కరుణ పొడముచున్నది. మరొక ప్రక్క. (అని ఆలోచించుచు) వీడిప్పుడే ఇంతటిశక్తి నార్జించినాడే. మీ చెంతచేరిన (అనుమానించును.)

వీ :- మరింతశక్తి నార్జించి, మనవారికేమిచేయునో అనియా? కన్న కొడుకలకన్నా కీర్తివంతుడౌననియా? పిచ్చిదానా! నీవు, నేను వాని రక్తనాళములందెక్కడ చూచినా ముందే నిల్చుకొనియున్నాడు. వానిలో నీవు నేను లేకున్న పోతులూరును ఎదిరింపగలడా. ఆ యుగమున ఏకలవ్యునిరీతిగా, ఈ యుగమున శిద్దుడు గురువును సంపాదించుకున్నాడు. - శిద్దయ్య అంతటి శిష్యుడు అని ఉదాహరణకు నిలువతగిన శక్తిగలవాడు. ఆఖరు మాట యేమందువు?

గో :- నేను వద్దనలేనండి. కన్నతల్లి కరుణ నాకెందుకో కలుగుచున్నది. అటుపై తమ దయ, వాని అదృష్టము.

శిద్ద :- తల్లీ! (అని మోకరించి నమస్కరించును)

వీ :- గోవిందా! ముందు జన్మమున తల్లి కహితమైన పనులొనర్చి, మాతృ శాపగ్రస్తుడై, కాయకష్టముచేసి జీవించు దూదేకుల వంశమున జనించినావు. ఆ శాపము గగనవాణినోట. అటు వినుము.

[ఆకాశవాణి] :- ఓరీ దుర్మార్గా! మాకు పుట్టి, మాచే విద్యాబుద్ధుల గ్రహించి, మాచే పెరిగి, పెద్దయి, మేమార్జించిన ఆస్తిపాస్తుల తింటూ, మాకు జీవనమని కట్టబట్టకు, తిన తిండికి చాలని జీవనమిచ్చెదవ. రాబోవుజన్మకు కట్టబట్ట, తిన తిండిలేని తలిదండ్రులకు పుట్టి, అల్లాడెదవు పో.

వీ :- గోవిందా! వింటివా మాతృ శాపము.

గో :- (నమస్కరించి) స్వామి! మీరు సర్వసమర్థులు. మూఢురాలను నాకేమి తెలియును.

(శ్రీ) వీరబ్రహ్మముగారి నాటకము



వీ :- సిద్ధుడా! భక్తి శ్రద్ధలతో, వినయ విధేయుడవై, నీవు దేని నాసించి మాచెంత చేరితివో, అది నీకు సిద్ధించువరకు మా చెంతనే వుండి, మా పుత్రుల సోదరులవలె చూచుచు, వారికి మార్గదర్శకుడవై మాకు కీర్తిని తేగలవా?

సిద్ద :- తమ పాదధూళినై తమ యాజ్ఞను శిరసావహింతును, (అని నమస్కరించును.)

వీ :- మనోవాంఛాఫల సిద్ధిరస్తు. జ్ఞానాభివృద్ధిరస్తు. (అని పోవును. గోవిందమ్మ, సిద్దయ్య వారివెంట పోవుదురు.)

పోతు :- గోవిందా! ఇంక మనపని అయినట్లే. వాడుచూడు ఎంత అణుకువో - వాడుచూడు యెట్లపని చేస్తాడో. - వాడు చూడు పెద్దవారిమాట యెట్ల వింటాడో. - వాడుచూడు ఎంత ఆచారమో. - వాడుచూడు ఎంతసేపు దైవధ్యానము చేస్తాడో అని, అమ్మా నాన్న వాని సాటిపెట్టి సాగదీస్తారు. అవతల పోనియ్యారు. చచ్చినట్లు ఇంట పడివుండవలసి వచ్చింది. వీని తలపగుల, వీడెక్కడనుండి మనకు దాపురించెరా. నాన్న అన్నాడు విన్నావా. మా పుత్రులకు మార్గదర్శకుడవై వుండు అన్నాడు వీడు మార్గముసూపేవాడు, మనము వానివెంబడి నడిచేవాళ్ళమునా. వీన్ని ఏదోవకటి చేసినగాని మనము బ్రతుక లేము. రా చూతము. - పోతేరమ్మతల్లీ! నీవే మాకు దిక్కు. తొందరగా వీణ్ణి నీ కడుపున పెట్టుకో. (అని పోవుదురు)

( తెర వాలును. )

## పంచమాంకము — పంచమ రంగము.

సిద్దయ్య, పోతులూరయ్య చక్కసామాను తోపటా తోయుచుందురు. గోవిందమ్మ ప్రక్కనుండి చూచుచుండును.

పోతు :- అబ్బా! చేతులు ఓర్చులేదయ్యా, సిద్దయ్యా. (అని నిల బెట్టును)

శిద్ద :- మధ్యాహ్నానికి కడీ, కంచము కడుపు ముందర కెట్లొస్తుం దయ్యా పోతులూరయ్యా?

పోతు :- చేతులు పడిపోతున్నాయి. ఇక నాతో కాదయ్యా.

శిద్ద :- పోతులూరయ్యా! కాయకష్ట మెట్లుండునో తెలిసినదా. చేయ లేకపోయిన,

ఆ॥ పనికి పోతరాజు, పనిచేయగాలేడు
తినను, నిద్రిబోను తిమ్మరాజు
వేరుసుగుణమెద్ది వెతకినం గనరాదు
పుట్టినాడదెట్లో పురుషుడౌచు.

అని అంటారు. నగుతారు ఆడవారు. పోతులూరయ్యా! కాయ కష్టముచేయక నీడన కూర్చొని, మనోకష్టముతో గౌరవముగా సంపాదించుకొని, సుఖపడవలయు నన్న దైవశక్తి నార్జించి యుండవలయును.

పోతు :- దైవశక్తి మానవునియందు ఎట్లు ప్రవేశించును. ప్రవేశింప చేసుకొనుటెట్లు? చెప్పు చూతము.

శిద్ద :- చూతాము, చేతాము అనవే - కర్మము అననివ్వదు, చేయ నివ్వదు. అయ్యా! దీనికి అనేకమైన దారులున్నవి. ధ్యానము చేయుట, పూజించుట ఉన్నంతలో పండ్లు పాలు మొదలగునవి దైవనివేదన చేయుట, దేవాలయములకు పోయి ప్రదక్షిణ, నమ స్కారములు చేయుట, అభిషేకార్చనాదులు చేయించుట, వ్రత ములుచేయుట మొదలగునవి చేయుచువచ్చిన ఆ సత్ఫలము నవ గ్రహ కేంద్రములందు చేరి, రాబోవుజన్మలో ఒకటికి సహస్రాం శమై మానవుల సుఖపెట్టును. పెట్టినందుకు పుట్టినదే నాతీ అన్నారు. పెట్టి పుట్టినవారు వారు అంటారు. ముందుజన్మమున అట్టి నియమములకు కష్టములకు నిలచినవారే ఇప్పుడు భూస్వా ములు, ప్రభుత్వోద్యోగులు, వ్యాపారులు, కవులు, గాయకులు మొదలగు సుఖజీవులు. ముందు మనము కొరతగా చేయబట్టే కాయకష్టముతో జీవించుచున్నామని తలంచు.

ఇది నీ వృత్తివిద్య మహా కష్టమైనది. దీనిని కాదని మరి ఏమి చేసెదవు? మోసము నేర్చుకొనెదవ? దొంగతనము చేయబోయెదవ? ఇవి నేర్చుకొన్న అపాయకరము. మానవులలో కూరుచొన స్థానముండదు. కడకు అలుపిల్లలు, అమ్మానాన్న కూడ నమ్మరు. ఈ దేహమున్నదెందుకో తెలియునా కన్న తలిదండ్రుల చాకుటకు. అటుపైవచ్చు ఆలును, అటుపై వచ్చు పిల్లల పోషించుటకు.

పోతు - ఆలు వచ్చినతోడనే పిల్లలు వస్తారా. ఎప్పుడో ఏమో, చూతాము.

శిద్ద :- అన్నా పోతులూరు! ఆలు గృహప్రవేశ మయ్యేటప్పుడు ఎట్ల వస్తుందో చూచినావా. వడిబాలు కట్టుకొని, పిల్లలగంప నెత్తిన బెట్టుకొని, వడిబాలు బియ్యము యెన్ని వున్నవో అంతమంది నా కుక్షియందున్నారు చాకేతాహాతు చూచుకొమ్మని కుడి కాలుతో బియ్యము నెగరజిమ్మి, గృహప్రవేశ మగుచున్నది, తెలియునా. - అయ్యా, ఆ మహాతల్లి

కం॥ ప్రేమించిన యమృతంబగు
ప్రేమింపక పోయెనేని విషభాండమగున్
ప్రేమింప చేసుకొనగా
స్వామీ! మగశిరిని, శిరిని సమకూర్చవలెన్.

పోతు :- ఎట్ల సమకూర్చవలె ననెదవు?

శిద్ద :- ఎట్లనా? దొమ్మరగుడిశలలో సానికొంపలలో దూరక, పాలిపోనీయక దేహమును కాపాడుకొంటూ వృత్తివిద్యను సాగించుచు, వృత్తిలో ఉన్నతస్థితినందుకొంటూ, విరామకాలములో మాతృభాషజ్ఞానమును బరచుకొంటూ, సోమరులుగాక, ఉదయ సాయంత్రముల దైవధ్యానము చేసి, దైవ శక్తిని ఆర్జించుకొంటూ మంచినడవడి నలబరచుకొనవలయును.

చ॥ నడవడిచేత మానవుడు నల్వురిలో చిరకీర్తినొందనౌ
నడవడిచేత మానవుడు నల్వురిలో నపకీర్తిపొందనౌ
నడవడిచేకదా నరుని నాణ్యము హెచ్చుట తగ్గుటల్ గనన్
నడవడిచంపుకొన్న నటు నాయనువారెవరుండురీ ధరన్.

మంచినడవడి నలబరచుకొనవలసిన సమయము. నాల్గురూకలు సంపాదించుకొని దగ్గరుంచుకొనవలసిన కాలము. ఇప్పుడే చేతులు, కాళ్ళు, నడుములు పడిపోతే - మళ్ళ యట్లనన్నా. పెండ్లాము పెండ్లామని ఉబలాటపడి పెండ్లాన్ని సంపాదించుకొంటే నీ సప్తధాతువుల్లోవున్న బలాన్ని పీల్చి పిప్పిచేస్తుంది. అప్పుడు కాళ్లుచేతులు పడిపోతున్నాయి పనిచేయలేనే అంటే, ఇల్లాటి మొగాడవు పెండ్లెందుకు చేసుకున్నావు. కూడులేక పెండ్లాన్ని చంపడానికా అని నీల్గదీసి అడుగతుంది. ఏ శేటూ వకరిని ఊర్ధ్వలోకాన్నుంచి తెచ్చి, ఈ లోకములో నీ నట్టింట పడవేస్తుంది. గుంపు చేస్తుంది భార్యయనగా ఎట్టిదో తెలిసినదా. ఆ పై లోకానికి, ఈ లోకానికి మధ్యలో స్త్రీ సంధి చేయుచున్నది ఈ లోకానికి రావలసిన జీవులు స్త్రీలనుండియే వచ్చుచున్నారు. వచ్చెదరని తెలియునా, అప్పుడెట్లు చేసెదవన్నా. యీ గుంపు పెరగేకొద్ది ఆర్జన పెరుగవలయును. లేకున్న కట్ట బట్ట, తిన తిండి కరువై పెండ్లాము పెనుభూతమగును పిల్లలు యమదూతలగుదురు. అప్పుడు పెండ్లాన్ని పిలిచితే కసురుకొని మీద పడును. మగవానిని లక్ష్యం చేయదు. మాట వచ్చేటప్పటికి చాలా సంపాదించి, సాకే మొగోడని పీకెత్తుకొని తిరగాలి నేమో అని ఎత్తి పొడుస్తుంది. పోతులూరయ్యా! దండిగా ఆర్జింపగల విద్యనొకదానిని నేర్చుకొనవలయును. లేకున్నచో సుఖము సున్న. -

ఆ॥ నుండవలయుశక్తి నుభయలోకంబుల
నుండదేని సౌఖ్యముండబోదు
శక్తిలోన యణగి భుక్తిముక్తియునుండు
శక్తిగూర్చునట్టి వ్యక్తిఘనుడు.

దేహశక్తి, జ్ఞానశక్తి, ధనశక్తి దైవశక్తిలో అణగియున్నవయ్యా. ఆ శక్తిని సంపాదించినవాడే ధన్యుడు. - అదుగో గురుదేవుడు పిలుచుచున్నాడు. కానీ పని. వెంటనే వచ్చెదను.

పోతు :- సిద్దయ్యా! మా నాన్న పిలువలేదు నీవు పనితప్పించుకొని అలసట తీర్చుకొనపోతూ, పని నాపైన త్రోసిపోతున్నావు.

శిద్ద :- నాన్నగారు, నాకు యీ చెవులకు తోడుగా మరొక చెవ్వు, ఈ కన్నులకు తోడుగా మరొక కన్ను ఇచ్చినాడు. నన్ను గురించి ఎక్కడెవరేమన్నా వింటాను. ఎక్కడేది జరుగుచున్నను చూడవలయునన్న చూచెదను. నీవు ఎక్కడెక్కడ తిరుగునది చూచెదను. నన్ను గురించి నీవెక్కడేది చెప్పుచుండినను వినెదను. ఆ చెవ్వు, ఆ కన్ను నీవు సంపాదించుకున్నావా ధన్యాత్ముడ వయ్యెదవు. - చూడు సంపాదించు. - వస్తా. (అని లోపలికి పోవును.)

పోతు :- అమ్మా పోలేరమ్మా! వీనితో మాకు పెద్ద బాధగానున్నది. వీడు ఇల్లువిడచి పోకపోయిన, చచ్చిపోకపోయిన మేము బ్రతుకలేము తల్లీ. మా తలిదండ్రులకు వానిపైనే ప్రీతి. మాపైన అప్రీతి. ఎట్లు బ్రతుకవలెనమ్మా? వీనిని నీ పొట్టన పెట్టుకోతల్లి. (అని పైకెగచూచి దండము పెట్టును.)

[వెంటనే శిద్దయ్య ప్రవేసించి]

శిద్ద :- పోతులూరయ్యా! నేను యిక్కడనుండి పోకపోయిన, చచ్చిపోకపోయిన బ్రతుకలేమని పోలేరమ్మను నన్ను పొట్టన పెట్టుకొమ్మన్నావు గదూ.

పోతు :- అబద్ధము, శుద్ధబద్ధము. నేను నోగే లెవరులేదు కల్పన చేస్తున్నావు.

శిద్ద :- (ఆశ్చర్యముతో) ఆఁ. అయితే ఆ పోలేరమ్మనే అడుగుదమూ. నిజము ఆమే చెప్పగలదు

పోతు :- సిద్దయ్యా! పోలేరమ్మ సాక్ష్యము చెప్పరావలెనంటే సామాన్యమా? నీతోగాదు, నీయబ్బతో గాదు.

శిద్ద :- ఔను నిజము. నాకా శక్తిలేదు. మాఅయ్యకు అంతకు శక్తిలేదు. నా గురుదేవునికాశక్తిలేదందువా? సరే పిలువమంటావా?

పోతు :- పిలు చూస్తాను. ఇజ్జా ఇజ్జా అని పిలిస్తే, రాను కుక్క లనుకున్నావా? పిలూ చూస్తాము.

శిద్ద :- అయితే, గురుదేవుని శక్తి కాస్త చూపితేగాని, నీ బుద్ధి కుదరదు. భయపడవద్దు, పిలుస్తాను. అమ్మా, పోలేరమ్మ తల్లీ! ఇది నా గురుదేవునాజ్ఞ. నీవు సాక్షమియ్యవలసిన సమయము వచ్చినది, రా. ఇయ్యక తప్పదురా. (అని మోకరించి నమస్కరించును. గొప్ప శబ్దముతో త్రిశూలధారియై పోలేరమ్మ గావచ్చును. పోతులూరయ్య సిద్దయ్య వెనుకకు పోవును.)

శిద్ద :- భయపడకయ్యా. అడుగుతా విను. తల్లీ! పోతులూరయ్య ఏమని చెప్పుకొన్నాడో నిజముగా చెప్పు తల్లీ.

పోలేరమ్మ :- సిద్దయ్య పోకపోయినా, చచ్చిపోకపోయినా మేము బ్రతుకలేము, బ్రతుకనివ్వడు నీ పొట్టన పెట్టుకొమ్మన్నాడు. నిజము. పోతులూరు! ఈ సిద్ధుని ప్రతియొక్క రక్తబిందువందున నీ తలిదండ్రులు నెలకొని యున్నారు. వారి హృదయమున పార్వతీ పరమేశ్వరులు మొదలుకొని, ముప్పదిమూడు కోట్ల దేవతలు స్థిరనివాస మేర్పరచుకొని యున్నారు. వీనిని భ్రమింగుటకు ఎవరిచేతనుగాదు. నీవు నీ తలిదండ్రుల సామాన్య మానవులని పొరబడుచున్నావు. మానవాతీతులు, దేవతాస్వరూపులు, త్రికాలవేదులు వారిని నమ్మి తరింపుము. సిద్దుడూ పోయెదను.

శిద్ద :- తల్లీ! మా పోతులూరయ్యను ఒక కంట కనిపెట్టి వుండుమమ్మా.

పోతు :- ఒరేయ్ వూరకోరా. చెప్పవద్దురా.

శిద్ద :- నమస్కారము తల్లీ, శ్రమయిచ్చినందులకు క్షమింపుము. (అని నమస్కరించును.)

పోలేరమ్మ :- మనోవాంఛాఫల సిద్ధిరస్తు. (అని ఆశీర్వదించిపోవును.)

శిద్ద :- పోతులూరయ్యా! గురుదేవుని మహామహిమ తెలిసినదా. -

రాత్రివేళ ముసుకు వేసుకొని ముద్దియలతో ముచ్చట్లు పడ డానికి, నన్ను మోసముచేసిపోతివా, పోలేరమ్మకు చెప్పుతా.

పోతు :- ఏమని సిద్దయ్యా?

శిద్ద :- అమ్మా. తల్లీ! పోతులూరయ్య ఏ గుడిసెలో వున్నాడో ఆ గుడిసె వాకిలి మూసి ...

పోతు :- మూసి,

శిద్ద :- సిలుకు పెట్టి ...

పోతు :- సిలుకు పెట్టి

శిద్ద :- అగ్గిపెట్టమని చెప్పుతా.

పోతు :- అన్నా! వద్దు వద్దు. నీకు పుణ్యముంటుంది.

శిద్ద :- ఒరే పోయి, అన్న వరకు వచ్చినదా? అమ్మా నాన్నకు చెడ్డ పేరు తెచ్చే కొడుకులు ఉండి ఫలములేదన్నారయా.

పోతు :- సిద్దయ్యా! ఆ పని చేయకు. నాకొరకై వాళ్లు తల్లులు, పిల్లలు చచ్చిపోతారు పాపము.

శిద్ద :- అద్దీడారి. చాకి సంతరించిన తలిదండ్రులు దుఃఖించుచుండుట పాపముగాదా. - పుత్రులు, పుత్రికలు, మంచివారై పని పాటలందు ప్రవీణులై మంచిపేరు గడించిన, తలిదండ్రులు సంతోషించెదరు, లేదా దుఃఖించెదరు. ఆ దుఃఖముతో మరు జన్మకు అమ్మా నాన్న లేక విలపించెదరు. జాగ్రత - నాన్న గారు, నేనడుగు ప్రశ్నలకు సమాధానమిచ్చెదనని చెప్పినారు. వింటివు. రా పోదము. - (అని పోవుదురు. అంతవరకు ప్రక్కన వినుచున్న గోవిందమ్మ చాలాసంతోషముతో లోపల పోవును )

( తెర వాలును. )

పంచమాంకము — సమాప్తము.

## షష్ఠాంకము — ప్రథమ రంగము.

శిద్దయ్య, వీరబ్రహ్మము వత్తురు. ఒక చెట్టుక్రింద బ్రహ్మము కూరుచొన బోవును. అది గ్రహించి శిద్దయ్య తనమీది పంచను పరచును. బ్రహ్మము కూర్చొని, శిద్దయ్యను కూర్చొమ్మని సైగచేయును బలాత్కారముగా శిద్దయ్య కూర్చొనును.

వీ :- వత్సా! నీవు బ్రహ్మచారివి. బ్రహ్మచర్యముతో దైవశక్తి నార్జింపవలయునన్నను, మోక్షసామ్రాజ్యము పొందవలయునన్నను మహాకష్టము. - మైథున నిద్రాహారములు సర్వజీవులకు నైజముగా పుట్టబడినవి అనైజముగా చంపనలవిగావు. పరిపక్వబుద్ధులే వీటిని చంపగలరు. ఈ కామసాగరమున నుద్భవించు కోరికా తరంగముల తాకిడిని సహించి, ముందుకు ఈదవలయునన్న సామాన్యుల కలవిగాదు. ముందు జన్మముననే పరిపక్వబుద్ధులై యుండవలయును. - అట్టివారికిది సులభోపాయము. ఏల ప్రకృతికెదురీది బాధనొందెదవు? అందరివలెనే కుటుంబికుడవై సుఖించు సుఖదుఃఖములకు లొంగక న్యాయజీవనముచేసి తరింపరాద.

తే॥ పూర్వమొనరించినట్టియా పుణ్యఫలము
ధనమొ, విద్యయొ పిత్రార్జితంబొ నొసగి
అమిత సౌఖ్యంబులఁ గూర్చుననగ వినవె
పుట్టినందుకు సౌఖ్యముల్ పొందవలదె.

శిద్ద :- వద్దు గురుదేవ, వద్దు వద్దు. చూచినతోడనే లోకానుభవము గడించితిని - కామమునాపలేక, వెతకి వెతకి ఇల్లాలిని తెచ్చుకొన్న ఊరకుండునా, మోయరానంతమందిని సృష్టిచేసి విడచును. - ఆ సృష్టిలో బుద్ధిహీనులు, అంగహీనులు, దురదృష్టులు ఎందరో పుట్టుచుందురు. వారినందరిని చాకుటకు ఒక చింత. - ఇట్టివారైరేయని ఒక దుఃఖము. - దానితో కుములుచు, దుఃఖించుచు జగద్రక్షకుని మాటయే మరచి, మతి

హీనమై పోవును. - ఈ సంసారమంతటిని సాకుటకు న్యాయార్జన చాలక, అన్యాయార్జనకు దిగి పాపము మూట గట్టవలసి వచ్చును. ఆ మూట ఇంతై, మరింతై, కొండంతయై పెరిగి మరుజన్మకు పశు పక్షి క్రిమి కీటకాదులలో జనింపచేయును. కామమొక్కదానిని జయించిన కష్టములన్నియు తొలగునని గ్రహించితిని.

తే॥ కాంత కష్టంబులకు మూలకారణంబు
కాంతవల్లను వచ్చెడి కష్టచయము
కామమును చంపెనేనియు కలుగబోదు
తెలుసుకొంటిని మర్మంబు వసుధుతండ్రి.

గురుదేవా! ఇహమును జయించి, పరమపథమును జేర తమ పాదము లాశ్రయించితిని నాకు జ్ఞానోదయమొసంగి కాపాడుము.

వీ :- వత్సా!

తే॥ శిరిని, స్త్రీని జయించుట జేయమయ్య
మౌనులెందరో చెసినది గానపడద
రాజయోగంబులోననే బ్రతుకరాద
మోయరానట్టి బరువేల మోతువయ్య.

ఎందరో మహానీయులు స్త్రీలకు, శిరులకు దాసులై పోయిరని వినలేదా, కనలేద వక వేళ శిరిని జయించవచ్చుగాని స్త్రీని జయించుట మహాకష్టము.

ఆ॥ అండలేని జన్మముండరాదని బ్రహ్మ
పట్టుపట్టి బ్రహ్మ గట్టుకొనడె
ఆలు లేకయున్న నగచాట్లపాలని
నాదిదేవులిద్దరాండ్ర గొనరె

ఆ॥ ఆలికన్న నాప్తు లరయంగనుండిరా
సురతసుఖముకన్న సుఖముగలద
దైవనిర్మితమును తప్పని త్రోతువ
తెలియకడుగుచుంటి తెలుపు వత్సా.

శిష్య :- గురుదేవా! తామడిగిన. చెప్పునంతటివాడను గాను. తమ దయాంతఃకరణ గలిగిన ఆ కామదేవతను జయించి, ముక్తి కాంతను చేపట్టుదును. అదంటుండనిమ్ము ఒక్క సందేహాము. ఈ జన్మ పోయిన, ఇక జన్మలేదని వాదింతురు. పాపపుణ్యాము లనెడి పల్కులు కల్లలందురు.

ఆ॥ పాపపుణ్యామనెడి పల్కులే కల్లలు
పుట్టుకన్నమాట వట్టిమాట
చేతగానివారు చేయగూడదటండ్రు
చేతనైనవన్ని చేయవచ్చు

అని అనుచున్నారు. వినుచున్నాను. తామేమనియెదరు.

పీ :- నాయనా! తెలియనివారు తెలియనట్లుండక, తెలిసినట్లు వర్తించిన తప్పక ప్రమాదము సంభవించునని ఆర్యోక్తి గలదు. అయినా వినుము.

కం॥ లోకుల సుఖముల గనుగొని
వ్యాకులపడి వారిజేరు వైనముకోరక నీ
శోకము నణ తపియించెడి
లోకులె ముందిట్లటన్న లోకులు వత్సా!

కం॥ ఉన్నది జీవికి పుట్టుక
యున్నది సుఖదుఃఖములుగ నున్నవి రెండై.
యున్నవి లేవని దలచిన
యన్నలె దరిదాపులేని యన్నలు వత్సా!

శిష్య :- గురుదేవ! ముందు జన్మమున పాపపుణ్యామనక, దేవుడు దైవ మనక, దానము ధర్మమనక, వావివరుసలనక, పెద్దచిన్నలనక, మంచి చెడ్డలనక, నీతి నియమములనక సంచరించినవారు వీరే నందురా? వీరి పుట్టుకకిదే కారణమందురా? సందేహాము స్వామి.

పీ :- ఔను. సందేహామె. తెలిసికొనిన సందేహానివర్తి కాగలదు. ఇటు విను.

సీ॥ ధనికుడై యొక్కడు, నిర్ధనికుడై యొకడు
పుట్టిరే వారెట్లు పుట్టినారు
జ్ఞానియై యొక్కడు, నజ్ఞానియై యొకడు
పుట్టిరే వారెట్లు పుట్టినారు
ప్రభువుగా నొకడు, సేవకుడుగా నొక్కడు
పుట్టిరే వారెట్లు పుట్టినారు
భోగిగా నొకడు, వేఱభోగిగా నొక్కడు
పుట్టిరే వారెట్లు పుట్టినారు.

తే॥ పుట్టి గిట్టుచు, గిట్టుచు పుట్టుచుండు
వారలెవ్వరు, నెచ్చటివారు వారు
జ్ఞానదృష్టిని చూచిన గానబడద,
గానబడకున్న చెప్పెడి ఘనులు లేర.

శిద్ద :- గురుదేవ! సందేహము. - పాప పుణ్యములనుభవించు లోక మిదేనందుర. యమలోకమున శిక్షింతురందురే.

వీ :- ఔను. తప్పునకు శిక్ష విధించుటక్కడ, ననుభవించుటిక్కడ. జీవుడు తనువు విడచి అక్కడ చేరినవేళకే, వారు పాపపుణ్యముల గ్రహించి, దానికితగ్గ శిక్షవిధించి, ఏ పాపమునకు, ఏ పుణ్యమునకు, ఏ జీవులై పుట్టవలయునో ఆ జీవులుగా పుట్టింతురు. ఆ పాపపుణ్యఫలములు బుద్ధినంటియుండి, సుఖదుఃఖముల గల్పించుచుండును. బుద్ధిః కర్మానుసారిణి అను నార్యోక్తి యున్నది. బుద్ధి ప్రతి జీవిని ఆడించుచుండును నాయనా.

ఆ॥ కర్మనంటి తిరుగు కలకాలము బుద్ధి
బుద్ధినంటి తిరుగబోదు కర్మ
బుద్ధి యట్లో యట్లు బోధించు యోచించు
దాని త్రిప్పనౌనె ధాతకైన.

వత్సా! పుణ్యము అదృష్టముగ, పాపము దురదృష్టముగ మారి, ఆయా సమయములకు నీకు తెలియకనే వచ్చుచు పోవుచునుండును. ఈ పాపపుణ్య ఫలముల గ్రహించునవి, గ్రహించినవి,

ఇచ్చునవి దైవస్వరూపములైన గ్రహమండలములని యెరుం గుము.

కం॥ పాపము, పుణ్యము రెండును
మాపయి పోయెకివిగావు, మన వెన్వెంటన్
ఆపయి వచ్చెడి జన్మకు
గాపయి ఫలములను గుడుపు, గనుమా వత్సా.

శిష్య:- గురుదేవ! అయిన నిర్ధనికులు, నిరక్షరకుక్షులు, రోగగ్రస్తులు కుంటి, కురూపి, గుడ్డి, మూగి మొదలగువారు పూర్వజన్మ పాపులందురా?

వి:- వత్సా! పూర్వదత్తేషు యద్ధనం - పూర్వదత్తేషు యద్విద్యా - పూర్వదత్తేషు భార్య - అన్నారు. పూర్వదత్తము కానిదేదియు లేదు ఇది వేదవాక్యము. పూర్వము నీవు ఏది సంపాదించితివో అది ఇప్పుడనుభవించుచు, ఇప్పుడుచేసినది మరుజన్మకనుభవింతువు. - మరుజన్మమున్నదని, ఆ జన్మలో సుఖపడవలయునని ఆశ గలిగినవారు నీతినియమములకు, ధర్మమునకు కట్టుబడి, ముందుచేసినది అనుభవించుచు, దాన ధర్మములు, దైవపూజలు చేయుచుందురు. - కొందరుచేసిన పాపమునకు మరింత పాపమొనర్చి, దైవమును ధర్మమును మరచి, శుద్ధపాపులై, పశు పక్షి క్రిమి కీటకాదులందు జనించుచుందురు. ఇది సృష్టియొక్క నడక, నైజము.

శిష్య:- గురుదేవ! సందేహము. ధనికులుగా కొందరు, విద్యాధికులుగా కొందరు, దేహసౌష్టవముతో కొందరు ఉన్నారుగాని, ధనము, విద్య, అంగసౌష్టవము మూడు గలిగినవారరుదుగా గన్పట్టుచుండిరి. కారణమేమందురు?

వి:- వత్సా! ముందుజన్మమున ధనము కొరతగలిగినవారు ధనము కావలయునని, నిరక్షరకుక్షులు విద్యకావలయునని, అంగసౌష్టవము, దేహబలము లేనివారు అంగసౌష్టవము, దేహబలము

కావలయునని కోరిరేగాని, త్రివిధశక్తులను కోరలేదు. అందు వల్ల ఇటులైరి. త్రివిధశక్తులు లేకున్న, మానవాశయములు పండవని తెలియరైరి. లక్ష్మీనారాయణులవల్ల ధనము, వాణీబ్రహ్మలవల్ల విద్యాజ్ఞానములు, పార్వతీపరమేశ్వరులవల్ల దేహ సౌష్టవము గలుగుచుండునని భేదభావములేక త్రిదేవుల, త్రిమూర్తుల సేవించినవారికి, త్రివిధశక్తులు గలుగును. దేనిని తలంపరో, ద్వేషింతురో అది లోపించునని యెరుంగుము. - మరలా లేనిదానికై చింతింప ప్రారంభింతురు. మూడుశక్తులు గలవారే సౌఖ్యపురుషులు.

చం॥ కొలువక యే త్రిమూర్తులను కోల్పకభక్తిని నాత్రిదేవుల౯
కలుగునె విద్యయు౯ శిరియు కాంచన సన్నిభమైన దేహము౯
తలచినవానికే యొసగు దైవమటంచని నమ్మబోక తా
చులకనగా గ్రహించుటకు చూచును మానవుడెంత వెఱ్ఱియో.

శిష్య :- గురుదేవ! మరొక సందేహము. త్రివిధశక్తుల చేకూర్చుకొనుటకు పాపములు రానియ్యక, అరికట్టుకొనుటకు మార్గమెద్ది యనెదరు?

వీ :- వత్సా!

ఆ॥ దైవభక్తియొకటి దానంబునొక్కటి
మార్గదర్శకంబు మానవులకు
వేరుత్రోవలెందు వెతకిన౯ గనరావు
వేదమార్గమిదియె వెతకిచూడ,

భక్తిశ్రద్ధలతో ఒకపూటనైన దైవమును ధ్యానించుట, పూజించుట ఒకటి. - తనకున్నదానిలో యింతో అంతో దానము చేయుట, పాపములకు లొంగరాదని పట్టుపట్టుట. యిదియే మానవులకు మార్గదర్శకము.

శిష్య :- గురుదేవ! సందేహము?

చం॥ చంపిన పాపకర్మములు చచ్చునె, చంపగ త్రోవలున్న వే
కొంపలముంచు - నెట్టి ఘనకోవిదునైనను త్రాడుదెంచు - బల్
నింపును తెంపుగల్గు ధరణీశ్వరునొంచు - గలంచు ద్రుంచునీ
తెంపరి కాలదన్ని, కడతేరెడు మార్గము తెల్పు సద్గురూ.

పి :- వత్సా! ఉన్నది లేకేమి.

సీ॥ ధర్మతత్పరతను దైవంబు మాపొద్దు
కొలుచుచుండిన నిది తొలగుకొంత
దానధర్మంబుల తనకున్న దానిలో
నిచ్చుచుండిన నిది చచ్చుకొంత
దేవతా సేవల దేహశక్తి కొలంది
చేయుచుండిన నిది చెడునుకొంత
నిత్యమై నైవేద్యంబు నియమంబుతోడను
హరికియ్యగా నిది విరగుకొంత.

తే॥ పెంపకము చేయకను దీని చంపుచుండ
పాపమడుగంటి పుణ్యంబు పదిలమగును
పదిలమున జీవి పదిలమై పదిలమగుచు
యంది ఇహపరసుఖముల నందుకొనును.

శిష్య :- గురుదేవ! చిత్తశుద్ధిలేని శివపూజలవి యేలనన్నారు. చిత్త
శుద్ధి గలుగుటకు మార్గమెద్ది?

తే॥ మనసు పరిపక్వమౌటకు మార్గమెద్ది
ఎట్టి నియమంబులకా చెయిబట్టవలయు
ఎన్నియో త్రోవలున్నవి యేదిత్రోవ
తెలియచెప్పుము గురువర తెలుసుకొందు

పి :- నాయనా, చిత్తము. ఊరకే శుద్ధిచెందదు. శిద్ధిచెందదు. ముం
దెన్ని జన్మలనో దైవధ్యానముచేసినవాడుగా నుండవలయును.
ఒక్క జన్మలో చిత్తశుద్ధిగలుగుట మహాకష్టము. - చిత్తశుద్ధి

కుదిరినను, స్వప్నావస్థలో పరదారా పరధనముల తృణప్రాయముగచూచినను క్షణములో భగవంతుని చూడవచ్చును. శాపానుగ్రహశక్తి గలుగును. అణిమాద్యష్ట సిద్ధులు తాంమతటవి వచ్చును. ఇవి పరిపక్వబుద్ధికి గాక అన్యుల కలవిగాదు.

వత్సా! మనోవాక్కాయకర్మలను మూడిటిలో కాయము కూర్చొనును. వాక్కు ధ్యానము చేయును. మనస్సు పరిపరి విధముల పరుగిడినను, యేనాడో ఒకనాడు ఈ రెంటియందు ఆ వకటి చేరకపోదు.

ఆ॥ దైవభక్తియొకటి దానంబు నొక్కటి
మార్గదర్శకంబు మానవులకు
దీన చిత్తశుద్ధి మానవుండందును
చిత్తశుద్ధివల్ల చిక్కుసుఖము.

వత్సా! చిత్తము శుద్ధమౌటకు దైవభక్తియే మూలము. - మార్గము. దైవభక్తిలేక, దైవమును ఆరాధింపక చిత్తశుద్ధి దొరుకదు, చిత్తము పరిపక్వదశను చెందదు.

సిద్ద :- గురుదేవ! సందేహము. - మానవుల పుట్టుకకు మూలమేమందురు. చచ్చినవారిని యమలోకమున విచారించి, అక్కడనే శిక్షననుభవింపజేసి, పునీతునిగా నొనర్చి ఆ పుణ్యలోకములందే చోటొసంగుదురనే మతములన్న వే తామేమందురు.

వీ :- వత్సా! శిక్షకు అనుభవమక్కడనే గల్పించియుండిన - ఇక్కడందరొకే విధమున సుఖదుఃఖము లనుభవించవలసి వుండును. ఒకతప్పుకు ఒకసారియే దండనానుభవము. రెండుసార్లుండదు. వారుచెప్పినట్లు ఆ లోకమున దండనానుభవముండిన, జీవుడు పునీతుడగును పునీతులీలోకమునకు రారు. ఆ పుణ్యలోకములందే నివసింతురు. - పోయెడివారందరు అచ్చటనే నిలచిన, ఈ పుట్టుచుండెడివారందరెచ్చటివారు, ఎట్లు వచ్చిరను సందేహము గలుగక మానదు.

వత్సా! ఊర్ధ్వలోకములన్నియు శుద్ధపుణ్యలోకములు. పాపులు క్షణకాలమచ్చటుండుటకు వీలులేదు. పాపమనుభవించుటకు చోటులేదు. మనమున్న భూమి సత్కర్మలకు, దుష్కర్మలకు స్థానము. కావుననే కర్మభూమి యందురు. శుద్ధపాపుల, పాపపుణ్య మిశ్రితుల ఇక్కడికి నెట్టివేయుదురు. - అక్కడ పుణ్యము చేయుటకుగాని, పాపము చేయుటకుగాని స్థానము లేదు. రెండిటికి స్థానమిచ్చటనే గలదు. శిక్ష విధించుటక్కడ, అనుభవించుటిక్కడ. ఈ అనుభవములో పూర్వపాపము పాపమునే చేయించును - పూర్వపుణ్యము పుణ్యమునే చేయించును. వీటి మధ్యలో జీవుడల్లాడుచుండును. - శాస్త్రముల, గురువుల నమ్మి - దైవధ్యానము, దానధర్మముల చేయుచు వచ్చిన వారికి పుణ్యమధికమై, పాపము నశింపయి, పుణ్యగతు లబ్బును. విరామస్థానములగు ఊర్ధ్వలోక నివాసము దొరుకును ఇదియే మోక్షము. - వత్సా! ఈ లోకమున జీవులు పుట్టుటకు, గిట్టుటకు - గిట్టుటకు, పుట్టుటకు మూలము పాపము.

ఉ॥ మూలము శుద్ధపాపమయి పుట్టుకనొందును జంతుజాలమై,
మూలము శుద్ధపుణ్యమయి పుట్టకనిల్చును నిర్జరాస్థలిన్
మూలము మిశ్రమంబునయి పుట్టును మానవరూపధారియై,
మూలము పాపకర్మములు మూలము చంపి తరింపగావలెన్.

పాపమును చంపినంతవరకు పుట్టుట గిట్టుట తప్పదు. - పాపమును చంపి శుద్ధపుణ్యుడవెప్పుడయ్యెదవో, దేవత్వము సంభవించును త్రికాలవేదివగుదువు - నాయనా. సందేహము, సందేహమని సాగదీసితివి. చాలిప్పటికి. మాధ్యాహ్నిక పూజకు వేళయైనది. పుష్పముల కోసికొనిరమ్ము. పొమ్ము.

శిష్య :- చిత్తము. గురుదేవ్! (అంటూ పోవును.)

వి :- (భూమికి చూచి) ప్రకృతీ! యీ బ్రహ్మచారి కామమును

జయించి బ్రహ్మజ్ఞానమార్జించి, మోక్షసామ్రాజ్యము పొంద వలయునని యున్నాడు. ఈతనిని పరీక్షింపుము.

(అని కమండలోదకము చల్లును. - అక్కడొక అపరూపవతి ఉద్భవించి నమస్కరించును.)

వీ :- అదుగో, పోవుచున్నాడు. పొమ్ము. పరీక్షింపుము.

( తెర వాలును. )

## షష్ఠాంకము — ద్వితీయ రంగము.

సిద్దయ్య పూలు గోయుచుండును. మాయాసుందరి పాట పాడుచు, నృత్యము చేయుచు వచ్చును. - సిద్దయ్య చూచి చూడనట్లు పూలు గోయుచుండును.

సుం :- మోహన!

శిద్ద :- ఆఁ ఆఁ. నేను మోహనుని గాను. పొరబడుచుంటివి. మదన మోహనుడో, రామమోహనుడో లేక కృష్ణమోహనుడో, యెక్కడ చూచితివో పాపము. పూర్తి తలచెడి పొరబడితివి. నేను దూదేకుల సిద్దయ్యను. నాది ముడిమేల గ్రామము. బ్రహ్మముగారి శిష్యుడను. యిక్కడెక్కడనో నీ మోహను డుండును. చూడుము.

సుం :- నా మోహనుడిక్కడనే వున్నాడు. చూచుచున్నాను, గ్రుడ్డిని గాను. - మోహనా! ఈ పూ లెందుకు?

శిద్ద :- దేవతార్చనకు.

సుం :- (నవ్వి) కామ దేవతను పూజించవలసిన యుక్తవయసులో దేవతార్చనయా? యెంత వెఱ్ఱివాడవు. కామపూజ అయిపోయిన తదుపరిగదా దేవతా పూజ (అధోక్తి) మాయా దేవతలున్నవే.

శిద్ద :- ఈలోపల యమునాజ్ఞ అయితే, నీధులూక్కే పూజ రాబోవు జన్మకు వచ్చును. - అది తెలియనట్టివారి వెంతకుపోయి కులుకుము. ఏశేట ఒక బిస్తను బైటవేస్తావు. ఇక్కడ నీ పప్పుడకదు. పో.

సుం :- సిరి, స్త్రీ వచ్చెదననిన - వలదు. వలదని కాలదన్ను పురుషుడు ఈ ప్రపంచముననా ? అయ్యో రామ. ఇప్పుడు నీవేలోకమునందున్నావు ?

శిద్ద :- భూలోకమున.

సుం :- ఈ భూలోకముననా? కాదు కాదు, సత్యలోకములో మాటలాడుచున్నావు - లక్షలాది ధనము తీసుకొని, అరవైయేడుల వృద్ధయువతి నీ వెంట వచ్చెదననిన - వృద్ధాంగనేయనక, ఎగిరి గంతేయు యువకులున్న ఈ లోకమున - అపురూపవతినై, కన్నెపడుచునై సకలైశ్వర్యములతో తులతూగు నేను కోరిన - వలదను యువకులుగలరా? ఇది సందేహాము. శిగ్గా, బిడియమా. ఆడవారికుండవలసిన సిగ్గు నిన్నావరించినదియా? రామ రామ. సుందరా! శిగ్గు, బిడియమున్నవారు సౌఖ్యపడలేరు. తన కోరికలు తనలోనే పతనమై పోవును.

ఆ॥ రంభబోలు కన్య రారమ్మటని బిల్వ
వద్దు వద్దటనెడి వాడుగలడె
సరుకులేని వాడు సన్యాసియౌనని
పలుకుచుందురి ప్రజలు వాస్తవంబె.

సుందరా! అదృష్టదేవత వచ్చెదనని తలుపు తట్టుచుండ - రావద్దని, నా కడప తొక్కవద్దని వారించు వెఱ్ఱివాడుండునా? బాల్యసన్యాసము పుచ్చుకొనువాడుండునా - దారిద్ర్యముతో సన్యాసమా? సరుకులేని సన్యాసమా?

శిద్ద :- సర్వ అవయవ సౌష్టవము గలదు. యువకత్వముగలదు. సరుకు లేని సన్యాసిని గాను.

సుం :- దిక్కులేక సన్యాసమా?

శిద్ద :- కావలసినంత దిక్కు గలదు.

సుం :- పనిపాటలు చేయలేని సన్యాసమా?

శిద్ద :- పనిపాటలలో పురుషసింహమునై ప్రవర్తింతును.

సుం :- వ్యాధిగ్రస్తతో సన్యాసమా?

శిద్ద :- సంపూర్ణ ఆరోగ్యమున్నది ఎట్టికార్యమైనా చేయగల ధీమా వున్నది.

సుం :- స్త్రీల మోసముచేసి సుఖించుటకు, ప్రజల మోసముచేసి పూజలందుకొని కోరికలు తీర్చుకొనుటకు సన్యాసమా?

శిద్ద :- కావలయునన్న పెద్దలయెదుట నవయౌవనాంగిని కన్యకను వివాహమాడి సుఖింపగలనుగాని, సన్యాసివేషమున శిష్యురాండ్రను మోసముచేసి భోగించు అప్రయోజకుడనుగాను. అట్టి పాపము వడిగట్టను. - సన్యాసివేషమున ప్రజలతో పూజలందుకొని, ధనమార్జించి సుఖసంతోషము లనుభవించు నీచబుద్ది నాయందు లేదు. భుజబలము, బుద్ధిబలము దైవమిచ్చినాడు. వృత్తివిద్యతో జీవింపగలను.

సుం :- నిశ్చలమైన మనస్సుతో నిష్ఠాగరిష్ఠుడవై బ్రహ్మవిద్యను సాధించి, అణిమాద్యష్టసిద్ధులు బడసి త్రికాలవేదివై త్రిలోకముల సూక్ష్మరూపమున సంచరించుచు, ప్రజల కొందరి బాగుపరచి, కొందరికి పాపపరిహార మొనర్చి, జీవసమాధిని బొంది, బ్రహ్మకల్పమువరకుండు సన్యాసమా? లేక దీపమార్పువరకు సన్యాసమా?

శిద్ద :- అవును. ముందన్నదానినే సాధింపబూనితిని. నా గురుదేవుని అనుగ్రహముతో నూటికి తొంబది తొమ్మిదవభాగ దాటితిని. ఆ పక్కభాగ దాటునప్పుడు శనిదేవతవలె, ఇనపగజ్జల తల్లివలె నాకు దాపురించితివి. నమస్కరించెదను. సాగిపొమ్ము. (అని నమస్కరించును.)

సుం :- నిన్నుచూచిన కన్నులపండువుగ నున్నది. కోడెనాగువలె వయసు బుసకొట్టుచున్నది. నీ మాటలు, నీ మనసు చూచిన కాళుచేతులు చల్లబడుచున్నవి. సరుకులేనిసన్యాసులు నున్నగ, గుండుగ, లావుగ, పందెపు ఎద్దువలె తయారయ్యేదరన్నారు. బాగ గమనించిన సరుకులేని సన్యాసిగానే వున్నది. (నవ్వి) ఓ సరుకులేని సన్యాసి! ఇటు విను.

సీ॥ పాకశాసనుకథల్ పరికించి యెరుగవ,
మోయడే మేషాండములను విధిగ

→ అంతకన్నా అధికుడవా?

చందురునికథ నీవు చదివినదేకదా,
క్షయరోగమున నచ్చి సగముగాడె

→ అతనికన్నా మనోనిగ్రహము గలవాడవా?

పారాశరునికథల్ పరిశీలనమెకదా,
కామమూపగలేక ఘనతచెడడె

→ అతనికన్నా ముదిరి ముదిరియున్న వయస? మహాతపశ్శాలివా?

గరళకంఠునికథల్ గాలించినవెగదా,
కామాంధుడను పేరు గలుగలేదె.

→ వారికన్నా గొప్పవాడవ?

తే॥ స్త్రీల క్రీగంటిచూపులో చిత్తుగాక
బ్రతికిపోలేరు వారెట్టి వారలైన
వ్యాసమునిరీతి పుట్టించి భారతంబు
నాడదలచిన నాటకంబాడు మామా. (నవ్వును,

ఆపద్ధర్మముకొరకై వ్యాసముని ముండమోపులకు పుత్రభిక్ష పెట్టినాడు. అదే భారతము. చదువలేదా మామా?

వృద్ధ :- మా మా ... (కోపంగా) కామపిశాచమావరించినదా?

సుం :- యుక్తవయసులో అందరిని ఆవరించుపిశాచమే నన్ను ఆవరించినది. విడిపించెదవా? విడిపించమనే ప్రాధేయపడుతున్నాను. కన్నెపడుచు కన్నుగొట్టి, పైట సవరించి నీళ్ళి మామా అంటే,

మూడుకాళ్ల ముదుసలియైన కన్నుగొట్టి, కాలుదట్టి ఖణీలుమని రంకెవేసి, మీసముపై చేయివేస్తాడు. సరుకులేని వారిచెంత రంభయైన ఏమిచేయలేదు. – మైధున నిద్రాహారములులేని మానవుడుండునా? ఉండిన, అతడు పక్వబుద్ధి యనవలయును ఇది నీవల్ల నవునదిగాదు.

తే॥ సురత సుఖమునకై వచ్చి యున్నవాఁచు
మనసు నీడ్వంగ దుఃఖాబ్ధి మునిగి మునిగి
కడకు తలవాల్చు జీవుల కలిసి నీవు
సన్యసింతువ నీకేమి సన్యసింప.

తూరుపునాటి కోడెవలె నున్నగున్నావే.

శిద్ద :- ఇదుగో అమ్మాయి! ఇటు విను.

సుం :- నాపేరు అమ్మాయిగాదు, సుందరి. సుందరీ అని పిలువుము.

శిద్ద :- అట్లు పిలుచుటకు కట్టుకున్నవాడినా పెద్దవాడినా, ధర్మమెరుగని బుద్ధిలేని దద్దన్ననా? విను.

సీ॥ మతధర్మముల నెల్ల మట్టిపాల్గా జేసి,
కన్నవారలమాట కాలదన్ని,
వావిని వరుసను పతనంబు గావించి,
వంశమర్యాదల పాతిపెట్టి,
బంధుమిత్రుల ప్రీతి పైకెగ జిమ్మియు,
ననుభవజ్ఞులనుడి నడవిగలిపి,
ముందెట్టులనుమాట మొదలంటగా గాల్చి,
తోబుట్టువుల పలుకు ధూళిగల్పి.

తే॥ మోహమను భూతమునకు దాసోహమాచు
వచ్చినట్లెల్ల పరుగిడు పడతులకును
హక్కులున్నవి మాకను నతివలకును
ముందుగతులున్నవే చూడ నిందునందు

సుం :- మామా! నీతుల, నియమముల, కులముల, ధర్మముల చూచిన కోరికలడుగంటును. ఎప్పుడొచ్చునో వచ్చును ముసలితనము.

కండలుండగనే కామము తీర్చుకొనవలయును. పోయిన కాలము తిరిగిరాదు. యౌవనకాలము వ్యర్థము చేసుకొనకుము. ఇటు ననుచూడు మామా.

కం॥ చూడుము దేహసౌష్టవము
చూడుము చవి అధరసుధను - సుధతలదన్నుల్
కూడుము మన్మథకేళిని
కూడిన మరి విడువలేవు కూడుము మామా.

శిద్ద :- ఛీ! బుద్ధిలేని పీనుగ. - కన్యాత్వము కన్నవారిపాలుజేసి, కావలసినన్ని భ్రూణహత్యలొనర్చి, కల్యాణముకొరకు ఎదురుచూచు భ్రష్టువు నీవు. - ఇప్పుడుగాదు నీకు తెలియునది. - రాబోవుజన్మకు నలుగురైదుగురి బిడ్డల పుట్టించి, సారము సాని కొంపచేర్చిన యువకుడు దొరికి, - నలుగోడలమధ్య నిన్నిడ్చి, నానావ్యసనముల మరగి నిన్ను కుక్కను చూచినట్లు చూచినప్పుడు - జీవితము తలంచుకొని కుళ్ళి కుళ్ళి యేడ్చునపుడు, కంటినీరు కడవడు కార్చునపుడు తెలియును. ఈ కండబలములో, కండ్లకావరములో తెలియునా, పో.

సుం :- మామా! యీ జన్మతో జన్మము లేదనువారు. ఈ ప్రాణవాయువు అనంతవాయువులో లీనమైపోవును గాని, పుట్టు కెక్కడిదనువారు ఏమనుభవించినా ఈ జన్మలో, ఈ యుక్త వయసులో ననుభవించవలయుననువారు గలరు. వారిలో నే నొక్కతె ననుకొనుము. నా ముక్కువదీర్చి పుణ్యము గట్టు కొనుము. నాకు పాపమువచ్చిన రానీ నీకు పుణ్యముండును గదా.

శిద్ద :- నీవు ధర్మరహితవు. నీకు పాపపుణ్య విచక్షణ జ్ఞానమెక్కడిది.

సీ॥ కనిపెంచి యెన్నెన్నొ కష్టాలకోర్చిన
తల్లిదండ్రులమాట దలపబోక,
మాచెల్లెలని యెంతో మమతతో పెంచిన
జ్యేష్ఠుల మదిలోన చేర్చబోక,

తండ్రివంకన మరి తల్లివంకన గల్గు
వారి గౌరవము కాపాడబోక,
వంశవారిగవచ్చు వంశ మర్యాదల
సూటిగా పాటించి చూడబోక.

తే॥ కన్య యధికారియౌనని కావరమున
వారియాశల కాల్దన్ని వారివిడచి
ధర్మరహితంబునౌ పెడదారిబట్టి
నడచు నీకేటి పాపపుణ్యములు చూడ.

సుం :- మామా! పొరబడి పండువంటి సుఖము పాడు చేసుకొను చున్నావు.

ఉ॥ పాపములేదు పుణ్యమను పల్కులు కల్లలు కల్పనల్ గనఁ
ఆపయి జన్మమున్నదను నయ్యలమాటలు బూటకంబు మీ
దేవనిచేతగాక తమకెచ్చట తోవ యొకింతలేక యీ
పాపము పుణ్యమఁ గొలుసు పట్టితగిల్చిరి నీతిబాహ్యులై.

సిద్ధ :- ముందిట్లన్నవారే ఇప్పుడు (వీధులూడ్చువారు) కాయకష్టము చేసి, తిండికి బట్టకు చాలక పలుబాధలొందుచు కన్నీరుబెట్టు కటిక దారిద్ర్యులు, అంగహీనులు ఆనాడట్లానర్చి, ఈనాడు

కం॥ లోకుల సుఖముల గనుగొని
వ్యాకులపడి వారిజేరు వైనముకొరకుఁ
శోకమునఁ తపియించెడి
లోకులె ముందిట్లటన్న లోకులు ధాత్రిఁ.

పాపము లేదు, దేవుడు లేడు సత్యము లేదు, ధర్మము లేదని సంచరించిన జీవులే ప్రకృతము జ్ఞానహీనులై, ధన హీనులై, ఆరోగ్య హీనులై దేహబలములేక దుఃఖించు చున్నారు కానరాలేదా? - ఔను, ఈ వయసులో ధనమదాంధత్వము దాపురించిన నీకు కానవత్తురా? కానరారు. రారు. పుణ్యము పటాపంచలై, పాపము దాపురించినప్పుడుగదా - లోకము, లోకులు గన్పడుదురు.

కం॥ ఉన్నది జీవికి పుట్టుక
యున్నది సుఖదుఃఖములుగ నున్నవి రెండై,
యున్నవి లేవని దలచిన
యన్నకె దరిదాపులేని యన్నలు ధాత్రిన్.

సుం :- మామా.

శిద్ధ :- ఛీ. బుద్ధిలేనిమాట.

సుం :- కానీలే మామ. ఒక్కమాట సాంగముగా విను.

తే॥ కంఠపర్యంతముల్ మెక్కి, కంటినిండ
నిదురపోయెదు నీవేడ నిలుచుటేడ,
బ్రహ్మలోకాన నుండిన పరమ మునులె
కాంతలకు దాసులైరట్టి కథలు వినవె.

ఇంక కొంచము విను ...

ఉ॥ నీరమ్ముగ్రోలి ప్రాణముల నిల్పినయట్టి మహానుభావులన్
బారెడుగోచులన్ తడిపి భద్రముగాబిగియించు మౌనులన్
వారిజగంధులన్ గనియు, పైబడి చేతులుమోడ్చి వేడరే
వారినిమించు పూరుషుడవా, సురతేచ్ఛనుగెల్చి నిల్వగన్.

తేరకువచ్చు శిరిని, ఊరకవచ్చు స్త్రీని వలదనువాడు వెఱ్ఱివాడు. జంటకుదిరినదనుక వెఱ్ఱికుదరదు మామా. నామాట విని వెఱ్ఱికుదిరించుకో.

శిద్ధ :- నాకుపట్టిన వెఱ్ఱిని బాగుపరచువాడు నా గురుదేవుడొక్కడే. బాగుపరచిన ఆ మహనీయుడే బాగుపరచవలయును. వేరొకరి వల్లగాదు. నీకుపట్టిన పిచ్చిని విడిపింప కోట్లకొలది యువకులున్నారు వారి నాశ్రయించు వెఱ్ఱి కుదురుతుంది; పిచ్చి వదలుతుంది. కన్నుగొట్టితేచాలు. కాలుదట్టగలరు. పొమ్ము.

సుం :- మామా! తాను వలచినవాడు దొమ్మరైనను, కుమ్మరైనను, లోకదిమ్మరైనను సరే. - వలవనివాడు మారసమానుడైన

మనసు వప్పుకొనదు. పరోపకార మొనర్చి పుణ్యము గట్టు కొనుము. రా.

శిద్ద :- శివ శివా. (చెవులు మూసుకొనును.)

సుం :- శివునికి ఒక ఇల్లాలు, ఒక చుట్టము. ఇల్లాలు దేహములో కలిసిపోయినది. చుట్టము తలకెక్కినది నీవలెనా, తేరకొచ్చినా వూరకుండను.

శిద్ద :- హరి హరీ. ఈ దినమెంత దుర్దినము.

సుం :- ఆ శ్రీహరికి యిద్దరు పెళ్లాలు. ఒకామెను ఎదరొమ్ముననే ఉంచుకొని నిరంతరము కౌగలించుకొనుచునేవున్నాడు మరొకామెను ప్రక్కనే వుంచుకొన్నాడు నీవలె ఊరకొచ్చినా, తేరకొచ్చినా ఊరుకొనలేదు. ఉబ్బకేసి ఉతికేసినాడు.

ఆ॥ అండలేక పురుషుడుండరాదని వార
లిద్దరాండ్రగొనిరి; ముద్దులాడ,
ముద్దులాడమన్న మొద్దురాచిప్పవై
మూతి ముడుచుకొనుచు, మూల్గెదీవు.

శిద్ద :- ఛీ, ఛీ. ఆడదానివేగావు నీవు వేళ అతిక్రమించుచున్నది నాకు. ఇక పోయిదా. (అని పోబోవును.)

సుం :- మామా, మామా! ఒక్కమాట.

కం॥ ఉండగవలె మగవానికి

[శిద్ద :- ఛీ. బుద్ధిలేదు. ... సుం :- అట్లగాదుమామా.]

వండను వండినది తెచ్చి వడ్డింపంగా
పండిన పాదము లొత్తను
నుంశినగా సౌఖ్యమబ్బుచుండును మామా.

శిద్ద :- ఇదిగో, ముందువెనుకలు గమనించక కదము త్రొక్కుచున్నావు. పాడైపోయెదవు. జాగ్రత వహించి పొమ్ము.

కం॥ నడవడికను విడనాడియు
కుడువగరానట్టి కూడు కుడిచిన మగువే
కడు నిడుములకును గురియై
కుడువగ కట్టంగలేని కులట ధరిత్రిన్.

సుం :- మామా! అది అటుండనీ. - గురువనగా గురుతు చూపించు వారు, తెలియని విషయముల తెలియచెప్పువారు. - ఉపాధ్యాయులు మంత్రోపదేశము చేయువారుగదా?

శెద్ద :- ఔను.

* కందార్థము *

సుం :- గురువరుని గురుతుకన్నను
గురుతును నేచూపుదాన - గుమ్మైపోవన్.
గురుతును గన తలతిరుగును
గురుతును చూపింతుచూడు - గుమ్మైపోవన్.
నిరతంబు మదిలో గురుతే గన్పడును.

నరులు సురలు మునులు ఘనులు
సరసిజాసన హరిహరాదులు
పరమప్రీతిగ చూచుగురుతు
నిరతమును చూపింతుచూడు - గుమ్మైపోవన్.
నీమనసు మామా గుమ్మైపోవన్.

గురుతునే నీయబ్బ చూడగ
గురుతులో నీతండ్రి దిగిరాను
గురుతు కనులను చూడవేని
కొరివిబెట్టెడి వారురారు
గురుతును చూడు
చూపింతు నేను గురుతును చూడు.

గురువుగారి గురుతు ఊర్ధ్వలోకముల చూపును. నా గురుతు అధోలోకమును చూపును. అది కష్టము. ఇది సులభము.

యోగులు, భోగులు, రోగులు, విరాగులు, త్యాగులు ఈ అధోలోకము చూడ అభిలాషపడుతున్నారు. బ్రహ్మచారి! నీ వెక్కడ పోయెదవు. ఆ ఊర్ధ్వలోకములకా? - అచ్చోఁ సోమ పానము మినహా, మరేమీ అక్కడ లేదన్నారు. ఇక్కడ మహత్తైన మధ్యపానమున్నది, షడ్రసోపేతమైన భోజనములున్నవి. రంభనుతలదన్ను లావణ్యవతులున్నారు, సుఖపడవలయునన్న యీ లోకముననే సుఖపడవలెను - ముక్కోటి దేవతలు పిపీకెడు కూటికై పైనుండి దిగివచ్చుచున్నారు. ఈ సన్యాసులంతా ఎగబారుతున్నారు. - గమనించుకో. వచ్చిన అదృష్ట దేవతను వడిలో వుంచుకో.

శిద్ద :- ఈ పిశాచి ఈనాడెట్లు దాపురించెనో, విడిచిపోవునట్లు లేదే. ఏమి చేయవలయును?

సుం :- ఆ॥ అలికన్న నాప్తు లరయంగనుండిరా
సురతసుఖముకన్న సుఖముగలద
దైవనిర్మితమును తప్పనియందువా
తెలియకడుగుచుంటి తెలుపు మామా.

శిద్ద :- సురతసుఖమునకయి నిన్ను గట్టుకొన్న, వంశమరియాదలన్నిః మసిపాతయౌను.

తే॥ విడియముఁ సిగ్గు లజ్జయు విడచిమూడు
పట్టుదలయున్న చెలువను గట్టుకొన్న
వానికిక్కడె యమపురి గానవచ్చు
వంశమర్యాదలుఁ చేరు వల్లకాడు.

ఛీ. నీదొక బ్రతుక? పో. చాల సేపయినది.

సుం :- స్త్రీలకుండవలసిన లక్షణములన్నీ నిన్ను చేరినవి. పురుషుల కుండవలసిన లక్షణములన్నీ నన్నావరించినవి. ఎవరికుండవలసిన లక్షణాలు వారికుంశిన, కథ ఈవేళకే ముగిసిపోయి కుదుట పడియుండును.

శిద్ద :- శిగ్గు బిడియములేక బ్రతిమాలుతుంది ఇవి స్త్రీ లక్షణాలు గావు శంకినీ లక్షణాలు. ఛు. ఛు.

సుం :- ఓ సరుకులేని సన్యాసి మామా !

తే॥ తారబ్రతిమాలదే చంద్రు తప్పటనక
శిష్యుడనక, పాపమనక, శిగ్గులేక
సాధనంబున సాధించి సౌఖ్యపడదె
తార బ్రతిమాల, నేనెంతదాన మామా.

శిష్యుడే యనక, చిన్నవాడే యనక, కులగౌరవము తలంపక, తన భర్తృగౌరవప్రతిష్ఠల లెక్కింపక కుమారసమానుడైన చంద్రునితో సుఖింపలేద?

శిద్ద - ఉదాహరణకు దిగితివా, ఈ చంద్రుడు పుట్టకమునుపు ఖగోళము లేదా? నవగ్రహములలో చంద్రుడు లేడా? - దేవత లందరు నిర్జరులయిన దేవతా గురువు ముసలివాడెట్లయ్యెను. తార వ్యభిచారియైన పంచకన్యలందెట్లు చేర్చిరి. దుర్మార్గుడైన చంద్రుని శివుడెట్లు శిరమునందుంచుకొనెను. పాలసముద్రమున పుట్టిన లక్ష్మి చంద్రునికి సహోదరి యెట్లయ్యెను. పుక్కిటి పురాణములు ప్రమాణగ్రంథములగుననియు, అసత్యముల సత్యములుగా నిరూపించి వ్రాయుకవులు పుట్టుదురనియు. కొంత కాలమున-కవి ప్రమాణ గ్రంథములగుననియు. గురుదేవుడు తెలుపుచున్నాడు. - ప్రజలు నమ్మక సారస్వతమే తప్పని పలుకుదురనియు తెలిపియున్నాడు - ఇది కలికాల మహిమ.

సుం :- నీవు నాకు శిష్యుడవా? నే నీకు గురువునా? - నీవు నాకు గురుడవా? నే నీకు శిష్యురాలనా? లేదు గద. - కట్టుకో, లేక పెట్టుకో. కట్టుకొనక, పెట్టుకొనకపోయిన పట్టుకొనెనని రచ్చకీడ్పించి, పదిమందిలో పరాభవింప చేసెదను. భద్రము సుమా. ఇది బ్రహ్మాస్త్రము.

శిద్ద :- అందనుక వచ్చి అస్త్రముల ప్రయోగించెదవ?

సుం :- ఔను. వచ్చెదను; ఇంకా ముందుకొచ్చెదను. నీ వెక్కడ పోయిన అక్కడికంతా వచ్చెదను - గురునివద్దకు పోయెదవా, వెంటనేవచ్చి నమస్కరించి; స్వామి వీరబ్రహ్మముగారు! మీ శిష్యునికథ కొంచము వినండి. - ఇక్కడ మీకు నమ్మకమైన శిష్యుడు. అక్కడ నన్ను నమ్మించి గాంధర్వ వివాహమాడిన భర్త నేను గర్భమైనానని విని, ఇది పదుగురకు తెలిసిన అవ మానమని, మీదగ్గర విలువతగ్గునని, తాము సహించరని, నను విడతు ననుచున్నాడు - ధర్మమేమో చూడండీ అని విన్న వించుకొని, నాజోకుగా ఒక యేడుపు యేడ్చి, గురుః శిష్యుల నమ్మకము పటాపంచలుచేసి, విడదీసి, నీపైసి తీసెదను. - నీ విలువ నున్నగనూరి గంగలో గలిపెదను. పా. గురువు వద్దకే పా. - వాకిలి త్రోసిన దెవ్వరనిన, ఆలులేనివాడన్న వచనము నీపై నున్నది. ఓ బ్రహచారి! బాగ గమనించు. ఇది స్త్రీల కున్న ద్వితీయాస్త్రము. నారాయణాస్త్రము. స్త్రీలు అబల లనకు.

శిద్ద :- ఓ బుద్ధిలేని పెద్దమ్మ! నా గురుదేవుడు త్రికాలవేది. ఇక్కడ నుండి ఎక్కడ జరుగుచున్నదానినైన చూడగలరు. ఇక్కడ నుండి ఎక్కడన్నదానినో వినగలరు. నీ భ్రష్టుకూతలు విని, నన్ను విడచునా? నీ కూతలు నమ్మున? అంతకు విధి బలీయ మైనప్పుడు చూతము.

సుం :- ఓ ఘోటక బ్రహ్మచారి! భీష్మించుకొని భీష్ముడవయ్యెదవ? పరకాంత పాపమని ఎగిసిపోయిన ప్రవరాఖ్యుడవయ్యెదవ? ఇదిగో, ఈలోకము విడచి పరలోకము పోయినను వెనువెం టనే వుందును. - ఆ యముని ముందు యిట్లే చెప్పుదును. - నిన్ను విడను. నామాట విను. సుఖపడు - సకలైశ్వర్యము లతో తులతూగింతును. - రంభాసంభోగము ఇక్కడే చూపిం తును. - లక్షలాది సిరిసంపదలు చేజిక్కింతును. చూడు -

తే॥ రంభతలదన్ను కన్నియ లభ్యపడిన
నాకమేలను యాబ్రిహ్మాలోకమేల
మూడులోకాల నిక్కడే చూడవచ్చు
బాగ యోచించిచూడుమో బ్రహ్మచారి.

శిద్ద :- మొదటనే నేను ప్రాయశ్చిత్తము చేసివుండిన, ఇందనుక కథ పెరుగదు. పాపమని కథ పెంచితిని - అప్పుడు కాతగ్గది, ఇప్పుడు చేసెదను.

సుం :- ఏమయ్యో, నన్ను చంపెదవా? స్త్రీ హత్య చుట్టుకొని, ఏడు జన్మలకు వెన్నంటి, పెండ్లిగాని పెద్దన్నను చేసి, పెండ్లి పెండ్లి అయ్యో పెండ్లియని కలవరింపచేయును. స్త్రీల కపటాచారము ముందొనర్చినవారే సన్యాసులు, పెండ్లిగానివారు, షండులు, యుక్తవయసులో ఆలుసచ్చినవారు. మహాపూరుషా! నన్నుచంపి వారిలో కలుసుకొనెదవా? వద్దు. నన్ను తృప్తిపరచి ఊర్ధ్వలోకములకు పో.

శిద్ద :- ఊర్ధ్వలోకాలలో కాదు అధోలోకాలలో కూడ నిలువ చోటుండదు, నీడుండదు - దుష్టులకు దండనోపాయమే కావలయును. గురుదేవ్! (అని మోకరించి కూర్చొనబోవును.)

సుం :- ఇదిగిదుగో, ఒక మాట. ఇది రహస్యమైన కార్యమండీ. - గురువును పిలిచెదరు; మీగురువు నన్నుచూచిన గురుశిష్యులకే మోసము జరుగును. వారు చవిచూచినవారు. కన్నుగొట్టిన కాదనలేరు నేను కాదనలేను. - అటుపై నిన్ను విడువలేక, వారికి కాదని చెప్పలేక మధ్యచిక్కి కడకు నీకు, నీ ప్రేమమునకు నీళ్ళిడువవలసి వచ్చును.

శిద్ద :- ఛీ, నోరుమూయి. నా గురుదేవుని పేరెత్తిన స్త్రీ హత్య యనక నీ నాలుక కోసెదను.

సుం :- ఆఁ ఆఁ!

కం॥ కోపము పాపము తెచ్చును
పాపము జీవితమునెల్ల పాడొనరించుఁ
గోపము చేయక మన్మథ
తాపంబున తిట్టి కొట్టి దండించండీ.

కోపాదిరిక్తత విడచి, కామోదిరిక్తుడవై - కొట్టు, కోరుకు, నలిపి పిండి, పిప్పి చేయి. వద్దనకు, కోపగింపను రా. ఊ. - వెఱ్ఱి బ్రహ్మచారి! నీ గురునకు భార్యలేద, పిల్లలులేరా? అందరుచేయు కార్యము చేయలేద. చేయక పిల్లలు ఆకసమునుండి వూడిపడిరా, భూమినుండి పగిలివచ్చిరా? - వారివలెనే రాజయోగమవలంభించి నన్నుకట్టుకో. పిల్లా జల్లా కలిగి, ఇల్లూవాకిలి కలకలలాడుతుంది. - గురునకున్నప్పుడు, శిష్యునకుండ కూడద? సన్యాసము పూర్వజన్మ పాపఫలమున వచ్చునందురు. ఆడదిలేని యిల్లు అడవి. - మొగవాడులేని యిల్లు మఠము అన్నారు. 'అపుత్రిశ్య గతిర్నాస్తి' అన్నారు. వినలేదా. - తల కొరివిబెట్టను, ఇన్ని నీళ్లువిడువను, నీపేరుచెప్పను పుత్రుడొకడుండ పనిలేదా? - అయ్యో సన్యాసి మామా! మతికి తెచ్చుకో.

శిద్ద :- ఆఁ. (అని పోబోవును)

సుం :- ఆగు. మీ నాన్న మీ తల్లివల్ల నిన్ను పుట్టించినాడు. ఇన్ని నీళ్లు విడువగలవు. - నీవు నావల్ల నీకిన్ని నీళ్లు విడచువానిని సృష్టించుకో. నీళ్లు విడిపించుకో. - బ్రహ్మచారి గతించితే, ఒంటి బడిశతో ఎత్తుకపోయెదరు. రెండు బడిశలు గలిగించుకో. ఓ అకల్మషబ్రహ్మచారి! స్త్రీ యన నేమనుకొంటివి? దేవునికి, భక్తులకు మధ్యలో పూజారివున్నట్లు. - ఆ పైలోకాలనుండి వచ్చు జీవులకు స్త్రీ ఆదరువు. స్త్రీని ఆదరువు చేసుకొని ఈ లోకములో ప్రవేసింపవలెను. పైనుండి దుముకరు భూమినుండి పగిలిరారు. - నన్ను కట్టుకో. సంవత్సరములోపలనే ఇంకొక సిద్దయ్య ... (వస్తాడని అర్థోక్తిలో)

శిద్ద :- ఛీ. నోరుమూయి. కామాతురత్వమున కన్నుమిన్నుగానక చిందు తొక్కుతున్నావు. నీవు ఆడదానివా లేక ...

సుం .- ఆ. అచ్చము ఆడదానినండీ గాడిదనని పొరబడకుడు - తామే పురుషులగుదురా, కారా అని సందేహించుచున్నాను. ఓ సన్యాసి మామా! ఇటు విను.

ఉ॥ ఆకలి నిద్ర కామములు హాటక గర్భుని సృష్టిమూలముల్
లోకమునందు జీవులివి రోసి త్యజింపగరాని బంధముల్
నాక విభుండె జారుడయి నాతి యహల్యనుగూడి కూలడే
లోకనుతి ప్రదేమొ యిది తోయజగర్భుని మాయాశక్యమా.

→ తోయజగర్భుని మాయ. (మామయా — శిద్దయా)

శిద్ద :- ఔను. ఈ మూడిటికి లొంగనివాడే ధన్యుడు. జిహ్వోపస్థ చాపల్యముల విడచినవాడే మహాత్ముడు.

ఉ॥ ఆకలి నిద్ర కామముల హస్తగతంబుగ జట్టినన్‌గదా
లోకము దాటిపోగలుగు లోకముగల్గును మానవాళికిన్
లోకులరీతి మూడిటికి లొంగిన లోకము దాటగల్గునే
శ్రీకరమూర్తులన్ గనునె, శ్రేయముగల్గునె ముక్తియబ్బునే.

→ శ్రేయముగల్గునె మృత్యుదేవతా — కర్మదేవతా.

సుం :- ఓ బ్రహ్మచారిగారు! లోకజ్ఞానము కొంచము కొరతగా నున్నట్లున్నది. బ్రహ్మజ్ఞానము ముదిరేకొద్ది లోకజ్ఞానము మరపుతగులుతుందన్నారు. బ్రహ్మచారి! కామాతురత్వము కులము, తలము చూడదు. వావి వరుస యెంచదు. చిన్న పెద్ద గమనించదు. గౌరవా గౌరవముల తలంపదు. నీతి నియమముల లెక్కించదు. ధర్మాధర్మముల పరికింపదు. ఇది అందరికి తెలిసినదే. ఆకలి రుచి యెరుగదు. నిద్ర చోటెరుగదు. కామము (అర్ధోక్తి)

శిద్ద :- తన్నెరుగదు గదా.

సుం :- (నవ్వుతూ) ఔను. విన్నావా?

శిద్ద :- ఔను విన్నాను, కన్నాను. అట్టివారే క్షయరోగగ్రస్తులై, నిర్వీర్యులై, వృషణ వ్యాధిగ్రస్తులై, భార్యను తలంచుకొని దుఃఖించు పరమపాపులు - అట్టివారికి భార్యలై, కామ పీడితులై ఎటుపోవుటకు దారిగానక దుఃఖించు ఇల్లాండ్రు. నీకట్టి కాలము వచ్చును. తొందరవడకు.

సుం :- ఏమండీ! ఒక మాట. పరోపకారము పుణ్యమనెదరా? పాపమనెదరా?

శిద్ద :- పరోపకారమొనర్చినదే దేహమన్నారు. అంటే ...

సుం :- అంటేనా, - నేను కోరుచున్నది పరోపకారము గాదా?

శిద్ద :- ఛీ. దొంగకుచేసిన ఉపకారము, రంకులాడికిచేసిన ఉపకారము ఆ పరేతనాథుని ముందర నిలబెట్టును. పరదార, పరాన్నము, పరనింద మహాపాతకమని పలుకుచుండ విని, నా బ్రహ్మచర్యమడుగంటచేసి, నీ కామబాధనుతీర్చి. రెంటెకుఁ జెడిన రేవను కమ్మనెదవా? ఈ ధర్మపన్నాగము ఎక్కడ నేర్చుకొంటివో అక్కడకే పొమ్ము.

సుం :- ఎక్కడికిపోదునండీ! - ఉండిన నీవెంటనే ఉండవలె; పండిన నీ ప్రక్కనే పండవలె; వండిన నీయింటనే వండవలె; చచ్చిన నీ చెంతనే చావవలె - ఇది నా నిర్ణయము.

బ్రహ్మచారి మామా! ఇటు విను. కుందనపు బంగారములో వజ్రముల రాపాడిని గలిపి బొమ్మనుచేసిన ఎట్లుండునో అట్లు నీరూపు, నారూపు కలిపి ఒకరూపును తయారుచేయుదము. లోకములో వన్నెగడించును. - సత్యవతికి వృద్ధపరాశరునికి గలిగిన వ్యాసునివలె విశ్వవిఖ్యాతి గడించును. - ఏదు మీరకనే తయారుచేసి సంకకెక్కింతును. చూడు నా తడాక. యేమంటారు? (అని ముందుకు పోవును.)

శిద్ద :- అంటాను. కొంతసేపటికే అంటాను. మిడిసిపడకు. - స్త్రీలలో పురుషులుండెదరు. లింగభేదమే గాని, కార్యభేదముండదు.

కనుగలిగి బ్రతుకమన్నాడు గురుదేవుడు. - నిజమే. ఇది దుర్ది నముగా నున్నది.

షుం :- పురుషులలో స్త్రీలుండెదరు. లింగభేదమే గాని, కార్యభేద ముండదని చెప్పలేద. తెలియలేద

ఆ॥ మదన కదనమందు మారుని సరితూగు
యౌవ్వనంబు గలిగి యౌవ్వనులను
మదమడంచు శక్తి పదిలంబుగానున్న
పురుషులందు పుణ్యపురుషుడతడు.

ముందు జన్మమున నలుప్పురినైన పుత్రికలగని, కన్యాదానము చేసి, భార్య కష్టసుఖముల గమనించి, త్రిదేవుల ధ్యానించి, ఏకపత్నీవ్రతుడైన వానిని పుణ్యపురుషుడనవలయును. అతని యౌవనమే యౌవనము. పురుషుడనిన ఆతడే పురుషుడు. - పురుషుడన్నంతనే పురుషుడుగాడు. - మీరు ముందుజన్మలో కూడ సరుకులేని సన్యాసులవారేనేమో; ఆడవారినిచూచిన అదరిపడతావు, బెదరిపోతావు - అయ్యో రామ, నీవెక్కడి పురుషుడవు.

తే॥ దిట్టముగ తిని, మరి మరి తేపునీవు
స్త్రీల కేగ్రంటిచూపులో చిత్తుగాక
జారుకొందువ నీకంత శక్తికలద
తొండమున్నంత దోమ వేదండమగునే.

బ్రహ్మచర్యముతో ముక్తి సాధించలేవు. ముక్తికిగాని, భుక్తికి గాని అండదండగా ఒక స్త్రీ వుండిన కష్టముండదు - దార లేని తిండి దయ్యపు తిండిరా అన్నారు. బాగా ఆలోచించు. కావలసినంత ధనమున్నది అందాలమేడలో పట్టెమంచము, పట్టుపాన్పు వున్నది - షడ్రసోపేతమైన భోజన ఫలహారము లున్నవి. - అమృతతుల్యమగు పానీయములున్నవి, సౌందర్య సౌశీల్య సౌకుమార్య సౌభాగ్యవతి కన్నెపడుచు ఊరక తేరకు చేజిక్కుచున్నది. ఆ పట్టునువదలి, ఈ పట్టును పట్టు. అబ్బ. ఆ సౌఖ్యమునకు వేరుండదు చూడు.

శిద్ద :- సొత్తును చూపి పొత్తును గోరెదవ?

ఆ॥ ఆడవారిద్రవ్య మధమాధమంబని
పెద్దవారు బలుక విన్నవాడ
అట్టి సొత్తుతినెడి మట్టిబుఱ్ఱను గాను
సొత్తుచూపి వలను సోపెదేమొ.

అట్టివాడనుగాను. పదునాలుగువత్సరములు పోషించి, బుద్ధిని గరపి, సర్వకార్యములు నేర్పి, సుఖించి, వంశవృక్షము నిలుపు కొమ్మని కన్యకనిచ్చెదనవిన - అనుభవించినందుకు వరదక్షిణ ఏమిచ్చెదవని, వేలు లక్షలు పుచ్చుకొని, కన్నవారి నేడ్పించిన ఫలము రాబోవుజన్మకు తెలియును. అంత - ఆడపిల్లలేపుట్టి, కన్నవస్థలపాలు చేయుదురు. చేసినది చేయించకపోదు.

సుం :- ఆ॥ భోగమందకున్న యోగియై నరుడేగు
భోగమందెనేని యోగికాడు
భోగి యోగియైన పొందును స్వర్గంబు
యోగి యవనిపుట్టు యోనికొరకు.

(నవ్వి, తన రెండుచేతులతో నోరు మూసుకొనును.)

బ్రహ్మచారిమామా! జాగ్రదావస్థలో గోచినిబిగియుంచి కట్టినావు. స్వప్నావస్థలో బిగింపగలవా? ఎక్కడి మాట. - జాగ్రదావస్థలో స్వప్నావస్థలో పరాన్న, పరధన, పరదారల కాసింపనివానికి మట్టి బంగారమగును. పక్వబుద్ధి కట్టి, శక్తి గలిగియుండును నీవు వలనాటికోడెవలె మంచి తరుణములో నున్నావు. కాడికట్టి చూతమన్న కాశి క్రిందవేస్తావు. కాడి కోస కాడిక్రిందికి రానంటావు. - ఇది నీ కర్మమా, నా కర్మమా. రామ రామ.

శిద్ద - నా మనోనిగ్రహ యజ్ఞమును ధ్వంసముచేసి, పాపలోకమున కంప నెంచినది. నిజముగా నిది తాటకియే. - నా ప్రాణప్రద మగు బ్రహ్మచర్యమును హరింపనెంచినది. నిశ్చయముగా నిది ఆనాటి పూతనయే - నే పోయెడిదారికి అడ్డము వచ్చి,

ఎదిరించి నిల్చి ముందుకు పోనివ్వకున్నది తప్పకిది ఇంకిణియే - నా ఆశాలతను తెంచి, నన్నుధర్మమార్గమున దింప నెంచినది ఇది మాయాసుందరిశైయైన శూర్పణక యే - ఆ రామచంద్రునకు, కృష్ణునకు, హనుమంతునకు, లక్ష్మణునకు వచ్చినది పాపమో, పుణ్యమో అది నాకువచ్చిన రానీ, స్త్రీ హత్య యనక అంతపని చేయవలసినదే - యువకుల పాలిటి మృత్యుదేవత. ఎందరి బ్రహ్మచర్యముల బలిగొనునో, విడువరాదు.

వారు స్త్రీలలో పురుషులు, నిజమే. చంపవలసివచ్చి వారు చంపిరి. నేనట్టిదానిని గానే. - నిన్ను వలచి, వలపించుకొని, వివాహమాడి, నిన్ను సుఖపెట్టి, సుఖపడి, నీ వంశాభివృద్ధిచేసి, పుత్రునితో నీకిన్నినీళ్లు విడిపించను వచ్చినదాననే. - ఇదుగో, నన్నేమనినను స్త్రీహత్య తప్పదు. - ఓ సన్యాసిగారూ! సన్యాసము పుచ్చుకొని, ఇహసౌఖ్యాలు విడచి పరలోక సౌఖ్యాల వాసించెదరుగాని, అక్కడ సుఖదుఃఖములు లేవన్నారు. పాప పుణ్యములు లేవు. సోమపానము త్రాగి నిరంతరము వృథాగా వుండవలెనన్నారు. ఆ సోమపానములో రుచీలేదు పసిలేదు అన్నారు త్రాగివచ్చినవారు. - దానికన్నా మిన్నయినవి ఇక్కడ రెండు పానములు గలవు ఇవి అక్కడ దొరకవు. వకటి అధరపానము, రెండు మధ్యపానము. - మధ్యపాన మహిమ చెప్పెదను విను.

సీ॥ సంతోషవారిధిఁ సొంగంబుగను ముంచి,
సంగీతమున దించు శారదాంబ
వ్యాకులతను మహావ్యాధుల నెగజిమ్మి,
శక్తిని ప్రసరించు శర్వరాణి
శత్రురోగబుణంబు జ్ఞాపకంబును చంపి,
ఆనంద మొసగెడి ఆదిలక్ష్మి
పిరికిపందతనంబు దరిచేరనియ్యక.
ఘనపరాక్రమమిచ్చు కాళరాత్రి

తే॥ కామమును రేప పూవిలుకానియబ్బ
శౌర్యధైర్యంబులియ్యగా శరభునయ్య
ధర్మబుద్ధినిగలిగింప ధాతతాత
మధ్యపానములోగల మహిమమిదియే.

పెండ్లిచేసుకొని హాయిగా మధ్యపానము, అధరపానము త్రాగు చుండక, సోమపానమునకు పోతాడటమ్మ - తుంట్లు లేవ లేనివాడు తాటిచెట్టు ఎక్క ప్రయత్నించినట్లున్నది. కొండంత మగవాడు. యెందుకు?

శిద్ద :- పెండ్లి పెండ్లియని కామమాపలేక వాపోయెదవు. పెండ్లి యనిన యేమనుకొంటివి. - భర్త భార్యకు. భార్య భర్తకు పెద్దలయెదుట ప్రమాణముచేయుట,

సుం :- ఏమని ప్రమాణము? - ఈ దేహము యితరులపాలు చేయ నని, ... విధివశమున గృడ్డివైన, కుంటివైన, చెవుటివైన, ఆర్జనలేక దరిద్రుడవైన. యెట్టికష్టము లొచ్చినా రోగివైనా, కోపివైనా, శాంతముతో యెదిరించి, జీవితాంతము నిన్నే నమ్ముకొని నీకే సంసారము చేసెదను. అన్యుల నాశ్రయింపను. నీ దేహము నా దేహమువలె చూచెదను నీ తలిదండ్రుల నా తలిదండ్రులుగా, నీ సోదరిసోదరుల నా సోదరవర్గముగా చూచెదను. నీ కులగౌరవముల కాపాడెదను. కష్ట సుఖము లలో పాలుపంచుకొనెదననిగదా ప్రమాణము.

శిద్ద :- డొక్కశుద్ధి బాగానే వున్నట్లున్నదే. - ఇంత విజ్ఞానముండి, ఏల అప్రయోజకములో దిగితివి. పూర్వజన్మార్జితము భర్త. ముందుజన్మమున యెట్టివానిగా సృష్టిచేసుకొన్నానో అట్లాడి వాడు వచ్చునని, - తల్లిదండ్రులు యెట్టివానిని ఏర్పరతురో వారిమాటయే నామాటయని దైవముపై భారమువైచి, - వారిపై ఆధారపడక, బేరాసికొచ్చినావే బేరానికి. చదువు కొన్న తెలివియా యిది.

సుం :- కర్మముందు, కాంతముందు పండితుడైన పశువై పోతాడ న్నారు నిన్ను చూడగనే ...

శిద్ద :- నా కామదేవతకు వీని బలిచేతామనుకొన్నావా?

సుం :- ఏమో, మానవప్రియత్నము చేసి చూచెదమనుకొన్నాను. చేయుచున్నాను. - కార్యసిద్ధి అయినదనుక పట్టు విడువను.

శిద్ద :- కార్యసిద్ధి గాదు, దేహశుద్ధి కాగలదు.

సుం :- మూడుముళ్లువేసిన దేహశుద్ధిచేయుటకు, ఇంకా శుద్ధిచేయు టకు ...

శిద్ద :- ఛీ బుద్ధిలేని పెద్దమ్మ.

సుం :- అంతేకాదు అత్తమామల యేడ్పించి డబ్బులాగుటకు, నాపై నా ఇంటివారిపై అధికారము చలాయించుటకు అధికారము వచ్చును. ముప్పతిప్పలు పెట్టి ముచ్చెరువుల నీళ్లు త్రాపవచ్చును. పెండ్లినాడింత, శోభనము నాడింత, పిల్లపుట్టితేయింత, అప్పుగా యింత, బదులుగా యింత లాగవచ్చు. ఇవ్వలేక వారు కోప గించుకొనిన, లేదనిన - ఇదుగో, మీ పిల్ల మీ యింట్లో వుం టుంది. భద్రిముసుమా అని భయపెట్టవచ్చు. తాళికట్టండి.

శిద్ద :- అంతటి పాపపుణ్యా విచక్షణలేని పాపాత్ముడనుగాను. చేసినది చేయించుననని తెలుసుకొన్నవాడను. - విధివిశాత్ వివాహమే చేసుకొనవలసివచ్చిన అత్తమామలసొత్తు అరపైసా ఆసింపను. ఆసింపవద్దని భార్యకు చెప్పుదును. తలిదండ్రుల ఆర్జన తినవలసిన కాలము దాటినది, భర్తసంపాదించినది తినవలసివచ్చిన కాలము వచ్చినది. ఇంకేమి తెచ్చుకొన్న యిరువురము బాకీపడెదము. జాగ్రత అని మందలింతునుగాని, తెమ్మని బాధించను. రాబోవు జన్మకు బాధనొందను. - మూడుముళ్ళు వేసిన, మానవుని నియమములనెడి గిట్టలో నిలవబెట్టును. రోగివైన, ముక్కోపి వైన, కుంటివైన, కురూపివైన జీవితాంతము నిన్నూ, నీ పిల్లలను బాకెదను. - నా యౌవనబలము నీకుతప్ప యితరుల

వశము చేయను, చేయలేదు - నా యార్జనాధనము దుర్వ్యయము చేయక, నీకే అర్పించెదను. నీ వారిని నా వారిగా చూచెదను. నీ కష్టములు నా కష్టములుగా తలంతునని, పెద్దల యెదుట దైవసాక్షిగా ప్రమాణముచేసి, ఈ ప్రమాణమునకు తప్పిన యమలోకమున నిలువవలసివచ్చును. యముడు చేసిన దానిని వప్పించును. బ్రహ్మ విధించి సృష్టించును. ఆ ప్రమాణ ఫలము యిక్కడ అనుభవించవలసివచ్చును. చేయి పట్టరాదు, తాళి కట్టరాదు చేయిపట్టినా, తాళికట్టినా నియమములకు నిలువవలయును. అట్టి నియమములకు నిలిచిన స్త్రీ పురుషులే యౌవనసౌఖ్యమనుభవించుచు, అన్యోన్యులై, వృద్ధదంపతులై, పుత్రపౌత్రులతో సుఖజీవనము చేయువారు, పెండ్లినాటి ప్రమాణములకు నిలువనివారే ఈజన్మలో భార్యాభర్తలు ఒకరికొకరు సరిపోక జీవితాంతము కలహాములతో దుఃఖించుచు, యౌవన సౌఖ్యము లేకపోయెనని నిరంతరము శోకించుచు, ఒకరినొకరు దూషించుకొనుచు, తప్పుపైనతప్పు చేసి మరింత పాడుజన్మను సృష్టించుకొనువారు పూర్వజన్మ కర్మమని స్థిర మనస్కులయి యుండువారే ధన్యాత్ములు. - ప్రకృతము అట్టి పాపములు చేయనివారే పుట్టబోవు పుణ్యాత్ములు. - నీవు నీ ధర్మమగు తలిదండ్రుల ఆజ్ఞను ధిక్కరించి, వారి కష్టముల పరికింపక, వారని లెక్కింపక, ప్రప్రథమ ధర్మమే తప్పినదానివి. రెండవ ధర్మమగు పాతివ్రత్యమును పాటింతువ? కట్టుకున్నవాని గౌరవము కులగౌరవము కాపాడుదువ? సమయముదొరకిన దొంగ పశువువలె కట్లువిడిపించుకొని పారిపోయి పరుల పొలములలో మేయుటకు వెనుదీయవు - ఈనాడు ప్రేమింతువు. ఆనాడు ద్వేషింతువు. - అధర్మచిత్తవు. నిన్నునమ్మి రంగములో దిగువానికి మానముండునా, ప్రాణముండునా? వంశము, వంశ మర్యాదలడుగంటవా? బాల్యమాదిగ సాకి పెద్దచేసిన తల్లిదండ్రులనే మరచి, మధ్యలో ప్రేమవివాహము చేసుకొన్న నీవు.

నిన్ను నమ్మి వివాహము చేసుకొన్నవారు ధర్మబద్ధులయ్యెదరా? నందు దొరికిన యిట్టి ప్రేమవివాహములు నూర్లాది జరుగక మానవు కడకు వంశనాశనము నీవల్ల జరుగకమానదు. సంప్రదాయ సత్ప్రవర్తనల లెక్కింపని శంకిని జాతివి. ఛీ. నీ ముఖము చూచిన తప్పక పాపము సంభవించును. - దూరదృష్టి లేని కామాంధురాలవు. - ఇదుగో! కడసారి నా నిశ్చితాభిప్రాయమును వినుము.

ఉ॥ వీడను బ్రహ్మచర్యమును, విశ్వముగ్రుంగిన మిన్నువంగినన్
బోడువసంతునిన్ గొనియు సూనశరుండెదిరించి నిల్చినన్
తోడుగనీకు రంభనిటు తోడ్కొనివచ్చియు కండ్లుత్రిప్పినన్
పాడయిపోయినన్ తనువు పట్టినపట్టును వీడబోను నే॥ -

వీడను. ⟶ నాట్యమాడినన్ - తుంట్లుత్రిప్పినన్ - పైటత్రిప్పినన్.
(అంటూ ముందుకు వచ్చుచుండును.)

సుం :- (ఆ. అని - ఓహో. అని - తాళుకో. అని - తట్టుకో అని - హేళనగా వెనక్కు జరుగుచుండును. - ఊహూ ఆహో.)
శపథము చేయుచున్నావా? నా శపథము యిటు విను.

తే॥ తూర్పు మొలచెడి సూర్యుడు త్రోవతప్పి
పశ్చిమంబున బొడువనీ పట్టువిడను
పట్టువదలిన మానవవనితగాను
చూడుమా నాదుశపదంబు చోద్యమగును.

కం॥ ముచ్చటపడి నేనడిగిన
తుచ్ఛముగా చూచెదీవు దొరకిడ్డవలెన్
యిచ్చట పొడిచెడి సూర్యుం
డచ్చట పొడిచినను విడను నా శపథమిదే.

శిద్ధ :- అట్లనా? - ఇదుగో! బ్రహ్మాస్త్ర, నారాయణాస్త్ర, పాశుపతాస్త్రముల ప్రయోగముల తెలిపితివి ఆ అస్త్రప్రయోగముల చేయకమునుపే, నీరూపు నామక్రియలు లేకుండ చేసెదను. చూడు. - గురుదేవ (అని మోకరించి కూరుచోని)

తే॥ స్థిరమనస్సున గురుసేవ చేతునేని
కరుణనాపైన గురునకు గలుగునేని
తప్పకేనెప్డు శ్రీహరి దలతునేని
ఇపుడు ననువీడుగావుత నీపిశాచి.

(మాయాసుందరి మాయమై త్రిశూల, కిరీటధారియై వచ్చి)

ప్రకృతిమాత :- నేను ప్రకృతిమాతను నీ గురుదేవునికోరికపై వచ్చి నిన్ను పరీక్షించితిని. - సిద్ధుడు! నీవు నన్ను జయించితివి. ఇక ఈ ప్రపంచమున శిరి, స్త్రీ నిన్ను జయించలేదు. ఈ రెండిటిని జయించినవారు అణిమాద్యష్ట సిద్ధులను బడయగలరు. - తన ఉపాసనా దేవతలు తన్నాశీర్వదించి, ఇష్టకామ్యములు నొసంగుదురు. నీవు పూర్వజన్మముననే సిద్ధినొందితివి. మూడుజన్మల నుండి మీరు గురుశిష్యులరు. ఈ జన్మతో తరింపగలరు నీ గురువువలెనే నీవు కుటుంబాశ్రమమున రాజయోగివై తరింపగలవు పొమ్ము.

శిద్ద :- తల్లీ! నా యపరాధముల సైచి, నన్నాదరింపుము.
(సాష్టాంగ నమస్కారము చేయును.)

ప్రకృతిమాత :- ఇష్టకామ్యార్థ సిద్ధిరస్తు. - సిద్ధుడు! నీవుకోసిన పూలు నీ గురుదేవుని చేరినవి. పొమ్ము.

శిద్ద :- ధన్యాత్ముడను తల్లీ! (అని నమస్కరించును.)

( తెర వాలును. )

## షష్ఠాంకము — తృతీయ రంగము.

" వీరబ్రహ్మముగారి గృహము. "
ముందుభాగమున శిద్దయ్య కొయ్యపని చేయుచుండును.

గో :- నాయనా శిద్దయ్య! నీ గురుదేవుడు జపాల తపాలలో నిమగ్నులై కూరుచొనెదరు. నీవో, పొద్దస్తమానము నీ పనిలో

నీవు నిమగ్నుడవయ్యెదవు. - పిలిచినా పలుకరు. పిలిచి చెప్ప దామనుకున్న, పిలిచితే వారిపనికంతరాయము. నిన్ను పిలిచితే నీపనికాటంకము. - ఏమి చేయమనెదరు. ఇంటిలో ఈనాడు అక్షింతలకు బియ్యములేవు పూజ అయినతోడనే దైవ నివేదనకు తెమ్మని మీ గురుదేవుడు తొందరించెదరు. నేనేమి చేయుదును. - బదులో సదులో తెత్తమన్న ఇచ్చినది ఇచ్చిన గదా ఇచ్చెదరు. ఈవూళ్లో ఉప్పు పెట్టమన్నను పెట్టరు. ఏమి చేయమనెదవు శిద్దయ్యా?

శిద్ద :- తల్లీ! పాత్రలో బియ్యములేవా? చూడు తల్లీ. మన యింటనే లేకుండుటయా? ఎక్కడిమాట తల్లీ. - కల్పవృక్షము కాయ లేదన్నట్లున్నది. చక్కగా ఇంకొకసారి చూడు తల్లీ.

గో :- చూచివచ్చినానయ్యా శిద్దయ్య అంటే నమ్మవే. తెచ్చి చూపించినగాని నమ్మవు. తెస్తాను. (అని లోపల పోవును.)

శిద్ద :- (చేతులు జోడించి) గురుదేవ్! అక్షయమగుగాక.
[అంతలో గోవిందమ్మ పరమ సంతోషముతో పాత్రి ఎత్తుకొని వచ్చి, ఆశ్చర్యముతో బియ్యము చేతికెత్తుకొని]

గో :- శిద్దయ్యా! నేను చూచినప్పుడు లేవు. నీ మంత్రిము వల్లనో, మహిమవల్లనో వచ్చినవిగాని, వేరుగాదు.

శిద్ద :- లేదు తల్లీ. నాకు మంత్రమురాదు. మహిమలేదు. ఆ గురుదేవుని మహామహిమ. - వారియింట కల్పవృక్షము కామధేనువు గలదు. వారికేనాటికి తక్కువరాదు. దైవమును నమ్మినవారికి దారిద్ర్యములేదు. రాదు. నామాట నమ్ము తల్లీ.

గో :- ఏమో శిద్దయ్య, నీవు నాకు కానవచ్చుచున్నావు. నీలో ఉన్నదో, నీ గురుదేవునిలో ఉన్నదో నాకుతెలియదు - నాయనా శిద్దయ్య! నిత్యము బాధపడకుండ, గంపలున్నవి; గాజలున్నవి అన్ని నిండునట్లు చేసిన కొంతకాలము దిగులే లేకుండును. - అట్ల చేయరాదా నాయనా. నీకు పుణ్యముంటుంది.

శిద్ధ :- (చిరునగవుతో) తల్లీ! ఆశకు అంతులేదు. అంతములేదు. - అంతబాధ నీకెందుకు తల్లీ. తక్కువలేకుండ అక్షయమై నీకు కావలసినన్ని యుండునుగదా. - అమ్మా! ఆపాత్రలో ఉన్న వన్ని తీసుకొని, గురుదేవుని తలంచుకొని, నాలుగు గింజలు పాత్రిలో వేసి మూసిపెట్టుము ఏ పూటకెన్ని కావలయునో అన్ని సృష్టిచేయుచునే వుండును. - గాజలు, గంపలు నింపిన కొక్కులు, ఎలుకల రాపిడి గలుగును. పురుగు పట్టుచుండును. ఇట్టిబాధలనేకముండును. ఈ బాధలన్నీ ఎందుకుతల్లీ. అక్షయ పాత్రయై, ఏ పూటవి ఆ పూటకు దొరుకుచుండిన బాధలేదు గదా తల్లీ

గో :- సరే, నీమాట ప్రకారమేగాని శిద్ధయ్యా! ఈ మంత్రము నా కొడుకులకు కాస్త నేర్పరాద. - నేర్పు నాయన.

శిద్ధ :- తల్లీ! ఇది మంత్రముగాదు, తంత్రముగాదు. - గురుదేవుని మహిమ.

గో :- ఏమో నాయనా. నిన్నడిగితే నీవిట్లనెదవు, వారినడిగిన వార ట్లనెదరు. - కొడుకులచూతమా, మంత్రము మంత్రమని చచ్చిపోతువ్నారు. మధ్యలో నాకు చావు వచ్చినది. - ఏమి గురువో, ఏమి శిష్యుడో. (అని పాత్ర యెత్తుకొని) శిద్ధయ్యా! మాటతప్పదు కదు. ఇది అక్షయపాత్రియేనా?

శిద్ధ :- గురుదేవుని ఆజ్ఞ తల్లీ. వారున్నంతవరకుండును.

[గోవిందమ్మ వెళ్లిపోవును - శిద్ధయ్య కొయ్యపని చేయుచుం డును. అంతలో గ్రామస్థులిద్దరు వచ్చి]

1వ వాడు :- శిద్ధయ్యా! ఇదిగో మంచముచేసిన కూలి. మంచము చాలా బాగున్నదంటున్నారందరు.

2వ వాడు :- శిద్ధయ్యా! ఇదుగో రాట్నముచేసిన కూలి. (అని యిచ్చిపోదురు.)

శిద్ధ :- కూలి ఆరు రూకలు వచ్చినది. దీనిని ఎన్ని భాగములు చేయ వలయును. - తలిదండ్రులకు పుత్రిడనుగాబట్టి వారికొక

భాగము, ఇక్కడ గురుపుత్రుడనుగాబట్టి వీరికొకభాగము, నా అన్నపానీయముల కొకభాగము. - సరే, సరిగ సరిపోయినది.

(లోనికి చూచి అమ్మా! అని పిలుచును. గోవిందమ్మ వచ్చును.)

అమ్మా! ఇదుగో కూలి డబ్బులు. ఇది గురుదేవుని భాగము, ఇది నా భాగము. (అని చేతిలోవేసి, ఇది నా తలిదండ్రుల భాగము. (అని రొండిన చెక్కుకొనును.)

గో :- శిద్దయ్యా! నీవెక్కడున్న నీ తల్లిదండ్రులకు పంపవలయునా?

శిద్ద :- తల్లీ! తలిదండ్రుల ఋణము, గురుదేవుని ఋణము తీర్చవలయును. అటుపై దేవతాఋణము తీర్చుట ప్రతిమానవునకున్నది. అట్లు యీజన్మలో తీర్చుకొనకపోయిన మరుజన్మకైన తీర్చవలసివచ్చును. ఇది గురుదేవునాజ్ఞ తల్లీ. (అని పోవును.)

గో :- గురుదేవుడు గురుదేవుడని శిద్దయ్య నమ్మి, ఎంతో ముందుకు వచ్చుచున్నాడు. - నా కొడుకులన్ననో తినను, వీధులంబడి తిరుగను. తండ్రియనిన బొత్తిగా గిట్టదు. తండ్రికి వారిపై శ్రద్ధలేదు. మంత్రాలు మంత్రాలని చస్తారు. - మహిమ మహిమ అని శిద్దయ్య అంటాడు, నమ్మితే సొమ్ము. లేకుంటే దుమ్ము అని వారంటారు. నేనేమనేది. మధ్యలో నాకు చావు వచ్చింది. (అని పోవును.)

[లోనుండి శిద్దయ్య వచ్చి గురుదేవ! అని పనిచేయుచుండును. - కొంతసేపటికి గోవిందమ్మ విస్తరలో అన్నము తెచ్చి, శిద్దయ్యా! అని పిలుచును. శిద్దయ్యమీద పంచను పట్టును. పంచలో అన్నము పెట్టి]

గో :- నాయనా, మూడుచెక్కలనుకోవద్దు. అందరు భోంచేయగ మిగిలినదిదియే. దానితో సంతృప్తిచెందు నాయనా.

శిద్ద :- అమ్మా! నీచేతులార యిచ్చినదేదైన అమృతోపమానముగానుండును. నా నాలుకకు అమృతముగానే వుండును ఎక్కడి కేదిచిక్కిన, అక్కడికే తృప్తి తల్లీ. (అని తీసుకొని పోవును.)

[బ్రహ్మము భోంచేసి, చేయి తుడుచుకొంటూ వచ్చి కూర్చొని గోవిందా! అనును. గోవిందమ్మ వచ్చి నిలుచును.]

వీ :- గోవిందా! నిత్యము కష్టము చేసి, సంపాదించి యిచ్చువాడు శిద్దయ్య. - సోమరులై తిరిగి, భోజనవేళకు వచ్చి దిట్టముగా తినువారు నీ కొడుకులు. - పనిచేయనివారికి అన్నము, చేసెడి వారికి మాడుచెక్కలు. న్యాయమేనని నీబుద్ధి చెప్పుచున్నాదా. ఈ పక్షపాతబుద్ధి ఏమిచేయునో తెలియునా. పక్షగతవాయువుతో యెండ్లతరబడి మలమూత్రములలో పొరలుచు దుఃఖింపచేయును. - ఈ మాడుచక్కలు కొండలై పెరిగి, నీకొరకై చూపెట్టుకొనివుండును. ఆనాడు తినలేక దుఃఖపడెదవు. ఈ పాపను వూరకపోదు. నీ కొడుకులమాట విని, నీవెన్నివిధముల హింసించినను వాడు నిన్ను నన్ను విడచిపోడు. వీడే నీ పేరును నా పేరును నిలుపువాడు. ఇట్లిక చేయకుము. చేసిన ననుభవింతువు. - 'పూర్వజన్మకృతం పాపం వ్యాధిరూపేణ బాధితః' అన్న వచనము మరువకుము. ఇంటి యజమానురాలు ఇంటి వారికందరికి భాగరూపేణ పదార్థములు పంచి యివ్వక, కడుపాత్రముతో తిన్న పాపము పండి, ఈజన్మలో ఉదరవ్యాధికి లోనై కడుపు పెరిగి, నడువడమునకే బరువై అల్లాడుట చూడలేద. ఇంటివారికి దుమ్ముకొట్టి ఇంటియజమాని దొంగతిండ్లు తిన్నవారు మోయరానంత కడుపుతో బాధపడుట గానరాద. పాపమే. రోగములకు పాపమే జన్మలకు మూలమని ఎన్నో సార్లు చెప్పితినిగదా. పాలుదప్పక నడచితివా బాధలేదు. పాలు తప్పితివా బాధ తప్పదు. - తామరపుష్పముక్రిందనున్న కప్ప ఆ పుష్పము సువాసన గ్రహింపజాలదు. ఎక్కడనుండియోవచ్చిన తుమ్మెద దాని సువాసన, దాని పుప్పొడి గ్రహించిపోవును. అట్లనే మీ జీవితములు నడచుచున్నవని గ్రహించుకొనుము.

( తెర వాలును. )

## షష్ఠాంకము — చతుర్థ రంగము.

"వీరబ్రహ్మముగారి గృహము."

బ్రహ్మము కాలజ్ఞానము వ్రాయుచుండును.

గో :- (ప్రవేశించి, ప్రక్కన కూర్చొని) ఏమండీ! గ్రామమందరు పోలేరమ్మకు చల్లముద్ద పెట్టుచున్నారు. మనకు పిల్లలున్నారు మనము పెట్టుదామండీ. ఆ మహాతల్లి కరుణ అందరికీ అవశ్యకముగదా. ఏమంటారు?

వీ :- ఏమందును. తామరపుష్పముక్రింద కప్పచందమున నున్నావు. ఏ రూపముననో ఒక రూపమున నిత్యము పోలేరమ్మ భోంచేయుచునేవున్నది, నీకు కనబడలేదు. కానవచ్చునట్లు చేసినగాని బుద్ధి జాడ్యము కుదరదు.

గో :- ఏమండీ! తప్పంటారా?

వీ :- తప్పుగాదు. మంచిదేగాని, జొన్నన్నము ముద్ద ఆమె యెట్లు తినును. చిత్రాన్నము, పాయసము, హోళిగలు మొదలగు పదార్థములు తయారుచేయి. ఆమెను మనయింటికే పిలచెదను. ప్రీతిగా భోంచేసిపోవును. జొన్నముద్ద తినలేదు సన్నన్నము దొరుకని దినములలో జొన్నన్నము పెట్టుతుండినారు, సన్నన్నముచేయి.

గో :- మీరు పిలిచెదనంటే, పదార్థములు సిద్ధము చేసెద. మనము పిలిచిన వచ్చునసెదరా?

వీ :- (నవ్వుతు) వచ్చునో రాదో, అది నీకెందుకు? పిలుచుట నావంతు. చేయుట నీవంతు. కానీ, పో. తొందరగాచేయి. ఆమె కడుపు పెద్దది. దండిగాచేయి.

గో :- అట్లే చేస్తాను. నమ్మకమేగద.

వీ :- నామాటపైని నీకు నమ్మకము కుదిరి కుదరకున్నది. తొందరగా కుదురుతుంది పో. [గోవిందమ్మ నిష్క్రమించును.]

శిద్ద :- (ప్రవేశించి) స్వామి! పోలేరమ్మ జాతరకు మనము చందా యివ్వలేదని కొరమట్లు తీసుకపోయినారు. తమ యాజ్ఞలేక వూరకున్నాను. లేకున్న వారి పీచమణచివుందును.

వీ :- వద్దు వద్దు. న్యాయముగా మనమియ్యవలసినదేగద. గ్రామ కట్టడి మనపైన వున్నట్లేగద. - వార్తై, బీదవారని విడచిన విడువవచ్చు. లేదా ఇవ్వవలసినదే.

శిద్ద :- అధికారము బలము వున్నదని, గౌరవమర్యాదల విడచి, బీద సాదల గమనింపక, కొరమట్లకు తీసుకపోవుట మంచిదిగాదని తెలియదా. తెలియనివారికి గ్రామపెత్తన మెందుకు? ధర్మ మడుగంటదా?

వీ :- ముందుజన్మ సుకృతమువల్ల గ్రామపెత్తనము, ధర్మకర్తృత్వము, సంపద వచ్చును. దానిని చక్కగా నెరవేర్చుకొనుటకు జ్ఞానము, భావవిభేదములేని మనసు, ధర్మము, దయ, దాక్షిణ్యము కావలయును. లేదా ఈ కార్యములు పాపమార్జించును. ఇప్పుడు అధికారియైనవాడు రాబోవు జన్మలో అనధికారియై, అధికారులవల్ల బాధింపబడి దుఃఖించును. గ్రామస్థులు బాధించి, వేధింతురు నాయనా. అధికారగర్వము, వయోగర్వము, వాహన గర్వము, రాజగర్వము, విద్యాగర్వము, ఉద్యోగగర్వము, తపో గర్వము, ధనగర్వము ఊరకుండదు నాయనా. ఉన్నతస్థితినందు కొన్నవారిని అధోగతికి పంపును. దాని నెరింగినవాడు మరింత వున్నతస్థితి నందుకొనును. - మన కార్యము సామముచేతనే సాధింతము. అవమానపడితిమని చింతింపకుము.

తే॥ శాంతమే పుణ్యమార్జించు సాధనంబు
శాంతమే సర్వకార్యముల్ చక్కఁజరుప
శాంతమేకూర్చు జనులకు సద్యశంబు
శాంతముఁ గల్గు వాడెపో సజ్జనుండు.

శాంతింపుము. కాగలకార్యము కాగలదు. - మీ యమ్మ,

పోలేరమ్మకీనాడు అతిథ్యమియ్యవలెనని తలంచి, వంట చేయు చున్నది. నీవా పోలేరమ్మ గుడివద్దకు పోయి, అమ్మా పోలే రమ్మ! నీకొరకు బ్రహ్మముగారింట వంట చేసినారు. నీవు వచ్చి వారిచ్చు అతిథ్యము స్వీకరింపమని, నే చెప్పినట్లు చెప్పి, పిలుచు కొనిరమ్ము - ఆమె నీవెంట వచ్చును. గ్రామాధికారుల గర్వ మంతటితో అంతరించును. మన సామానులు మనకు వారే తెచ్చియిత్తురు. మీ తల్లికోరికతీరి జ్ఞానోదయమగును పొమ్ము.

తే॥ ధర్మమే జయమనుపల్కు తథ్యమయ్య
ధర్మముండినచోటను దైవముండు
ధర్మమే తల్లిచంధాన తన్నుబోచు
ధర్మమన్నిటకును మార్గదర్శకంబు.

దైవబలము మిన్నయో, భుజబలము మిన్నయో తెలుసుకొన తగిన కాలము ఎదురైనది. దీనితో ఎన్నియో పనులు సమ కూరవలసియున్నవి. పొమ్ము. [సిద్దయ్య నిష్క్రమించును.]

( తెర వాలును. )

## షష్ఠాంకము — పంచమ రంగము.

" పోలేరమ్మ గుడి. "

గుడి ముందు పిన్నపెద్దలు, ఆసాదివాళ్లు వుందురు.

* పాట *

(మునసబు మొదలగువారు పాడనారంభింతురు.)

అమ్మా పోలేరమ్మ దండాలమ్మా
దండాలమ్మా కోటిదండాలమ్మా
తల్లిపోలేరమ్మ దండాలమ్మో॥

1 నిన్నునమ్మినవార మమ్మోతల్లీ
కన్నబిడ్డలరీతి కాపాడమ్మో. ॥ అమ్మా ॥

2 వడుమీరిన దున్నపోతుల్ పొట్లేళ్లు
వడుమీరని మేకపోతుల్ బలిపిల్లల్
తెస్తుండరు తల్లి, వస్తుండరు చూడు. తె॥ ॥ అమ్మా ॥

3 సిళ్లుబోనాలదుగో వస్తుండయి చూడు
సిందుతప్పెట్లతో తెస్తుండరు
కొమ్ముల్ తాళాలదుగో,
తుడుముల్ మేలాలదుగో,
దుమ్ము ఆకాశాన్కి లేసిందదో.
తెస్తుండరువారు వస్తుండరు చూడు. ॥ అమ్మా ॥

జాడీల్ జాడీల్ ఘటము,
కడవల్ కడవల్ కల్లు,
తెస్తుండరువారు వస్తుండరు.
మొక్కుబల్లోలంత మోసుకొస్తుండారు,
తాజాగాకూసోని తాగావమ్మో. ॥ అమ్మా ॥

మూడుమూర్తులగన్న మూలపెద్దమ్మో।
అమ్మలందరిగన్న అమ్మమాయమ్మో॥ ॥ అమ్మా ॥

మునసబు :- ఒరే, ఇంకా చందా యెవరు బాకీవున్నారురా?

బంట్రోతు బాబయ్య :- అందరు యిచ్చినారు సామి. వీరయ్య ఒకడు ఇందాక యియ్యలేదు. అయనే తెచ్చియియ్యాలని, పాపిరెడ్డి కొరమట్లు తెమ్మంటే తెచ్చినాము. డబ్బులిచ్చి తీసుకపోవాలి.

పెద్దిరెడ్డి :- ఏమయ్యా, ఈరయ్య ఇంటికాడుండే సిద్దుడు తలూంచి అంటాడు. కొరమొట్లు తీసుకపోయినట్లుగాదు, మల్లా మీరే తెచ్చిపెట్టేకాలమొస్తుంది. స్వామిగారికి కోపమొచ్చేటట్లు చేసుకోకండి. మీ జాతర దుమ్ములో కలిసిపోతుంది. బలముందని అవమానించకండి. అంటాడు. - అయనకన్నా ఈతగానికి పొగరు జాస్తిగావుందిరా.

పాపిరెడ్డి :- వున్నీ వున్నీ. నాలుగు గుద్దులుపడితే నలిగిపోతుంది. - ఇట్లానాయాల్ల ఎందఱిని చూడలేదు.

పెద్దిరెడ్డి :- యారమట్లు తగిలితే ఏమగుతారో చూడండి అంటూర్రా. బిక్కమొగం నాయాలు. ఏమి చేసీని.

పాపిరెడ్డి :- మనమంటే ఏమనుకున్నేడో తప్పదియ్య. కొంప - గోడి పీకి, నిలవనీడలేకుండ చేయలేమ. యేమంటే, పాపమని వూరకున్నాము.

పెద్దిరెడ్డి :- చాతగానినాయాళ్ళు, చాతగానికూతలు కూస్తుంటారు. వాటిని లెక్కపెడితే అవుతుందా, కార్యం కావాలెగ.

బ॥ బాబయ్య :- అదుగో. సిద్దయ్య డబ్బెత్తుకొత్తుండాడు.

పెద్దిరెడ్డి :- అప్పుడులేని డబ్బు ఇప్పుడెట్లొచ్చాంట అయినా, నిక్కుల నాయాళ్ళులే, పాపడు.

మునసబు :- దేవునికయినా దెబ్బే గురువన్నారు. ఊరకే యిస్తారా? దెబ్బతగిలితే యిస్తారు.

[ సిద్దయ్య ప్రవేశము ]

పెద్దిరెడ్డి :- సిద్దయ్యా! డబ్బు తెచ్చినావా?

సిద్ద :- తెచ్చినాను. గురువాజ్ఞను తెచ్చినాను. ఇంక కొంచము సేపటిలో యిస్తాను.

పాపిరెడ్డి :- ఏందోయ్! ఏందో మాట్లాడుతావే. డబ్బు యిచ్చిందాక కొరమట్లు రావు. - బ్రహ్మదిగొచ్చినా, పదిమంది సచ్చినా, యియ్యము, యియ్యము.

బ॥ బాబయ్య :- అదీమాట. యియ్యమంటే యియ్యము.

సిద్ద :- బ్రతిమాలి తీసుకపోవడమువకుగాని, డబ్బుయిచ్చి తీసుకపోవడమునకుగాని రాలేదు. సామాను యావత్తు మీరే తెచ్చి, ఆయనపాదాలచెంత బెట్టి, క్షమించండి, అపరాధులమని చెంపలేసుకొనవలె. మీ మీసాలబలము, మీ భుజబలాలు యిక్కడ చెల్లవు. చెవులుతెగిన ముండమోపుల దగ్గర చూపండి.

పాపిరెడ్డి :- ఓహో, ఈతగాని తెలివి పెద్దదే. - ఓహోయ్ సిద్దప్ప!

సిగ్గుమానంతో యిక్కడనుంచి పోతావా, గుద్దులు కావాలనా చెప్పు. (అని చేయెత్తుకొని కొట్టనొస్తుండగ, బంట్రోతు పట్టుకొనును.)

శిద్ద :- తొందరపడకు చెప్పుతా. నీతో యేమి చెప్పేది. పోలేరమ్మతోనే చెప్పుతా.

పాపిరెడ్డి :- మీ యమ్మేమిరా చెప్పను?

శిద్ద :- ఔనయ్యా. మాయమ్మే. - అమ్మా పోలేరమ్మ! నా గురుదేవుడు వీరబ్రహ్మముగారు (అని అంటుండగా, వెంటనే)

పాపిరెడ్డి :- ఓం. ఒరే సిద్దుడు! ఈరయ్య, బ్రహ్మమెప్పుడైనాడురా? (అని అందరు నవ్వుదురు.)

శిద్ద :- పోవయ్యా. మీసాలను పెంచుకొన్నట్లు, తెలివిని పెంచుకొనియుండిన తెలుసుండెడిది. - మీసాల బలమేగాని, బుద్ధిబలమెక్కడిది.

ఓ పోలేరమ్మతల్లీ! నా గురుదేవుడు తమకు ఈ దినము ఆతిథ్యమిచ్చెదరట. అతిథిగా మిమ్ము రమ్మన్నాడు దయచేయ ప్రార్థించుచున్నాను. రండి తల్లీ.

[భయంకర శబ్దముతో గుడినుండి కిరీట సర్వాభరణములతో, త్రిశూలము ధరించి వెలువడివచ్చును. - అందరు భయపడి, పరుగిడబోదురు. - చెతుర్దిక్కులనుండి భయంకరాకారులైన కింకరులు శూలధారులై అడ్డగింతురు. - అమ్మా అని అరచెడివారు, వణకెడి వారు, బోర్లపడువారు, కూలబడువారు నౌదురు.]

పోలేరమ్మ :- పాపభూయిష్టులైన గ్రామపెద్దలారా! నా పేరు చెప్పి, బీదలపై చందాలువేసి, డబ్బు రాబట్టి, ఇవ్వలేనివారిని భయపెట్టి, వృత్తితో బ్రతికెడివారి కొరమట్లను తెచ్చి బాధించుచు, ఈ చందాడబ్బుతో తల్లులు పిల్లలు బాగాతిని, బంధుమిత్రులకు

పెట్టుతు, గౌరవమర్యాదల బొందుతు, గ్రామ పెద్దలమని గర్వించుచున్నారు. ఎవరికి తెలియకన్నను నాకు తెలియక పోదు. మీ వంశనాశనము చేయుదును. అమాయకులు బీదలు మీరు చేసెడిపనికి ప్రతి సంవత్సరము బలియగుచున్నారు. ఈ పాపము మిమ్ముల, మీ యాలుపిల్లల పూరకవిడువదు. ఘోర హింసల పెట్టకపోదు. - వీరబ్రహ్మముగారి కొరమట్లు గర్వోన్మత్తులై తెచ్చితిరి. వారు శపించిన నాశనమయ్యేదరు. వారి కొరమట్లు మేళతాళములతో తీసుకొనిపోయి యిచ్చి, క్షమాపణ వేడుకొనుడు. లేకున్న మారికాస్ఫోటకాది ఉపద్రవముల చెలరేపెదను. నాశనమయ్యేదరు. - వారి కొరమట్లు వారి కివ్వుడు. పొండు. [సిద్దయ్య, పోలేరమ్మ నిష్క్రమింతురు.]

(అందరు ఇటు, అటు చూచి లేతురు.)

బ॥ బాలయ్య :- మీసాల పాపిరెడ్డి! లెయ్యి లెయ్యి. అరెరే సచ్చినావు. (అని లేపును. భయపడుతు లేమును.) - నేను సెప్పినాఁగ ముందే. అరే రెడ్డి! అందరు ఆచార్లుగాదయ్యా. ఈరయ్యలో బలంవుంది. మన్ను యన్క తగిలిస్వాడు అంటే యింటావు. తంటాపనుల్కు చేసినావు. యిప్డు కొరమట్లు, యారమట్లు నెత్ని పెట్టుకోని, మేలాల్ తాలాల్తోపోయి, ఈరయ్య పాదాలకాడ పెట్టి, తప్పుల్ చేసినాము దయ దల్చుమని దండాల్కి పెట్టు. మీసాల్ కింద్కి దింపు. - పనులు పాటల్ చేసె వాల్లకీ, దిక్కులేని బీదవాల్లకీ గుద్దుతానని బెదిరిస్వావ్. ఇప్డు డొచ్చినోల్ల గుద్దకూడ్దు? బడెమీసాల పట్టుకోని వెన్కు ముంద్కు, వెన్కు ముంద్కు వూసి వూసి వూసపీకుదూరే. యీరయ్య అంటే యేమనుకున్నేవ్? బెమ్మదేవున్కి సమానం. సిద్దయ్య సిద్దున్కి సమానం. - నీ బడేమీసాల్ కథ అక్డ కుదర్దు. పా. నెత్ని పెట్టుకో. అరే కొమ్ముపాడ! వూదర్.

పాట - అందరు :- అయ్యా యీరయ్యా దండాలయా
దండాలయా కోటిదండాలయా ॥ అయ్యా ॥

బ॥ బాబయ్యా :- ఏయరా అడుగు
తప్పుచేసినాము తండ్రి యీరయ్యా
తప్పు వప్పుగచూడు తండ్రి యీరయ్యా
పోలేరమ్మను పిల్చి యిందు పెట్టెడివాడు
భూలోకమునలేడు భూపడీవేనయ్యా ॥ అయ్యా ॥

(అని పాట పాడుతు నిష్క్రమింతురు. - పాపిరెడ్డి సామాను నెత్తిన పెట్టుకొని పోవును.)

( తెర వాలును. )

షష్ఠాంకము — సమాప్తము.

## సప్తమాంకము — ప్రథమ రంగము.

" వీరబ్రహ్మముగారి గృహము. "

బ్రహ్మము, గోవిందమ్మ, సిద్దయ్యా కూర్చొని వుందురు.

గో :- ఏమండి! పోలేరమ్మ మన యింటికి వచ్చి భోంచేసి పోయినది చూచి, ఊరంతా మిమ్మల యేమి పొగడుతున్నారండి.

వీ :- ఏమని పొగడుతున్నారు. చందాయివ్వలేని దద్దన్న అనియా?

గో :- అదికాదు. మీరన్నారుగా. శాపానుగ్రహశక్తిగల బ్రాహ్మణులు సుక్షత్రియులులేని యుగము కలియుగము. ఈ కాలమంతయు వ్యర్థమన్నారు. - చీమ తిన్నంత ఆహారము తిని, జీర్ణముగాక, వైద్యుల వెతకెడి ప్రజలయ్యేదరన్నారు. అది అటుండనిండు. మీరు మహానుభావులని, మహాత్ములని, మహాతపస్వీశులని పేరు మారుమోగిపోతున్నదండీ - ప్రపంచములో పుట్టినందుకు పేరుప్రతిష్ఠలు నిల్పుకున్నవాగే పురుషులన్నారు. అది చిరస్థాయిగా తమకు నిలచినదండీ.

వీ :- పేరుప్రతిష్ఠలు లేనివారు పురుషులు కాదనియా, నీవనునది?

గో :- అట్లకాదండీ. పుట్టి చచ్చెడి పురుగులట్లాంటివారని తలంతురు. పుట్టుట చచ్చుట, చచ్చుట పుట్టుట జీవులకు పరిపాటిగదా. - పుట్టితే సరియా. పుట్టినందుకు ఫలముండవలెగదా - తమరు శాపానుగ్రహశక్తిగలవారగుటవల్లనే ఎత్తుకపోయిన కోరమట్లు తెచ్చి యిచ్చినారు. లేకున్న వారు యిత్తురా, తెత్తురా?

పి :- ఇదిగాదు. ఇంకా గొప్పకార్యము ముందున్నది. అది మహా కష్టమైనది. అందరికి అందుబాటుగానిది చెప్పెదను. అయినా, నా పేరువెంబడి నీ పేరుకూడా నిలచినట్లేగదా.

గో - ఔనండీ. నేను ముందెంతో పుణ్యముచేసే తమకు భార్యనైతిని. పుణ్యపురుషులకు భార్యకావలయునన్న ముందుజన్మలో ఎంతో దైవసేవ, పతిసేవ చేయుచు, ధర్మబద్ధయై, పెండ్లినాటి ప్రమాణముల మరువక వుండవలయునన్నారు. ఏమిచేసితినో యిప్పుడు నా పుణ్యమునకు మేరలేదు. తమకు భార్యనగుట చేతనే నాకీ ఘనత దక్కినది. (అని నమస్కరించును )

పి :- గోవిందా! భర్తచేసిన పుణ్యములో భార్య సగపాలు పంచుకొనగలదని, భార్యచేసిన పాపములో భర్త సగపాలు పంచుకొనవలయునని పెద్దవారన్నారు. - నా తపోబలములో సగపాలు పంచుకొన్నందుకు చింతించను. నీవు పాపముచేసి, సగము నాకు పంచియిచ్చి, నన్నధోగతికి పంపక, మిగిలించినందుకు మిగుల సంతోషింతును. లేకున్న మరీ జన్మమెత్తవలసి వచ్చును. ఎద్దులు సమముగా వకేనడుపు నడచిన, బండి చక్కగావచ్చును. భార్యాభర్తల మనసు యేకమై, నడవడిక యేకమైనట్లయిన ఇహమును, పరమును సులభోపాయముగ సాధింపవచ్చును. - ఏకముగాకున్న ఇక్కడే యమలోకము గానవచ్చును. నీవు ధర్మపత్నివగుట నా సుకృతఫలము.

గో :- ఏమండీ! నన్నేడ్పించినగదా, మీకు పాపమువచ్చును. యౌవన, కౌమార, వృద్ధాప్య దశలలో సర్వకోర్కెల దీర్చినారు. సర్వ

ధర్మముల నేర్పి, సత్ప్రవర్తనగా చేసినారు. అణుమాత్రము దుఃఖపడకుండ చూచినారు. పెండ్లినాటి ప్రమాణముల చక్కగా పాలించినారు. నేను వచ్చినదాదిగా పల్లెత్తుమాట అనలేదు కోపించలేదు. కోపించి, అలిగి దుఃఖింపచేయలేదు. ఇది తక్కువ అనిపించలేదు నాపాలిటి కల్పవృక్షమై, కామధేనువై కాపాడినారు. మీకెట్లు పాపము వచ్చును. - పెండ్లినాటి ప్రమాణముల మరచి, రక్షించుట విడచి భక్షించినవారికి పాపమువచ్చును. అన్యమార్గముల నడచిన పాపము వచ్చును. ముందు మీరు సాలుగా నడచినారు. మీ అడుగుజాడల్లో నన్ను నడిపించినారు. పాప మెక్కడిది.

[పీరాన్‌సాబు ప్రవేసించి, - 'బెమ్మంగారికి సలాం సలాం' అని వంగి వంగి సలాములుచేసి, ఉత్తరము అందిచ్చును. - సిద్ధయ్య తీసుకొనును.]

వీ :- సిద్ధుడ! చదువుము. (సిద్ధయ్య చదువును.)

శిద్ధ :- బ్రహ్మశ్రీ వేదమూర్తులై, మహనీయులై, విశ్వబ్రాహ్మణ శిల్పాచార్యులగు పోతులూరు వీరబ్రహ్మముగారి సముఖమునకు - కడప మండలాధిపతి సుల్తాన్ రజాక్ నవాబు సలాములు చేసి వ్రాసుకున్న ఉత్తరం.

గ్రామస్థులు అందరు చూచుచుండగ, మీరు పోలేరమ్మను విందుకు పిలువనంపగ, ఆయమ సర్వాలంకార సుశోభితయై, విందు గుడువగ, మీ యింటికివచ్చి సంప్రీతిగా భోంచేసి పోయినట్లు - వూర వూర, యింటింట, మనిషి మనిషి నోట విన వచ్చుచున్నది. వింటున్నాము. మా పరగణములో యింతటి మహనీయుడుండుట మాకు సంతోషము. మీరిక్కడికి దయచేసి, మా కన్నులపండువుగ ఆయమను చూపి మేమిచ్చు ఆతిథ్యమును, బహుమానమును స్వీకరింతురని ప్రార్థనచేసి, మా మనిషిద్వారా ఉత్తరము పంపితిమి. అన్యథాభావింపక దయ చేయ ప్రార్థన. ఇట్లు, కడప మండలాధిపతి,

సుల్తాన్ రజాక్, కడప.

శిద్ద :- స్వామి! మతద్వేషాసూయలు అప్పుడే గలిగినవి. - రాళ్లలో, చెట్లలో, నీళ్లలో, బొమ్మలలో దేవుడులేడు దేవుడు నిరాకారుడని మహమ్మద్ వక్త నుడివిన మాటపైన నమ్మకముగల వారుగాబట్టి గంగమ్మల, పోలేరమ్మల, అంకాళమ్మల నమ్ముదురు? ఇదివక యక్షిణీవిద్యయో, మోసమో వుండవలయునని యెంచి, అసూయను భరింపజాలక, పరాభవింప పన్నిన పన్నాగము. తాము అక్కడ పోకూడదు. - తమ ఆజ్ఞయైన నేను పోయి వారిగర్వమడచి వత్తును సెలవిండు.

వీ :- సిద్దుడ! వారు నన్నె రమ్మని వ్రాసిరి. నీవుపోయిన వప్పుకొనెదరా?

శిద్ద :- స్వామి! మర్యాదగలవారైన. మిమ్ము మహాత్ముడని గ్రహించినవారైన పల్లకి పంపివుందురు. అమర్యాదజీవులు గాబట్టి అమర్యాదగా నడచియో తమ పల్లకిలోనో రమ్మన్నారు. అమర్యాదకు శిష్యుడే చాలును. సెలవిండు.

వీ :- సిద్దుడు! జాగ్రత. వారికి ఉద్యోగగర్వము తలకెక్కియుండును. దురాలోచనతప్ప, దూరాలోచన వుండదు. వారికి తగినట్లొనర్చి వారిక్కడికి వచ్చునట్లొనర్పుము. పొమ్ము.

శిద్ద :- చిత్తము గురుదేవ. (అని నమస్కరించును.)

వీ :- మనోవాంఛాఫల సిద్ధిరస్తు. పొమ్ము.

[సిద్దయ్య నమస్కరించి నిష్క్రమించును.]

వీ :- గోవిందా! చూచితివా? పోలేరమ్మకు విందు చేసినది కడప నవాబు వరకు పోయినది. ఇంకా పదిదినములైన ఢిల్లీ చక్రవర్తి వరకు పోవును. ఇట్లే వారు పిలిపింతురు. నేను పోవలసి వచ్చును. లేదా నిరాకరించి వారితో పోరాడవలసి వచ్చును. నాకు వ్యవధిలేదు. - నేనొక్కటి అడిగెదను. చక్కని ఉత్తరమిమ్ము. - భార్య భర్తకు మంత్రియందురు. చక్కని ఆలోచన చెప్పుము.

గో :- నేను తమకు ఆలోచన చెప్పునంతటిదాననా? ఆ యోగ్యత నాకు గలదా?

వీ :- లేకేమి. నాలో సగభాగస్థురాలవు. - అయినా చెప్పెదను. మనము ముక్తికిపోవుదమా, లేక జీవసమాధిస్థులమై భక్తాదులిచ్చు ఆతిథ్యముల స్వీకరించుచు, వారి కోరికల పిలుగలిగినంతలో తీర్చుచు జీవసమాధిలో నుండుదమా?

గో :- ఏమోనండీ! యింత గొప్పవిషయమును నేను చెప్పగలనా? అవునా?

వీ :- మోక్షమనగా, జీవి విరామముగానుండుట. చావు పుట్టుకలు లేనిది. సుఖదుఃఖములుండనిది. అన్నాహారములు ఆవశ్యకము లేనిది. సోమపానముచేసి నిరంతరము హాయిగా నుండగలిగినది. రెండువేళల దైవదర్శనము కాగలది. మోక్షము, షడ్రసోపేత భోజనములక్కడుండవు. పరోపకారముచేసి పుణ్యమార్జించు స్థల ముగాదు. ఉపకారము కోరెడివారుండరు. అందరు సర్వశక్తి సమర్థులే. - ఇక్కడ పరులకు మేలు చేయవచ్చు, పుణ్యమా ర్జింపవచ్చు, షడ్రస భోజనము దగదీర తినవచ్చును. పుణ్యము నకు తోడు మరింతపుణ్యము చేసుకొని, దేవత్వము సంపాదించు కొనవచ్చును. ఇదియే శ్రేయమని తలంచితిని. నీ యిష్టమేమి?

గో :- నీయిష్టమే నా యిష్టము

వీ :- యింక నాకు వ్యవధి వారము దినములే గలదు. యింతలో సమాధి ఏర్పాటుచేయుదును. నీవింకా కొంతకాలముండవలసి యున్నది. ఏమందువు?

గో :- ఏమండీ! నన్ను ఒంటరిగ విడచిపోయెదరా. మీ కన్నులెదుట సుమంగలినై పోవలయునని వుంటినే. ఈ సంసార భారమం తయు నాపై వేసిపోయెదర? విధవనై యెట్లు జీవింతును. జీవింపలేను. మీవెంటనే తీసుకొనిపొండు. (అని దుఃఖించును.)

వీ :- ఓసి, వెట్టిబాగులదానా! నాకు మరణము గలిగినగదా, నీకు

విధవత్వము వచ్చును. - ఆవందర్భిస్థాయిగా యుండక నా జీవ సమాధి వద్దనుకొన్నంత వరకు జీవసమాధిలో నుండగలను. - నీకు విధవత్వములేదు నీ యోగక్షేమముల చూచుచునే వుందును. ఆవశ్యకములగు కార్యములు నెరవేర్చుచునే వుందును. ఎవ్వరెన్ని చెప్పినను, ఎవ్వరెన్ని అనినను తాళి తీయవద్దు. - పసుపు, కుంకుమ మానవద్దు. - పూలు పెట్టుకొనుట విడువ వద్దు. - నిన్ను నిందించిన వారి వంశము వల్లకాటిలో కలిసి పోవును. భయపడకుము - ఇక జీవనోపాధికి నీ పుత్రులు సంపాదించిపెట్టవలసిన పనిలేదు. నీకు కావలసినంత ఆర్జించితిని. హాయిగా వున్నంతకాలముండుము. ఆఖరున నాలోనే చేర్చు కొందును. నీవు తలంచుకొన్నప్పుడంతయు నీ మనోవీధిలో నిలచి, ప్రత్యుత్తర మిచ్చుచునే వుందును. నీవల్లగాని పనుల నెరవేర్చుచునే వుందును. - నాకు నీ సన్మతి - సలహా ముఖ్యము. ఆవశ్యకము కానియ్యమనుము.

గో :- ఏమో స్వామి. నన్ను వంటరిచేసి వెళ్లుచున్నారు. మీ యిష్టమే నా యిష్టము. అడ్డు చెప్పలేను. మీరు సర్వజ్ఞులు.

వీ :- భయపడకుము. నేనుండగ, పరమాణవు భారము నీకుండదు. రా పోదము. (నిష్క్రమింతురు.)

( తెర వాలును. )

## సప్తమాంకము — ద్వితీయ రంగము.

" నవాబు - సుల్తాన్ రజాక్ గారి ఆస్థానము. "

నవాబు సుల్తాన్ రజాక్, మంత్రి బుడ్డేఖా వుందురు.

జవాన్ :- (ప్రవేశించి) సలాం సలాం. నవాబుకీ సలాం. (అని వంగి వంగి సలాంచేసి) బెమ్మంరాక, శిష్యుడు శిద్దయ్యను పంపినాడు. వచ్చినాడు.

బుడ్డేఖా :- అరెరే, యిస్కి. - బెమ్మం అక్డ బొమ్మల్ సెస్నాడు. యీన్ని యెంద్కు పంపినాడు పిల్లల్ సేయవా, పిండాకూడు తినవా? పిల్సు.

[సిద్దయ్య ప్రవేసించి, నమస్కరించక నిలుచును]

బుడ్డే :- అరే, నవాబ్‌కి సలాం సేయర. నవాబు దేవున్కి సమానంరా. సేయి సలాం.

శిద్ద :- నేను నమస్కరించుట ఇద్దరికే. మూడవవానికి పెట్టను. తల వంచను. ఒకటి నా గురుదేవుడు. రెండు సర్వవ్యాపకుడై సర్వము నెరుంగు భగవంతుడు. వీరిద్దరే నా నమస్కారమునకు తాళుకొనువారు. వేరేవారికి దండము పెట్టిన, తల శతసహస్ర వ్రక్కలై, వ్రయ్యలై పగిలిపోవును. నాకు పాపము వచ్చును గాన, చేతులెత్తి దండము పెట్టను.

బుడ్డే :- అరెరే, అంతశక్తి నీకు వుంది. భయపడిస్నావ్. భయాన్కి, గియాన్కి మేము భయపడంలే. - ఒరె ఒరే! శాటల్ కొట్టి పిల్లుల్కి బెదిరించినట్లు బెదిరిస్నావ్. అరే దూకల్ సిద్దు.

* పాట *

రాళ్లల్లోన, రప్పల్ లోన, రాగి కంచుబొమ్మల్ల్లోన, - చెట్లు చామల్, నీళ్లల్లోన, గుళ్లలోన, గుట్టల్లోన - కొండల్లోన, కోనల్లోన, దేవుడుంటాడా। - పిలిస్తె ఓ యని దిగవస్తాడా॥ ఏమి మతం, ఏమి కులం, - సైతాన్ కులము, సైతాన్ మతము, ఛీ ఛీ ఛీ. —— నిడికి వక్కడు నామాల్ పెడితే, అడ్డమువక్కడు విబూదిబూస్తె, గుండుగ వక్కడు ముద్రలుకొడితే, దేవునిమనుషులు అవుతారా, దేవుడుపిలిచిన వస్తాడా. - ఏమి మతం, ఏమి కులం, - సైతాన్ మతము, సైతాన్ కులము, ఛీ ఛీ ఛీ.

శిద్ద :- బుడ్డేఖానుగారు! ఈర్ష్యాసూయలతో, పదవి గర్వముతో, మాట్లాడకుము. తెలియని వారు తెలియనట్లుండిన ప్రమాదము

సంభవింపదు. తెలిసినట్లు ప్రవర్తించిన తప్పక ప్రమాదము గలుగును. ప్రమాదమునకు గురికాకుము.

బుడ్డే:- అరెరే, నాదీ పేరు నీకు ఎట్ల తెల్సురా? నీది తలకాయ పెద్దది గదుర.

శిద్ద:- నీ పేరుగాదు, నీ తండ్రిపేరుకూడ తెలుసును. జలాల్ ఖాన్ - తలకాయ వకటే కాదు. నాలుగు కాయలు పెద్దవే హాజరత్.

బుడ్డే:- నాలుగు కాయలు యేవిరా?

శిద్ద:- నీకు తలకాయవున్నదిగాని, అక్కరకు రానిది. నాలుగు కాయలే తెలియని నీవు మంత్రిపదవికెంత అర్హుడవయ్యేదవు? అనర్హుడవు.

బుడ్డే:- అరె అరే, నాదీ రెూంచుతాప్. నీకి భయంలేదు. బుడ్డేఖాను అంటే, యేమి తెల్సునా. - కోత కోస్సాం. మూత వేస్సాం. బువ్వపెట్క చంపి వేస్సాం.

శిద్ద:- చేతగాని వారివద్ద నీవన్నవన్నీ చేయగలవు. ఇక్కడ సాగవు. అయినా, యిటు విను. 196 కోట్ల సంవత్సరములనాడు సృష్టి గలిగినది. సృష్టినుండి హిందూమతము సంస్కృతభాష పుట్టినది. ఈ సృష్ట్యాదినుండి ఇట్టి మతములు, మతోద్ధారకులు, భాషోద్ధారకులు ఎందరో పుట్టి గిట్టినారు ఎన్నో మతములు గతించినవి. ఎందరో మతకర్తలు పుట్టి గతించినారు. నీమతము పుట్టి పదునాలుగు నూర్ల సంవత్సరములు గావచ్చుచున్నది. - క్రీస్తుమతము పుట్టి రెండువేల సంవత్సరములు గావచ్చుచున్నది. హిందూమతము వర్జమని వదలిన వాటిని తీసుకొని ఒక మతముగా సృష్టించుకొన్నారు. - 195 కోట్లు, 58 లక్షలు, 85 వేలు, 75 సంవత్సరములు ఈనాటికైనది హిందూమతము పుట్టి. ఈ కాలములో ఇట్టి మతములు ఎన్ని గతించివుండునో, ఎన్ని పుట్టివుండునో గమనించి చూడుము. - ఆనాడె కట్టు, జుట్టు, బొట్టు హిందువులు కుదుర్చుకున్నారు. ఈ కలియుగములో మతకర్తలు వకరు పెట్టుకొన్న నియమమును మరొకరు వప్పు

కొనకను, మనిషిని చూచినంతనే మతమును, జాతిని తెలుసు కొనవలయునని వేషముల, భాషల, ఆచార వ్యవహారముల మార్చి మానవుల విడగొట్టిరి. - మీ మతము పుట్టినప్పుడు కట్టు, జుట్టు, బొట్టు మార్చుకొనుటకు అన్నీ ముందుగలిగిన మతముల వారు తీసుకొనగ, ఏవి దొరుకక, ఎటు పోవుటకు వీలులేక వక్రించితిరి. ఇక ఈ భాషావైషమ్యము అనేక భాషల వల్ల గలిగినది. మతద్వేషము అనేక మతములవల్ల గలిగినది కులభేదములు వృత్తులవల్ల గలిగినవి. యిందున భావభేదములు గలిగి, మానవుల పీడించుచున్నవి. - నా భాష, నా మతము, నా కులము అన్న వైషమ్యమును చంపుకున్నవాడు మానవ మర్యాద నెరిగినవాడు. చంపుకొననివాడు మానవ మర్యాద నెరుగని మందభాగ్యుడు.

[ వీరబ్రహ్మము అదృశ్యమున ]

వీ :- హజరత్‌గారు! చక్కగా వినండి.

బుడ్డే :- అరెరే, ఎక్డ అది పల్కు సిద్దయ్యా?

శిద్ద :- నా గురుదేవుడు శ్రీ విరాట్ పోతులూరు వీరబ్రహ్మేంద్ర స్వాములవారు అదృశ్యులై గగనమునుండి పలుకుచున్నారు.

బుడ్డే :- అరెరే, కన్పడకుండ మంచల్కి వుంటాడు. - ఎంత పెద్ద, ఎంత పెద్ద.

వీ :- పెద్దనో చిన్ననో - విను.

శిద్ద :- నానా మతములతో, నానా భాషలతో, నానా కులములతో, నానా ఆచారములతో ఎటు పోవుటకు దారిగానక, తల్లిలేని పిల్లలవలె మానవులు అల్లాడవలసినకాలము కలికాలము. - ఆ కలి దేవుని ప్రేరణచే ఇన్ని మతములు, ఇన్ని భాషలు, ఇన్ని కులములు, ఇన్ని ఆచారములు. ఒక్కటననేల. అనంతమార్గము లుత్పన్నమైనవి. - భాషా వైషమ్యములతో, మత వైషమ్యములతో, కుల వైషమ్యములతో ఉద్రిక్తులై ఒకరినొకరు

హింసించుకొని, దూషించుకొని పాడౌచున్నారు. భగవంతుడు దయామయుడు. నీవేభాషతో పిలచినను, నీవెట్లు కొలిచినను, సాకారముతో చూచినను, నిరాకారముతో చూచినను వప్పుకొనును. ధర్మము, సత్యము, అహింస, భక్తి ఉన్నవారిని తన వారిగాచూచును. పూర్వజన్మ కర్మను సూటిగా తగులనియ్యక, ఈజన్మలో సహాయభూతుడుగా నుండును. మరుజన్మకు సర్వ కాముడునై సర్వము నొసంగును. సాటిమానవుల, అన్య మతముల ద్వేషించి, మూర్ఖారని దూషించితిరి. దీర్ఘాలోచనసేయక అనుభవింపక రాళ్ళలో, నీళ్ళలో, చెట్లలో, గుట్లలో, బొమ్మలలో దేవుడుండునా అని ప్రశ్నించితిరి. సర్వమయుడు, సర్వతోముఖుడు, సర్వజ్ఞుడు, సర్వరూపుడు, సర్వేశ్వరుడు. తన్ను నమ్మిన సత్యసంధుల, ధర్మబద్ధుల, భక్తుల చెంతచేర్చుకొను దయామయుడు. - ఏ భాషతో పిలచిన, ఏ దిక్కుమళ్ళి ఏ యాసనముతో ధ్యానించిన, ఏ వేషముతో పిలచిన, ఏ విధముతో నమస్కరించిన భక్తులకు పలుకును. భక్తుల కష్టసుఖముల నిరంతరము చూచుచుండును. భక్తుల పిలుపు ఆలించును. అట్టి వేద మార్గమును విడచి భావవిభేదము సృష్టించుకొని, పలువిధమార్గముల కల్పించుకొని మతకర్తలు మానవుల పీడించిరిగాని - అల్లా అన్నను, శ్రీహరీ అన్నను వారిసే చేరును. మనసులో తలచినది, గొంతెత్తి పిలిచినది రెంటిని వినగలుగు శక్తి ఆ పరమాత్మునికి గలదని నమ్ము

బుడ్డే :- అరెరే, గారడి యిద్దెల్ చేస్సావ్. కణకట్టు కట్టావ్. ఎంత పొద్దు, ఎంత పొద్దు సెప్పితివి. గుట్ట తిప్పకుండ కుండపోత పోసినావు. గురువు సెప్పినా, నీవు సెప్పిన నాది యిగాదు. - మాకు యిప్డు పోలేరి అమ్మణ చూప్త పోతే జయిల్ ఖానా తిణ పిస్సాం. పురుగుల్ పడినా సంగటి యేస్సాం. ఈపూనా పడ్తాయ్ మోసేతిపోట్లు తెల్ సూనా. దూకల్ వ్వాని ఎంత ఎంత నేర్పిచ్చినాడు తెమ్మం. ఇప్డు సెప్పింది తెమ్మమా? నీది మాయతో చెప్పి

నావా? - బెమ్మంగారి శిష్యుని జెమ్మం, యిప్డు యిక్డ తెల్సి పోతుంది. కానీ, చూపు? పోలేర్ని సూపు?

శిద్ద :- చూపకపోయిన?

బుడ్డే :- పురుగుల్ సంగటి తినిపిస్సాం. - మోచేతిపోట్లు పొడిపిస్సాం.

శిద్ద :- నవాబుగారు! మీరైన యోచింపుడు. మంత్రులే రాజ్యరక్షకులు, మంత్రులే రాజ్యభక్షకులు. ఇట్టి మంత్రులవల్లనే రాజ్యము లంతరించినవి. సాధువుల, సజ్జనుల, భక్తుల దూషించి బాధించిననాడు, గోహింస చేసిననాడు, స్త్రీల చెరబట్టిననాడు, దేవాలయములలో దీప మెలుగనినాడు, ధర్మాదాయముల దిగమ్రింగిననాడు, వేదదూషణచేసి, వేదమార్గముల నడువక, అన్యమార్గముల నడచిననాడు, రాజ్యపతనము, ప్రజాక్షయము తప్పదు. పంచభూతములు చెలరేగి ప్రభుత్వమును, ప్రజల నాశనము చేయును. మారణోపాయముల కనిపెట్టి, పాపపుణ్య విచక్షణ జ్ఞానశూన్యులై మానవుల మసిచేయు మానవులు పుట్టుదురు.

మీరిప్పుడొక మహనీయుని పరాభవింపదలచితిరి. మృత్యువుతో చెలగాట మాడుచుంటిమని గ్రహింపరైతిరి. - మంత్రిగారికి స్వాతంత్ర్యమిచ్చి మీరూరకుంటిరి. ఇదిగో, అమ్మహాత్ముని శక్తిని చూడుడు. - దుర్మార్గులకు చతుర్థోపాయము చూపక, బుద్ధి కుదరదు.

కం॥ మాతా, పోలేరమ్మా!
ఘాతుకులై పలుకు వీరి గర్వమడంపన్
నీతి నిజాయితి నిలుపను
భూతములను బంపి వీరి పొగరణపగదే. (మాతా)

[ గొప్పశబ్దము గలిగి, అసరతలలతో వీరభటులు ప్రవేశించి, బుడ్డేసాబుకు త్రిశూలము చూపుదురు. అతడు వెలికలబడి, ఆ. ఆ. అని తనకలాడును. అది నవాబు చూచి ]

నవాబు :- ఏమిరా, అట్ల అట్ల అల్లాడ తావు? బుద్ధిలేదు.

[బుడ్డేసాబు దూతల చూపుతు అరచును. నవాబు వారిని చూచి అదేవిధముగా పడి అరచును. జవాను తప్పించుకొని పోబోవును. ముందుభాగము నుండి వీరభటుడు త్రిశూలము రొమ్మున పెట్టి త్రోసుకొనివచ్చును. జనాను క్రిందబడి అరచును.]

బుడ్డే :- సిద్దయ్య సామి! దయ దల్చు. నీకు మొక్కుతాము బుద్ధి లేక పని సేసినాం. గడ్డి తినినాం. - యిల్లకి పొమ్మనుసామి. కడుపునిండ పిల్లల్కి వుండార్. బతికించు. చచ్చి పోతాం. గుండె కాయల్ పగిలి పోతాయ్. ఉచ్చల్ పడి పోతాయ్ సిద్దయ్యసామి. —— (నవాబు అదేవిధముగా చెప్పును,)

జవా :- అరెరే సామి! నాది బీదది. నాదిపోతే గంజిలేక బూబు గడ్డి తినాల్సి వస్సు వుంది. బతికించు. వాడు సెప్పిన పని సేసె వాన్ని. ఇది అంతా వాడు చేసినాడు. వాన్కి పట్టిసూడు. బుద్ధిలేని మంతురుల్ వుంటే, ఇట్లా సేస్సార్.

న॥, బు॥, జ॥ :- సిద్దయ్యసామి, సిద్దయ్యసామి. (అని యేడ్తురు.)

శిద్ద :- వీరభటులారా! వీరినిచంపిన వచ్చునది యేదీలేదు. బ్రతుకనీ. మీరు పొండు. (అని అనును. వారు పోదురు.)

[ముప్వురు లేచి సిద్దయ్యనుచూచి - అరే సామి! బతికియుంచు. సలాం సలాం. బుద్ది గడ్డితిని సేసినాం ఇక యెన్నట్కి సేయం. మీది మయిమ తెల్సిపోయుంది. మాది బుద్ధి కుదిరి యుంది.]

నవాబు :- అరే బుడ్డే! పెద్ద సామీకి, చిన్న సామీకి బహుమానం యిచ్చి, బండీలో కూసోక్కి పెట్టి, సలాంచేసి పంపరా.

బుడ్డే :- అచ్చా, బహుతచ్చా. సామి! సలాం. రాండి. (పిలుచును.)

నవాబు :- (సలాంచేసి) పోయిరండి.

శిద్ద :- నవాబుగారు! మంత్రి సహితముగా మీరు మా గురువుగారి సాన్నిధ్యమునకు వచ్చి. వారిని దర్శించి, వారి ఆశీస్సులు పొంద వలయును. లేకున్న యిప్పుడొచ్చిన భూతములు మీ వెన్నంటి వుండును.

లోపల :- ఔను. వెన్నంటియుందుము. సర్వము నాశన మొనర్తుము.

నవాబు :- అరెరే, బుడ్డేఁ! సచ్చినాముమురా. సిద్ద అయ్యా బతికిఇంచు. (అని భయపడుతు సలాం చేయును.)

బుడ్డే :- (వంగి సలాంచేయుచు, భయంతో) సిద్దయ్యాసామి! వాళ్లను మాదీ యిల్లు దాటి పొమ్మను. మాకీ గుండెల్‌కీ నీల్లు నీల్లు అవ్తు వుంది.

నవాబు :- సిద్దయ్యా సామి! వాల్లకీ పొమ్మఁ. వాల్లఁ చూసి బతక లేమ్. నీల్గి నీల్గి సస్నాం.

శిద్ద :- వారు నావెంటనే వత్తురు. మీరు తప్పక వచ్చెదర?

నవాబు :- ఔను సామి. రేపేవచ్చి బెమ్మంసామి పాదాల్కి మొక్కు కోని, దీవనల్ తీసూకోని, గురు దక్షనల్‌కి యిచ్చి వస్నాం. నమ్మ నా మాటల్‌కీ.

[బుడ్డేఁసాబు సిద్దయ్యాను పిలుచుకపోయి, వెంటనే తిరిగివచ్చి నవాబుకు సలాంచేసి]

బుడ్డే :- అరెరే, ఎంత పని ఆయింది. అరే అల్లా. దూకల్‌వాన్కి ఏమి బలం, ఏమి బలం. - ఈన్కి ఇంత పొద్దువుంటె, పెద్ద వాన్కి ఎంత పొడ్వో మేరవుంది గరివికొడ్కు. - పోలేర్కి పిల్చారా అంటే గాడ్దెల్‌కి కొడ్కు. బడవకొడ్కుల్‌కీ పిలిసి, బయం సూపి పోయినాడు.

లోపల :- ఓరీ దుర్మార్గులారా! మీ బుద్ధులు తెలిసే మేము పోలేదు. వారిని దూషించినట్లయిన, మీ నాల్కలు కోసెదము.

బుడ్డే :- (భయమభినయించుచు, వడకుతు) సలాం సలాం. గాడ్దెల్ బుద్ధి, కుక్కల్ బుద్ధి వచ్చి, గడ్డీ మడ్డీ తినినాము. అల్లాతోడు. ఇంక కూాయము. మీరు పొండి. మీది మొగం మాకీ సూపితే, మాది గుండెల్ పగ్లి పోతాయి. మీరు అమ్మయ్యకు-దూతల్. మాకీ యమదూతల్. అరే అల్లా.

నవాబు :- అరే, దూతల్ కానవస్సే మన్సుల్ బతకరురా.

లోపల :- బుడ్డేఖా సచ్చిపోయి, సైతాన్ అయినాడు.

నవాబు :- ఆ, సచ్చినాడు. - అరే, బతికినావా? సచ్చినావురా?

బుడ్డే :- నేను బతికినాను. నీవు ఏమీ అయినావు. చెప్పు నవాబ్?

లోపల :- దయ్యమై నిన్ను బట్టినాడు.

నవాబు :- అరే, నీకి సైతాన్ ఆయి నాకీ సట్టినావు. - అరే, ఎంత కాలంనుంచో, నీకి ఫెట్టి ఫెట్టినాన్ గదురా. దయల్ పోయి, దయ్యమై పట్టుతావ్ కొడ్క. ఏమి బుద్దిరా. (అని తప్పించుకొని పోవ చూచును.)

బుడ్డే :- నేను చావలేదు నవాబ్. (అని పాదాలు పట్టుకొనపోవును)

నవాబు :- (గుంజీళ్లు పెట్టుతూ) అరెరే, సైతాన్ కొడ్క! పట్టుకోని తింతావు. (అంటూ, అరే, జవాన్! అని పిలుచును. వకరిచుట్టూ వకరు తిరుగుచుందురు జవాన్ చూచి, భయమభినయించి, తిన్నగ జారుకొనును. నవాబు పరుగెత్తును. వెంట బుడ్డేఖా పోవును.)

( తెర వాలును. )

## సప్తమాంకము - తృతీయ రంగము.

" సమాధి " - బ్రహ్మము, గోవిందమ్మ, పోతులూరయ్య ప్రవేశము.

వీ :- గోవిందా! సిద్ధుడు పండ్రెండు వత్సరములు మనసేవ చేసియున్నాడు. వానికి నేను చేసినమేలు, యిచ్చినశక్తి ప్రజలకు తెలియకపోయిన, అన్నాళ్లు శిష్యుడై సేవ చేసినందుకు, సిద్ధయ్యకు గురువుచేసిన మేలేమిటని, ఇచ్చినశక్తి ఏమిటని నన్ను నిందింతురు. వానియందు దివ్యతేజోబలమున్నదని ప్రజ లెరుంగుటకై, - సమాధి శుభముహూర్తము కొంచము ముందు కున్నదని, వనమునకుపోయి పూలుకోసుకరమ్మని చెప్పి పంపి,

నేను సమాధి అయినతోడనే వాకిలి మూసి, గడియవేసి, ప్రక్క నుండి చూచుచుండుడు. వానికి ఎదురు రాకుడు. శాపాను గ్రహశక్తి వానియందున్నది శపించిన తప్పక అనుభవించవలసి వచ్చును. భద్రము. అదుగో వచ్చుచున్నాడు. చెప్పి పంపుము.

[అని సమాధికి ముందు భాగమున పద్మాసనస్థుడై కన్నులు మూసి కూరుచోనును. ప్రజలు వత్తురు. - సిద్దయ్య ప్రవేసించి, గురునకు నమస్కరించి నిలుచును.]

గో .- నాయనా సిద్దయ్యా! వనమునకుపోయి పూలు కోసుకరమ్మని గురువుగారు చెప్పినారు. ఇంక కొంత వ్యవధియున్నది. సుము హూర్తము ప్రవేసించలేదని సమయముకొరకై యోగనిష్టలో కూరుచున్నారు. పోయిరా నాయనా.

శిద్ద :- అలాగేనమ్మా. (అని అతితొందరగా వెళ్లిపోవును.)

వీ :- (లేచి, సమాధికి ప్రదక్షిణచేసి, నిలుచుకొని) ఓం శ్రీ పర బ్రహ్మణేనమః, ఓం శ్రీ సచ్చిదానంద స్వరూపాయనమః, ఓం శ్రీ హరిహర విధాత స్వరూపాయనమః - [అని సమాధిలో చేరుకొనును. - దానంతటది మూత మూసుకొనును. సకల వాయిద్యములు మ్రోగింతురు. కరతాళధ్వనులతో]

( తెర వాలును. )

## సప్తమాంకము — చతుర్థ రంగము.

"కవాటము మూసివుందురు." - రామయ్య నిలుచుకొని వుండును. సిద్దయ్య పూలను తీసుకొని తొందరగా అక్కడికి వచ్చును.

రామయ్య :- సిద్దయ్య! నీవెక్కడికి పోయివుంటివయ్యా? బ్రహ్మము గారు సమాధి అయినారు. - లోపలికి యవరు రాకూడదని, నన్ను లోపల రానివ్వలేదు. నేను వారిని చూడవలయునని ఎంతో ఆశతోవచ్చితిని. ఫలము లేకపోయెను. - నేనుం చేసెది,

నీవు ప్రియశిష్యుడవే నీ వెక్కడ పోయివుంటివయ్యా? నీవులేని సమాధియా?

శిద్ద :- కర్మ బలీయమైనప్పుడు ఎక్కడికైనా యీడ్చును. కర్మ బలీయమైనప్పుడు తన్ను నిరంతరము కాపాడు దైవముకూడ వైతొలగునన్నాడు గురుదేవుడు వాస్తవము. - తల్లి తండ్రిని విడచి వచ్చి. తల్లి తండ్రి గురువు దైవము వారేనని నమ్మి ఇంతదనుక సేవ చేసితిని. తన కుమారులకన్న మిన్నగా చూచెను. అడిగినవాటి కన్నిటకు తగు సమాధాన మిచ్చెను. - ఏనాడు దూరము చేయనివారు, ఈనాడు దూరముచేయుటలో ఏదో పరమ రహస్యమున్నది. కానీ భక్తి గొప్పదియో, శక్తి గొప్పదియో - దాసుడు గొప్పవాడో, దైవము గొప్పవాడో తేలవలసిన సమయము వచ్చినది. పండ్రెండు వత్సరములు ఏ దైవమును ధ్యానించిన, సేవించిన, ఆ దైవము ఆ జీవియందుండునని చెప్పెను. ఆ బలము నాయందున్నది లేనిది పరీక్షించుటకు మంచి సమయము. - మాతా పోలేరమ్మా! పిలిచినతోడనే దర్శనమిచ్చి, అడిగినదానికి తగుసమాధాన మిచ్చుచుంటివి. నీవూ దూరమైతివా? - ఔను. నా గురుదేవుడే దూరము చేసినప్పుడు, నీవు దూరము చేయుటాశ్చర్య మేమున్నది. మీరు దూరముచేసినను, బాల్యమాదిగ ఆచరణలోనున్న బ్రహ్మచర్య వ్రతబలము, పండ్రెండు యేండ్లు ఆరాధించిన అధిష్ఠాన దేవతాబలము, పండ్రెండు వత్సరములు గురుసేవ చేసిన శిష్యబలము నాయందున్నది. నాకు సహాయపడవా? - పడకపోనీ, ఏమైనగాని ఇక్కడనే సచ్చి, సూక్ష్మదేహముతోనైన పోయి గురుదేవుని చూతునుగాని, వెనుతిరిగి పోను. ఇది నా నిర్ణయము. ఒక్కదెబ్బతో దేహమునకు, జీవునికి సంబంధము తెగిపోవలయును. - గురుదేవ! స్థూలదేహ సంబంధము త్రెంచుకొన్నను, సూక్ష్మదేహమును ఎట్లు త్రెంచుకొందువు. ఇదుగో వచ్చుచున్నాను. (అని వాకిలిని తలతో తగిలి, చావ నిశ్చ

యించుకొని, - పంచ వెగచెక్కి, అంగవస్త్రము నడిమికిచుట్టి, తలవంచి, తగులపోవునప్పుడు)

లోపలనుండి పోలేరమ్మ :- ఆ! అగు సిద్దయ్యా, ఆగు.

శిద్ద :- ఆగి, యేమిచేయవలయును తల్లీ. - గురుదేవునికి దూరమైన ఈ దేహముండి ప్రయోజనమేమి?

పోలేరమ్మ :- నీవు, నీ గురునకు దూరముకాలేదు. నీకొరకై వేచి యున్నాడు. నీలో శక్తియున్నది, లేనిది లోకులకు విదితమౌ నట్లు చేసినారు. చింతింపక, తెగింపక వారిశక్తినే ఉపయో గింపుము. కవాటము బ్రద్దలైపోవును. నీకెదురయ్యేడు వారొ క్కరు లేరు. ప్రకృతినే జయించిన నీకీ కవాటము అడ్డు నిల చునా? ఊ. కానీ.

శిద్ద :- జగన్మాతా! అనంత ప్రణామములు. కృతార్థుడనైతిని. నీ మేలు మరువను. నిన్నహర్నిశము తలంతును. - గురుదేవ!

తే॥ రేయిబవలును యాసటలేక గురుని
సేవ నెరనమ్మిచేసిన శిష్యునేని
వారి కారుణ్యమునకేను పాత్రునేని
వ్రయ్యలైపోవుగాత కవాటమిపుడె.

[గొప్ప శబ్దముతో కవాటము బ్రద్దలైపోవును. - జగన్మాతా! సెలవు. - అని నమస్కరించి, సంతోషముతో పరుగెత్తును.]

రామయ్య :- అబ్బ. అబ్బ. ఏమిశక్తి. ఏమిశక్తి. వాకిలి వ్రయ్యలై పోయింది - ఇంకేముంది, బ్రతికినవాడు చస్తాడు. చచ్చిన వాడు బ్రతుకుతాడు. ఈ దెబ్బ నాకు పడివుంటే, గోవిందా గోవింద. నాశక్తి త్రాసుపట్టి తూచడములో, సేరు పట్టి కొల్చ డములో శక్తి చూపిస్తాగాని, యిటువంటి శక్తి ఎక్కడిది. - ఈ శక్తివున్నవానికి, ఆ శక్తిలేదు. వోళ్ళు గొట్టేశక్తి వున్న వానికి, వాకిళ్ళు పగులగొట్టేశక్తి ఎక్కడిది.

[అంతలో గోవిందమ్మ, పోతులూరయ్య, కొంతమంది ప్రజలు వచ్చి చూచి]

గో :- గురుదేవుని మహామహిమ సంపాదించుకొన్నాడు. దైవత్వము సంభవించినది. ఇక సిద్దయ్యకు అడ్డులేదు - అక్క డేమి జరుగునో చూతము పద. అందరు లోపల పోదురు.)

( తెర వాలును. )

## సప్తమాంకము — పంచమ రంగము.

"సమాధిచెంత సిద్దయ్య"

శిద్ద :- గురుదేవ! నేను చేసిన అపరాధమేమి? తాము సమాధియగునప్పుడు చూడకూడని పాపాత్ముడనా? నాపై ఇంత కాఠిన్యమెందుకు? నాకేమిచెప్పకనే మరుగైతివే. ఇక నాగతేమి? - గురుదేవ! నాకు నీ దరిశనమిచ్చి, ఒకమాట మాట్లాడవా? దయామయుడవే. నాపై నీకు దయలేద. కానీ, నీ శక్తినే నీపై ప్రయోగించి, కాకపోయిన ఇక్కడనే ప్రాణములు వదలి నీయందే ప్రవేసించెదను. నీ సేవే చేసెదను.

[ప్రక్కలనుండి గోవిందమ్మ మొదలగువారు చూచుచుందురు.]

తే॥ పదియు రెండేండ్లుగా నీదు పంచగాచి
సేవజేసితి తప్పును చేయకేను
కడన కడజేసిపోతివా కరుణలేక
ప్రజలకేమనిచెప్పి నేబ్రతుకవాడ.

గురుదేవ! సిద్దుడు ఎంతటి ఘాతుకకృత్యమామహానీయునికి చేయతుండిన, ఇట్లొనర్చునని ప్రజలందురే? వారికేమని చెప్పుదును. ఈ అపకీర్తిని ఎట్లు భరింతును ఎట్లు జీవింతును.

ఉ॥ చూచితివీవు నన్నెపుడు సూనునిరీతిగ, నిప్పుడిట్టులన్
నీచునిరీతి చూడగను నేనొనరించిన నేరమేమి, నన్
చూచినవారిలోన తల సూపి భరింపగనౌనె నిందలన్
నీచునిజేసి చేవిడిన నేనెటుబోదు మహాత్మసద్గురూ.

దయామయ! నీ శక్తినే నీపై ప్రయోగించి, కాకపోయిన ఇక్కడనే ప్రాణముల విడచి, నీచెంతనే చేరెదమగాని ప్రజలకు

నా ముఖము చూపింపను. - ఓ ప్రకృతిమాత!

తే॥ రేయిబవలును యానటలేక గురుని
సేవ నెరనమ్మిచేసిన శిష్యునేని
కరుణనాపైన గురునకు గలుగునేని
దరిశనంబిచ్చు గావుత తప్పకిపుడే.

[సమాధి పైబండ లేచిపోవును. - వీరబ్రహ్మము లేచి]

వీ :- సిద్ధుడు! చింతింపకుము. నీలో శాపానుగ్రహ శక్తులున్నవని, ప్రజలకు నిరూపించు నిమిత్తమై యిట్లొనర్పవలసి వచ్చినది. - ప్రీతిలేక కాదు. నీవిక స్వగ్రామముచేరి, రాజయోగమున జీవనము చేయుము. జీవితాంతమున నన్నే చేరుదువు. మీ తల్లి యాజ్ఞను శిరసావహించి, ఈ కుటుంబము నొకకంట చూచుచుండుము. ఇదుగో పాదుకలు. - (బ్రహ్మము యిచ్చును. సిద్దయ్య రెండు చేతులు సాచి తీసుకొని, కన్నుల కద్దుకొని, హృదయమున కాంచుకొని, వంగి, తలవంచి నమస్కరించును.)

వీ :- మోక్ష ప్రాప్తిరస్తు. (దీవించి, సమాధిలో కూరుచొనును. - పైబండ మూసుకొనును.)

[గోవిందమ్మ, పోతులూరయ్య మొదలగువారు వచ్చి, సిద్దయ్యను చూచి సంతోషించెదరు. పోతులూరు కౌగలించుకొనును. - సిద్దయ్య గోవిందమ్మకు నమస్కరించును.]

గో :- సకలాభీష్ట సిద్ధిరస్తు.

శిద్ద :- అమ్మా! పోయివత్తును. సెలవిండు.

గో :- నాయనా! రాజయోగివై, చిరకీర్తివంతుడవై మనుము. పొమ్ము.

శిద్ద :- (పోతులూరును చూచి) అన్నా!

పోతు :- అప్పుడప్పుడు వచ్చుచు పోవుచుండుము.

శిద్ద :- జీవుడిక్కడ, బొందె అక్కడ. పోయివచ్చెదను. - (నమస్కరించి పోవును.) (తెర వాలును.)

సమాప్తము — మంగళం